# దాశరథి విలాసము.

క్రొత్తపల్లి లచ్చయకవి ప్రణీతము.



శ్రీ చలికాని సూర్యారావు

గారిచే ప్రకటింపఁబడినది.




కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1928.

వెల రు. ౧-౮-౦.

# కవిప్రశంసాదులు.

(క్రీ. శ. 1863?—1898.)

ఈ దాశరథివిలాసమును రచించినకవి కొత్తపల్లి లచ్చయ్య. పిఠాపురము సమీపముననున్న చెందుర్తిగ్రామవాస్తవ్యుఁడు. ఈతఁడాపస్తంబసూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. వెలుఁగాటివైదికబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు రామన్న. తల్లి సుబ్బమ్మ. ఎనమండ్రన్నదమ్ములలో నితఁడు నాల్గవవాఁడు. తనవంశవృత్తాంతమును గవి కృత్యాదిని వివరించియున్నాఁడు. ఇక్కవికుటుంబము చిరకాలమునుండి రావువారిసంస్థానము నే యాశ్రయించి యుండెను. ఈతఁడు శరీరారోగ్యము చాలనివాఁ డగుట నారోగ్యమునకే మొదట దుష్కరప్రాససూర్యశతకమును రచించెను. తర్వాత తిరుమలయాత్ర పాదచారియై చేసి వచ్చి శ్రీవేంకటేశ్వరున కంకితముగా శ్రీమన్నారాయణుని దశావతారములలో నేడవదియగు శ్రీరామచంద్రుని దివ్యచరిత్రమును (దాశరథివిలాసముగా రచియించి) సమర్పించెను. భారతవర్షములో నాబాలగోపాలమునకు నిత్యస్మరణీయుఁడును బూజనీయుఁడు నైన శ్రీరామదేవుని దివ్యచరిత్రమును తనలలితకల్పనాకల్పకమునుండి ప్రాప్తపద్యప్రసూనరూపమున వెలువరించుటకుఁ గవి తనయిరువదియవ యేఁటఁ బ్రారంభించి తల్లి తమ్ముల మొదలగువారు మరణించుచుండుటచే నడుమనడుమ విఘ్నములు సంభవించుచుండినను బూని విడువక పదిసంవత్సరములకుఁ బూర్తిచేసెను. తరువాత, తానే యిప్పటికి రెండుప్రతులను వ్రాసెను. మొదటిచిత్తుప్రతి చాలభాగము తాళపత్రప్రతి. రెండుమూఁడుప్రతులు కాగితములు. కవి, తాళపత్రములమీఁదఁ గాకితములమీఁద నొక్కవిధముగానే వ్రాయఁగలిగియుండెను. అతఁడు వ్రాసినసుద్ధప్రతులలో నొక్కటి చెన్నపురి ఓరి

యంటల్ లైబ్రరీలోనున్నది. రెండవదానిం బట్టి యీముద్రితప్రతి సిద్ధముచేయఁబడియెను. కవి గ్రంథసమాప్తి చేసినపిమ్మటఁ దన ముప్పదియైదవయేటఁ గావచ్చును, హేమలంబిసంవత్స రాశ్వయుజ బ ౮ నాఁడు కాలధర్మము నొందెను. తనజీవితకాలములో ముద్రణ మునకై యనేకయత్నము లొనర్చెను, గాని, కాలమును బురస్క రించుకొని కొనసాగలేదు. తదనంతర మతనితమ్ములప్రార్థనమున శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరుగారు తమమంజువాణీ పత్రికలోఁ బ్రకటింప ననుగ్రహించిరి. కాని యంతలో నాపత్రికా ప్రకటనము నిల్చిపోవుటచే నైదాశ్వాసములతో నీగ్రంథ మసమగ్ర ముగనే యుండవలసివచ్చినది. ఆపుస్తకములైన నెక్కడ దొరకుట లేదు. ఇన్నినాళ్ళ కిప్పుడు రసజ్ఞులును, భాషాపోషకులును, నాశ్రిత పక్షపాతులు నగు శ్రీరావు వెంకటనరసింహారావుగారు గ్రంథమును జిత్తగించి చూపిన ప్రోత్సాహముచే గవివంశమునకుఁ బోషకు లగు శ్రీకోలంకవీరవర సంస్థానప్రభువులు రాష్ట్రమణులు సత్కార్యనిర్వహణ మునకు ముందంజవేయువారు, దేవబ్రాహ్మణభక్తిపరతంత్రులు, నగు శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావుబహద్దరువారి యొక్కయు శ్రీ రాజా రావు రామయ్యమ్మారావుబహద్దరువారి యొక్కయుఁ గరుణాకటా క్షలేశమున సంపూర్ణముగఁ బ్రకటింపఁబడినది. ఈదాశరథివిలాసము పూర్తిచేసిన యనంతరమునఁ దనప్రభుభక్తి వెల్లడించుచుఁ గవి రచించిన చెల్లయ్యమ్మశతకము నాఁడే యిక్కార్యము నెఱవేఱవలసినది, గాని, యప్పటికి దీనికిఁ బ్రకటనకాలము రాలేదు. అనారోగ్యతచేతఁ గవి వివాహమును నిరాకరించెను. ఈకవి విద్యాభ్యాసము తనపెద్దయన్నగారగు గంగయ్యగారి యొద్దఁ గావించెను. గంగయ్యగారు పురాణము చెప్పుటలోఁ బ్రసిద్ధుఁడు. ఆయనతోఁ గూడ నుండి రామాయణాది పుస్తకములు చదివియే కవి యీతటగ్రంథమును నిర్మింపఁ బ్రజ్ఞ

ను గడించెను. గంగయ్యగారిప్పటికి రెండుసంవత్సరములక్రిందటఁ దనడెబ్బదియవయేట స్వర్గస్థులైరి. ఈలచ్చయ్యకవి యాశుకవిత్వము గూడఁ జెప్పువాఁడు. సమస్యాపూరణమున నిపుణుఁడు. పల్లెటూరి జనులను రంజింపఁజేయుటలో గట్టివాఁడు. ఎవ్వరేకథ నేరీతిని జెప్పుమన్న నారీతిని బొబ్బిలిపాట, శారదకావ్యము, కోలాటపుఁబదములు మొదలగుగీతులతో, అనుధారగ గ్రామమధ్యమున రాత్రులలో వీధిని నిలువఁబడి పాడి జనరంజనము చేయువాఁడు. ఈయనపాటలు వినఁగోరి చుట్టుప్రక్కల గ్రామజనులు పిల్చిన వచ్చుట వివిధరీతులఁ బాడి యానందపఱచువాఁడు. కొందఱు శిష్యుల కాపాటలు నేర్పెను గాని యాశిష్యులును గురువుగారితోనే యున్నారు నవ్వుపుట్టించునట్లు మాటలాడువాఁడు. ఒక్కనాఁడు పొలములోఁ జెట్టెక్కి తేనెపట్టును దీసెను. ఈఁగలు చేతిప్రేళ్ళమీఁద గుట్టినవి. ముంజేతివఱకు వాఁచెను. చూచినజనులు "లచ్చయ్యగారు! చేయివాఁచినదే" మని యడిగిరి. ఝటితిస్ఫురణచేఁ బ్రత్యుత్తరముచెప్పి లోకమును మెప్పించు నేర్పుగలుగుట — "నేనినాఁ డుదయమున నడవిలోనికి వెళ్ళియుంటిని. "పులిగని"లో నొక్కసిద్ధుఁడు దర్శన మిచ్చి నీరసించిన నాశరీరము బలుపుఁజెందుటకై యొకసిద్ధరసమును జెప్పినాఁడు. ఆయాకుఁబస రెంతవఱకుఁ బనిచేయునో యని నలఁపి యీచేతికిఁ బట్టించితిని. పట్టినంతమట్టు నిట్లు బలిసినది" యని వారి నాశ్చర్యమగ్నులఁ గావించి కొంతవడికి వాస్తవమును జెప్పి నవ్వించెను. ఇక్కవి తనకవిత్వము, కల్పనలు, వర్ణనలు, మొదలగునవి జన్మభూమి యగుచెందుర్తిలోని ప్రజలు, అక్కడి యడవి, పర్వతములు, మృగములు, వృక్షలతాదులును జూచియే విరివిగా సంగ్రహించెనని గ్రంథమునందలి యనేకదృష్టాంతములను బట్టి కవిస్వభావ మెఱింగినవారికిఁ బొడకట్టకమానదు. ఒక్కనాఁడు బొమ్మలాటవారివలె రంగనాథరామాయణములోని

లక్ష్మణమూర్ఛఘట్టము రాత్రిపూట జదువుచున్నాఁడు. అందు సంజీవకరణి విశల్యకరణి యిట్లేవో కొన్నిపేరులు వచ్చినవి. ఒక్కఁడు వానిని విని కరిణి యేమి టని ప్రశ్నించెను. కరిణి యెఱుంగవా "మద్దెలకరిణి,......" యని నప్పుడుఁ జెప్పెను. చెప్పినంతన తనకు స్వవిషయ మొక్కటి తలఁపునఁ బడినది. ఈయనతమ్ముఁడు అక్కప్ప యను అర్కయ్య జ్వరములోఁ జెవికిందనొక్కకర్ణి యనుగడ్డ లేచి మృతుఁడయ్యెను. ఆవిషయము, కరిణియని చెప్పినంతలోఁ దోఁచి పుస్తకము మూసి తలవాంచెను. కారణము దెలిసికొని శ్రోతలు, ఎప్పుడో చనిపోయినవానికై యిప్పుడు మీవంటివారు విచారించెదరా? గతముగతమే యని మోదార్చిరి. అంతకుఁ గొంతకాలములోనే తనరామాయణములో (దాశరథివిలాసమున) లక్ష్మణమూర్ఛఘట్టము వచ్చినది. అపుడు 6 ఆశ్వాసము 921 పద్యమును-

సీ. ఒంటినున్నయపుడు సౌఖ్య మొందునపుడు
నాడునప్పుడు బంధులఁ గూడునపుడు
మఱపురాక సహోదరమరణశల్య
మెమ్ములను గీఱుచున్న నూత్నేత్రస్తకైవ.

అని వారికిఁ బ్రత్యుత్తరముగా వ్రాసిపెట్టెను. ఈఅక్కప్పగారిప్రజ్ఞ యసాధారణమైనది, అగ్నిస్తంభన, జలస్తంభనము, గారడి, నరవిద్య, సాము, గరిడి, కాగితపుటట్టలు కత్తిరించి తెఱబొమ్మలాడించుట, పందెమువేసి యగాధజలములో ననేకవిధముల గంటలకొలఁది నీఁదుట, వంటచేయుట, కావడిమోయుట, కుట్టుట, బొంగరములు బరిగెలు పట్టుట, కమ్మరము, నేఁతపని, తాళ్లుపేనుట, మంచములు

నేయుట, బుట్టలల్లుట మొదలగు వివిధములైన చేతిపనులు వినోదమున కై యభ్యసించెను. కవిత్వము చెప్పువాఁడు, వివాహోపనయనాదులు చేయుచు స్మార్తకలాపము గొంత నేర్చెను. అట్టివానిమృతి యాకవికి విచారజనకము కాకపోవునా? ఇక్కవి బీదలనుగాంచి యోర్వలేఁడు. తన కున్నదానిలోనే వారికి వారమునకు నెలకుఁ గొంత గొంత యిచ్చువాఁడు. దానికై వినియోగించుటకుఁ మిత్రులయొద్దఁ జేసిన చేబదుళ్ళు- ఈతనిమరణానంతరము జనశ్రుతినిబట్టి యుత్తమర్ణులను దెలిసికొని గంగయ్యగారు మరల నిచ్చివేసిరి.

ఇట్టి మహనీయకృతిని పండితపామరలోకమునకై యొసంగి తత్ప్రసాదమున నుత్తమలోకమునందుఁ జిరస్థాయియై యున్నకవియొక్క చిత్రము శ్రీరాష్ట్రస్వాతీయమున కాతనిపైఁ గలవాత్సల్యమునఁ బ్రచురింప ననుగ్రహించినందునఁ బ్రశాంతమై యుండుఁగాక. ఇట్టిఘన కార్య మొనర్చిన తమయేలికలయు వారిపూర్వులయు గుణకీర్తనము గావించుచు, ప్రభుప్రశంస యనుపద్యములను మొదటఁ జేర్చిన నలువురలో సూర్యరావు సుందరరామయ్య యనునిరువురును గవికిఁ దమ్ములు. రామచంద్రమూర్తి పెద్దన్నగారగు గంగయ్యగారి పెద్దకుమారుఁడు, సోమసుందరము రెండవయన్నగారగు వెంకయ్యగారి పెద్ద కొడుకు.

శ్రీమతు లగునీప్రభ్వీద్వయము సాధుజనావనము సత్క్రియాచరణమును గావించుటయే పరమధర్మం బని సంపూర్ణముగ నెఱిఁగి యుండుటచే నింకను నిట్టిభాషాపోషకములును చిరకీర్తిదాయకములు నగుకార్యము లొనరించి నిజసంస్థానము కవిపండితసజ్జననివాసయో

గ్యమై లక్ష్మీసరస్వతులకు విహారస్థానమై యుండునట్లు చేయునుగాక ! శ్రీవారియశస్సు దిగంతవిశ్రాంతముగా నుండు నట్లొనర్ప వారి యిష్ట దైవము లనుగ్రహింతురుగాక.

సహజపాండిత్య మగుటను, పండితసాంగత్యము పూర్తిగా లేని వాఁ డగుటచు గొన్ని గొన్నితావులఁ బ్రమాదము లగపడును. దోషజ్ఞులు వానిని పెద్దచేయరు. కవిత్వమునందలి తక్కినసుగుణములఁ గాంచి యానందించిరేని గీర్తిశేషుఁడయినకవి కృతార్థుఁ డగును.

లక్ష్మీనరసాపురము,
4 జనవరి 1928. } చెలికాని సూర్యారావు.



గీ. నట్టి శ్రీచెల్లయాంబ మహాజ్ఞ మసలి, సన్నుతుల నొందె నని యెంతు జను లనంగ
నక్షతం దలలోనాల్క యగుచు వెలసె, రమ్యసద్గుణనికురుంబ రామయాంబ.

సీ. తొరతండ్రిలనుండి తమకొల్వుం దీర్చు భృత్యులం గాచి పుణ్యంబులొందు ననియు
దేశమ్ముం గాలమ్ముం దెలిసి ప్రజానురంజనముగం బాలింపం జాలు ననియుం
బుట్టినయింటికి మెట్టినయింటికిం, బేరుం దెచ్చి యశంబు బెంచు ననియు
మానితసంస్థానమర్యాద లారసి, కులమువారల పేరు నిలుపు ననియు

గీ. నరసి చెల్లాంబ స్నుషకు రాజ్యం బొసంగె, నాదిరాజన్యపద్ధతి ననుసరించి
యహహా! స్వార్థపరిత్యాగ మనంగ నిట్టు, లుండవలయదె యని మెచ్చ నుర్విజనము.

సీ. నాంటనాంటను రమానాథుపైం బొదలుభక్తి యవిరళం బని తెలుపుకొనుచు
వరసూర్యరాణ్మహోదర్తిపైం గల్గు మిండిపేర్మి ముం బ్రకటించుకొనుచుం
బావనలక్ష్మీనివాసరంగములపై, భావ మెంతయుం దేటపఱచుకొనుచు
నిర్మలఘనయశోనిలయ నై యనియెద, నంచు జగతి కెఱింగించుకొనుచు

గీ. బళిర! చెల్లయాంబను దిరుపతియు నెండ,పల్లె క్షేత్రంబు దామరవాడయు సిత
చంద్రసౌధమ్మయు స్వయసాన్ద్రంటి మట్లు, చెందె; నాటు నె సాధ్వులకీల మెంగు

సీ. తనభవ్యవినయాదిఘనలక్షణంబులు, నారాయణాంశసంజనతం దెలుపం
దనగురుశుశ్రూష యనయంబు వాయని, సూర్యపత్నీత్వవిస్ఫూర్తి నెఱపం
దనయపూర్వసహజధర్మగుణప్రౌఢి, ప్రత్యర్థిపటలసంవర్ధనముగం
దనయందె యది నిల్చినస్వసింహ నాదృతి, శ్రితులం బ్రోత్సాదత్వసిద్ధిం దేల్పం

గీ. ప్రబలుం గవిమండలాశీఃపరంపరాప్తి, పుణ్యగాభ్యుధి నాగప్రభూతపూర
నిర్మలవియన్నదీసదృశ్నిబిడకీర్తి, రాజితాశాకదంబ శ్రీరామయాంబ. 28

సీ. సితచంద్రసౌధపఙ్క్తిప్రభావరణంబు, పద్మనాయకకులపాలితంబు
ప్రచురవిశాటసంకులధూమకేతువు, మాధవక్రీడాసమానసీమ
విలుధసన్మరసత్రివేణ్ప్రపూర్ణంబు, ధన్యసుమిత్రావతంసభవన
మనిలకిశోరవిహారోపవనరాజి, వనగతభూజాలివైభవంబు

గీ. భరతశత్రుఘ్నచణభద్రభటసహాయు,తంగు కుశలవసుప్రసిద్ధమ్ము నగుచు
రామరాజ్య మనంగ నీరామరాజ్య, మలరె నన మించె రావురామాంబగేహ. 29

సీ. రావుసద్వంశవారాశి యయిష్పంగంగా, వెలసినచంద్రునికళ లనంగ
ధర్మంబు నాల్గుపాదముల వర్తిలం గలిం, బ్రబలినధర్మదేవత లనంగం
బ్రాచీనవాక్యసుప్రకటనాసక్తి మై, జన్మించినసరస్వతు లనంగ
సాంద్రశ్రీవీంద్రావ యాచింపదేసిన, భవ్యపాకసతపఃఫలము లనంగ

గీ. నన్నవాయమునను బ్రజ నరయుపట్లు, నధికవిద్యాప్రసక్తిఁ దా మధిక లగుచుఁ
రాణిలెడు చెల్లయాంబయు రామయాంబ, సన్నుతికిఁ బాత్రములు గారె జగతిలోన.

క. విద్యాసరస్వతులు నృప,విద్యాపారగలు భార్గవీపూర్ణకృపా
మాద్యత్సంపద్విలసిత, లాద్యలు మటి యత్రకోడ లన్నితిలోనన్. 31

ఉ. ఆరయఁ బూర్వకాళిక్రియుల నాశ్రితపుత్రుల వారిబిడ్డలన్
వారియనుంగుకూనల నవక్రిదయామతిఁ గాచుపృథ్వి శ్రీ
ధారణి రావుచెల్లమకుఁ దప్పక రామమ యంచు లోకమున్
సారెకు సన్నుతింపఁగఁ జెలంగి వదాన్యత మించి రెంతయున్. 32

ఉ. అయ్యలు నమ్మి తైప్రజల నారయుచుండిరి చెల్లమాంబ రా
మయ్యయు వారి నెల్లనిన నర్హము; ప్రోత్రఫల గాక యల్పమే?
యయ్యెడ నాతుహోబలుని నేమెఱింతుము మూఁడుమార్లు చె
ల్లయ్యయు రామయాంబ యని యడ్డిఁ జాలము వ్యాకృతిప్రథన్. 33

క. ఇంద్రుం డని చంద్రుం డని, నేంద్రుం డని పొగడు కవిమహీయుమ్మగ వాఁ
డింద్రుఁడొ చంద్రుఁడొ తెలియ ది,నేంద్రుఁడొ యీ ఛత్రమాట లేత్రికి మాటన్. 35

ఆ. పన్నె దున్న యట్టు లగ్గడింపఁగ నేండ్లు, బూండ్లుఁ బట్టు లేనిపోని వేల?
యట్టి కగురలేని రూపికతో నుండి, స్వర్గమునకు నెగుర పోగునట్లు. 36

గీ. త్రగమానానురూపపత్రవర్గనమున, మించి యశేమునఁ బ్రజలఁ బాలించు నల్ల
దిక్యారెచర్లగోత్రసందీపిత లకు, సత్రకోడం డ్రోత్రనోక యవసరమున. 37

సీ. కిరణయాగ్మభిరంజనదివ్యకుండల, భ్రాజితం బగుసోమయాజికులము
బహుమానితానర్ఘభర్మశాటీవిరా, జిత మగుపండితసింహాసితతి
శుద్ధమాణిక్యసన్నద్ధకాంచనకంక,ణాదిభూషితకవిబృందకలితము
హారకిరీటకేయూరవిభూషాళి, రామమహాసామంతరాజసమితి

గీ. నాగవల్లీదళకరండపూగముక్త, చంద నాగురుకర్పూరచారుముకుర
ముఖ్యనృపలాంఛనద్రవ్యములు గ్రహించి, సేవకాళియు నందంను సేరియుండ. 38

మ. మమఁ గౌండిన్యసగోత్రసంభవుల సమ్మానాస్పలన్ శశ్వదు
త్తమతాత్పర్యకరపరికల్పనకళాధౌరేయులన్ రాజస
త్తమసల్లోహదయతార్యవాంఛితుల సత్సంగత్యశోభధ్యులం
బ్రమదాన్వయులఁ బూర్వకాశ్రియులఁ బిల్వంబంచి ప్రేమంబునన్. 39

చ. కుశలమె మీకు బిడ్డలకుఁ గూరిమిఁ దప్పక మీర లుందురే?
పశువులు పాఁడిసేఁ పెడెనె? సస్యమృగంబులబాధ వాగెనే?

కుశలమె యీయూరివారలకుఁ గూపతటాకములందు నీరము న్
భృశముగ నున్నదే! తొలుత నిచ్చినక్షేత్రము పండుచున్నదే! 40

గీ. పూర్వముంబోలె సంతతంబును బూజ, లొస్గుచుందురె! కావ్యముల్ గూర్చుచుండ్రె!
ఘనత రాన శ్రీరఘుకులంబు గౌరవంబు, నడపుచుందురె మీర లందఱును వేడ్క? 41

క. అనిశంబును మీ క్షేమము, వినుచుందును వారు వారు వినిపింపఁగ మీ
రును వచ్చిపోవుచుండుం, జయమగుఁ గాక! యటంచు నాప్రసంగవశమునన్. 42

ఉ. అన్నవగారు లాకుటిమీయందునఁ బ్రాఁగు మెలంగ్రి చెప్పె వి
లన్నన రామభద్రుఁడు కలాప మపూర్వముగాఁగఁ దోఁచె; నా
మెచ్చుప్రబంధరాజ మది మేకొని నామదిఁ బాయకుంట నీ
వచ్చుమగాదె దానికి ధ్రువంబుగ నత్తురిత లెమ్మయియున్. 43

సీ. ఆంధ్రగీర్వాణము లభ్యసింపఁగలేను, సేవించి నేర్వ దేశికుఁడు లేఁడు
వ్యాకరణజ్ఞుల పరిచయంబు వాలేకి, పండితస్నేహ మాకంత లేదు
కవిజనపాళిసాంగత్యంబు పూజ్యంబు, గ్రంథజ్ఞులప్రశంస స్వప్నవార్త
గ్రంథావలోకనగరిమయు నల్పంబు, సహవాసులసహవాసంబు కల్ల

గీ. నయవిశారదుఁ డన్న మనంబు లెన్న, వయసునకుఁ బిన్న కల్పనాప్రతిభ మిన్న
యుమరఁ బదరాజిఁగూర్పఁ బోతన్న కొ,త్త్ర,పల్లవన్న రాతిఁను కేవలుఁ డితలఁప.

సీ. సభఁ బురాణముఁ జెప్పసాగినా రెండవ,సూరునఁ డీరండనుచొప్పఁ బోలిచి
రాజకీయరహస్యసూజనాశీల యుఁ,గంభీరమంత్రిశ్రీ శ్రేష్ఠుఁ బడసి
మన్నించుప్రభువులమాట నాఁదలనిడు,పట్ల కేసలభటుత్వముఁ గాపి
నీతిబోధనమును జెలుపుచో నపరచాణక్యుఁడై యారెఁ దనంగఁ దనరి

గీ. మానఘనుఁ డయి మల్లన్న ధీనమునన, చిఱుతనాఁటను గోలె వసించినట్టి
లచ్చనార్యుని మఱువంగ వచ్చునెట్లు, కవివరుఁ డతండు రామనగన్నసుకృతి. 45

ఉ. ఆతనికల్పనావిభవ మాతనిమంజులశబ్దబంధనం
బాతనిశైలిమాధురియు నాతనిసన్నయముపక్రియం
బాతనియర్థగౌరవము నాతనిసాహితి యెన్నఁ బోలునే!
తాతకు వానితాతకు సతంబు ధరిత్రి వహించుతాతకున్. 46

గీ. అరయఁ జెందుర్తి జన్మించి యుంది పెరిఁగి, యున్న మెలఁగక నీగక్తి నఖిలకళల
నెఱిఁగి జగములఁ బేరొందెఁ బెరటిచెట్టు, మందునకురాదటన్న సామ్యంబు దోఁప.

సీ. రామాయణగ్రంథరచనకు మున్నుగ, భాస్కరశతకంబు భాస్కరుండు
వ్రాసిన చందాన వ్రాసె సంయుక్తాక్షరప్రాసమునను సూర్యశతకంబు

వ. అని కృతజ్ఞతం దెలుపుకొనుచు నాశీర్వదించి.

గీ. శాస్త్రిలార! పండితులార! సత్కవీంద్రులార!సజ్జనులార ! ధర్మాత్ములార !
యధిపులార! బంధువులార! యాప్తులార!, సకల సద్వర్ణులార! రసజ్ఞులార.

క. దేవతలను దాపసులను, దైవజ్ఞుల నమృతవాక్సుధావర్షుల స
ర్వావనిదేవుల యీమా, రావుకులాధిపులఁ బ్రోవఁ బ్రార్థింపుఁడొగిన్.

వ. అని లోకము ననారతము నారాధించుచున్నారము.

క్రొత్తపల్లి సూర్యరావు.
క్రొత్తపల్లి సుందరరామయ్య.
క్రొత్తపల్లి రామచంద్రమూర్తి.
క్రొత్తపల్లి సోమసుందరము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథివిలాసము.



## ప్రథమాశ్వాసము.

శ్రీమద్గైరికధాతువేష్టితము నై శీతాంశుసంవ్యాప్త మై
యారామం బై తనరారువేంకటనగేంద్రంబు స్వారిదాద్రిస్తనో
ద్దామం బై మృగనాభిలిప్త మగుపర్యాప్తోవిరవక్షోజ మం
చామోదించెడివేంకటేశ్వరుఁడు మమ్మాసక్తి రక్షించుతన్.

ఉ. మారుఁ గుమారుగాఁ గనినమా కనయే సతి పల్కుఁ గొమ్మ రా
వారిజహస్త నాయెదకువచ్చినదానవు నీవ యంచు శ్రీ
జారుఁడు పోరశాస్త్రభముఁ జక్కఁ నమర్చెనెపంబునం దదీ
యోరుతుచద్వయిం బుడుక నుచ్చెడు లచ్చి వసించు మాకడన్. 2

చ. శివుఁ డని యెల్లవారు నుతిసేయఁగ నుగ్రత నీకు ధర్మమా
రవిశశివహ్నిలోచన హరా యన శంకరి సర్వమంగళా
పరివిమలనామ్ని వై తగునె భైరవిశాఁ జన నీకు నంచు న
న్నుపహితరాగుఁ డై యుమఁ గనుంగొనుశంభుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 3

చ. అనుపమబాహుశాఖల శిఖాభ్రిభవారిసుమంబులం గన
ద్వనజవిరోధినిర్గత సుధారసపుష్పరసాతుమాలికా
ఘనఫలపఙ్క్తులం బోలుచు కామవిరోధికిరీటకల్పకం
బున నలిసంగతోద్ధలత వోలెఁ బెనంగొనుగౌరిఁ గొల్చెదన్. 4

ఉ. నందకధారిపుత్రుఁడు సనందనముఖ్యులకెల్లఁ దండ్రి గో
నందననాయకస్తుతుఁ డనందగి యొప్పెడు పేటి నిర్మలా
నందమనస్కుఁ డద్రిభవనందనవిక్రముఁడైన యాశతా
నందుఁ డొసంగుఁ గావుత ఘనంబుగ మాకుఁ జిరాయురున్నతుల్. 5

చ. వరచతురాస్య పుణ్యజనవర్ధన దీక్షితసత్యలోక మం
దిరమృదువాంశకస్ఫురిత దివ్యపదాబ్జపరివారహస్త వి
స్తరవిబుధాభినందితల సత్ప్రతిభారతిభారతీసమా
హ్వయరహిఁ జెలంగు శారద దయామతులన్ సనుఁ బ్రోచుఁగావుతన్. 6

చ. అధిక మతి న్భజింతుఁ గలుషాభ్రమహాబలు నమ్మహాబలుం
గ్రథనధరారివిక్రమహర న్మహితాంబకు నాహితాంబకు
న్విధివిహితస్తుత్రిదివవేశ్మగణాధిపు నాగణాధిపుం
బృథుభయదాంతరాయభుజగేద్ధవినాయకు నావినాయకున్. 7

చ. పటుతరవార్ష్ణపాదప శుభస్థితిగాంచి ప్రపత్తిసత్ఫలో
త్కటరసమాని రాఘవకథాఘననిష్కుహవాసియై కడుం
జొటజొటఁ దేనియల్గురియు సొంపున రామునిఁ బల్కుచున్న యు
ద్భటుమణి నాంజనేయ శుకవర్యము నాత్మఁ దలంచి మ్రొక్కెదన్.

సీ. చక్రంబు లెవనిచే సంతసంబుగ మను, నెవనిచేఁ జక్రంబు లేపుఁ జెందు
వసురాజు లెవనిచే నసమతేజము గాంతు, రెవనిచే వసురాజు లెసఁగుచుండ్రు
విబుధు లెవ్వాని సేవింతు రెవ్వాని సేవింతురు విబుధులు విమలబుద్ధి
గగనధునీహంస గతిఁ బొల్చు నెవ్వాఁడు, హంసాఖ్య నెవఁడు ప్రశంసనొందు

గీ. వరుణుఁ డెవ్వాని సారథియై మెలంగు, నెవ్వఁ డిలనరుణాభిఖ్య నెలమినొందు
నట్టిశ్రీలోకబాంధవుఁ డనుదినంబుఁ, గృప మొలకలెత్త నన్ను రక్షించుఁగాత. 9

చ. వితతగుణాధినాథుఁ బృథివీమహితాధునికాసనాతన
స్తుతహితగాధువేష్టిత విశుద్ధమనోమునియూథసంతతే
ధితఖలతావిరోధు గురుదివ్యవినిర్మలబోధు సాధుమ
న్నతకరుణాసనాథుఁ గురునాథు భజింతు నభీష్టసిద్ధికిన్. 10

సీ. వరుసఁ బ్రహ్లాదాది పరమ భాగవతుల, వ్యాసవాల్మీకాది వరమునులఁ
గౌతమీగంగాది ఘనపుణ్యనదులను, భూమ్యాది పటు పంచభూతములను
గరుడాదిహరిపార్శ్వచరులఁ గుమారాది, కైలాసపర్వతాగ్రప్రచరుల
ద్వాదశాదిత్యుల వసువుల నెనమండ్ర, గ్రహముల నుత్తమ బ్రాహ్మణులను

గీ. నమరనాయకపాలకాద్యష్టదిక్ప్రభుల, నరుంధతి మొదలైన పుణ్యసతులఁ
బోతనను నన్నయాదిక పూర్వకవుల, మఱియుఁ దక్కిన పుణ్యుల మదిభజింతు.

గీ. అజ్ఞులగు దుష్టకవుల నేల హసింప, ప్రాజ్ఞులగు సత్కవుల నేల ప్రస్తుతింప
దుష్టులని వారి దూషింప దుష్టుఁడయగు, బ్రస్తుతికి సంతసింపరు ప్రబలకవులు. 12

క. కృతివరుని వేంకటేశునిఁ, గృతినాథునిఁ గానొనర్చి కృపవుట్టనమ
త్కృతి గావించెద మఱి సత్కృతియింతకన్నఁ గలదె యెన్నివిధములన్. 13

వ. అనిమన్మనోభీష్టమహాదిష్టదిష్టపరిప్రార్థనంబును సత్సంభావనంబును
సంక్షేపరూపంబుగ నిప్పు డస్మద్వంశానుక్రమంబు గావించెద.

## వంశావళి.

క. ధన్యుఁడు వినయితమతి మూర్ధన్యుఁడు సంశ్రితకళావదాన్యుఁ డఖిలస
న్మాన్యుఁడు సౌజన్యుఁడు కౌండిన్యుఁడు వెలయు నుభయపక్షమ నధికుం డై. 1

గీ. అన్నయ యనఁ గోత్రరత్నాకరాబ్జుఁ డగుచు, వేదవేదాంతవిద్యాప్రవీణుఁ డగుచు
గోత్రిసంతతయుఁ బొగడొందెఁ గొత్తపల్లి, నారసింహమనీషిమాన్యమతిపోషి. 2

క. నరసింహాఖ్యుఁడు భక్త్యాదరణఖ్యాతుఁ గలిగి యెల్లు తానె యగు న
న్నరసింహుఁడు విబుధాదరణాహితుఁ డై కొత్తపల్లి నరసింహునకున్. 3

క. అయ్యన వలుమొగములుగలజియ్యనదల్పుఁ దొలిచదువుచే వనఁ దగువాఁ
డయ్యవసమైలవరశుభోగయ్య నెసయఁగూఁతుఁ బెండ్లియై తగువేడ్కన్. 4

ఉ. శక్తి పరాశరుం గనినచాడ్పున వెంకమ తుందుఁ గాంచె వి
ద్యుక్తవిధానధుర్యుని ఐహోరగబంధనమంత్రతంత్రిసం
యుక్తనుచర్యునిన్ హిమనగోపమధైర్యుని భూరిసూరి సం
సక్తసభాసభావితయశఃస్థగితాశుని వేంకటేశునిన్. 5

ఉ. కన్నకుమారకోటి నతిగౌరవ మొప్పఁగ నాదరించుఁ దాఁ
గన్నకుమారు లెల్ల కడకన్ సరిసేయఁగవచ్చు గంగ ముం
గన్నకుమారుమారు నవకంబున మీఱును గొత్తపల్లివెం
కన్నకుమారులే రని మహామహు లెన్నఁ బ్రసిద్ధినొందుచున్. 6

సీ. ఒకముఖంబున నేర్చె నో నాల్గువేదంబు, లని బ్రహ్మఁ గా దను నాగమోక్తి
వేదాంతయుక్తులు విని నేర్చికొన్నవాఁ, డని శుకు మెచ్చఁ డధ్యాత్మవిద్య
ధర్మశాస్త్రంబులు సంగ్రహం బెఱుంగఁడు వ్యాసుఁ,డని ప్రహసించు స్మృత్యధిగమమునఁ
దనవారి కుపదేశ మొనరించెనా యని, ప్రహ్లాదు నవ్వు శ్రీపతిసుభక్తిఁ

గీ. దనయెదుట సురకటము దగ్ధంబొనర్చెఁ, దత్కుమారుం దని కశ్యపుఁ దటిమి పల్కు
సర్వముఖవిదుమంత్రి ప్రశక్తియుక్తి,నతఁడు గేవలుఁడే వెంకనాఖ్యసూరి. 7

సీ. అతిథు లై మాయింటి కరుదేరఁ జాలదే, యీతండు పాపంబు లింకఁబోవఁ
జెలఁగి మాయూర వసించినఁ జాలదే, యీతండు మిగులఁ బ్రఖ్యాతిగాఁగ
నీతండు మాకుఁ జన్వొచ్చినఁ జాలదే, సకలశాస్త్రార్థము ల్సంగ్రహింప
వేడుక నొక్కమా టాడినఁ జాలదే, మాతోడ నితఁడు జన్మఫలముగ

గీ. ననుచు నూరిజను ల్దను వినుతిసేయ, వసుధఁ గీర్తి వహించె నద్వైతలోపి
యుపలభాషి యఘోషి వర్ణానిభూష, ఘననిగమపరవేష వేంకనమనీషి. 8

చ. ఆతఁడు మొక్కపాటివిమలాన్వయదుగ్ధపయోధిచంద్రుఁ డా
నీతఁ దనంగ సంస్తుతి వహించిన యర్కయ పెద్దమంత్రి వి
ఖ్యాతచరిత్రి ధర్మనిభగాత్రి లసచ్ఛతపత్రనేత్రి సం
ఘాతరణీపవిత్రి సతిపాత్రిని బ్రహ్మమగోత్రిఁ బెండ్లి యై. 9

ఆ. అనఘశీల సాధ్వి యైన తత్సతియందుఁ, గాంచె రామగోత్రుఁ గలితగాత్రు
ననఘమిత్రుఁ జాత్రు నమితకోమలతాలవిత్రు నుభయకులపవిత్రుఁ బుత్రు. 10

క. ఆరాముఁడు పితృభక్తికి, నారాముఁడు జామదవారి కారాముఁడు నా
త్మారాముఁడు గుణనికరపి,కారాముఁడు విప్రమాత్రుఁడా తలపోయన్. 11

సీ. అనఘరత్నగ రామునట్టివాఁ డౌఁ గదా, యచలసంధాప్రాప్తి నట్టివాఁడ
యాచారమున భీష్మునట్టివాఁ డౌఁ గదా, యమితశాంతినన్న్యాసి నట్టివాఁడ
యాడితప్పమిఁ బలియట్టివాఁ డౌఁ గదా, యౌదార్యశీలత నట్టివాఁడ
హరిభక్తిఁ బ్రహ్లాదు నట్టివాఁ డౌఁ గదా, యాభిలసమానత నట్టివాఁడ

గీ. యనుచుఁ బొగడొందె ఖరదూషణాపహృతిని, మహిఁ భరతలక్ష్మణాగ్రజన్మత్వమునను
వాసిమాతినశివధర్మవర్ధనమున, రామనామంబుఁ దనరు సార్థక మొనర్చె. 12

సీ. ఒరులలేమికిఁ జింత నొందు నింతియ కాని, కలవారిసిరికి వెక్కసము లేదు
ఆత్మసంస్తుతి కలనైననేయఁడు గదా, పరనింద వినుట కొప్పఁడు మనమున
లవమిచ్చిరేని మేరువుగాఁగ భావించు, నీయనివారిపై నీర్ష్య లేదు
అధికదుష్కర్ముని యందైన సుగుణంబు, నైకంబు గని వాని సంస్తుతించు

గీ. నాప్రతిగ్రహాంహత్య మానిగర్వ, మాప్రమోదనిమగ్నలె యాప్రశాంత
మానిభృతి రామనసుకృతి యుందకాక, తిరిగి చూచిన మఱి కలదే పరులకు. 13

ఉ. తానమరేంద్రసుస్థిరపదంబు వహింపఁగ రఘువార్యు
జ్ఞానవనాథమాళిమణి మానక శౌరి యొసంగిన న్నమా
ధానము నాగమోదితవిధానముఁ గాంచనసస్యగర్భభూ
దానము రామనార్యుఁడు ముదంబున గాంచె నయోచితంబుగన్. 14

వ. ఏవంవిధమహానుగుణగరిష్ఠుం డగునమ్మహీసురశ్రేష్ఠుండు. 15

ఆ. పరమపావనుండు బ్రాహ్మణప్రవరుండు, నవలవిష్ణువర్యు లాన్వయుండు
ఘనవిహారి గతవికారి సుబ్రహ్మణ్యసూరివరకవనసూరి శుభమనోరి. 16

క. అంబికను సాటి యగుసు,బ్బాంబిక ధర్మపథిఁ బెండ్లి యై నిజదాంప
త్యం బభివర్ణించెడు సుజ్ఞానులు గని పొగడు రాఘవనవసీమ కడన్. 17

గీ. శ్రుతిహితాచారమునఁ బ్రవరుండు సాటి, శాస్త్రధర్మములకుఁ బరాశరుఁడు సాటి
గాని పెఱవారుదన సాటి గారనంగ, వలయు హితవేషి గంగనామాత్యు మనీషి. 27

క. సోదరులు పుత్త్రులన్య క్ష్మా, శోదరులు సహోదరులు సహోదరులు నుత
ల్పాదరము మేసురంబనఁ, గాఁదర మేయిట్టిదనుచు గంగన సుకృతిన్. 28

వ. తత్సహోదరుండై. 29

సీ. తన పితృభక్తి సంధారూఢిభార్గవ, రాము నామోదవారాశి దేరఁ
దన విలేఖన విచిత్రము చిత్రగుప్తున, కత్యంత విస్మయం బావహింపఁ
దన సూనృతోక్తి సంతానము హరిశా,త్రిపురుకుమోద వర్ధనముఁ గూర్పఁ
దన సౌకుమార్యభా వనభావజన్మున, కతనుత్వ సంతోష మాచరింపఁ
గీ. ప్రబల వైదిక లౌకిక ప్రతతి వినుతి, బాంధవాద్యాగ నివ్వతు పాలవిద్యాతి
ననఘు మతి ఘనవినయుతి సత్యగతినిరతి, నతిసుకృతి దుష్టనికృతి వెంకన్న సుకృతి. 30

వ. తత్సహజన్ముండై. 31

చ. సముచిత వాదిసర్వజన సమ్మతచారు వినోదిమగ్గల
ప్రముఖ కువాద్యమోది హరిభక్తికి నారిపరప్రమాది సం
తమితనిజాగ్రజానుజ విషాదిజ నేంగిత వేదివీత భే
దిమధుర వాది సుబ్బన సుధీనగ భేది కడు న్విరాజిలున్. 32

వ. అతని తమ్ముండై. 33

క. రామానుజన్మగను మి, త్రామోదక వృత్తినగ్రజానుజ భక్తి
ప్రేమాధిక తన వంతక, శ్రీమతి లక్ష్మణుఁడె యనఁగ లచ్చన తనరున్. 34

వ. తదనుజుండై 35

సీ. అన్నల కేకయునకు నైన దాఁటఁడు తమ్ము, లను గన్నులను గప్పికొనెను నీతఁ
డేసీమలోనియే యే కార్యముల నైన, దృష్టిమాత్రమున గ్రహించు నితఁడు
చింత చే మునిఁగి క్ష్మ శించువారల నైన, మృదువచోగతి నగియించు నితఁడు
భూతచేతాళప్ర భూతపన్నగ దుష్ట, మృగవృశ్చికవిభీతి నెఱుఁగఁ డితఁడు
గీ. సకల జనులకుఁ బరమహార్ష నిధి యితఁడు, ముఖ్య వేదాంతచర్యకు మూల మితఁడె
నల్ప చిత్రికళాపరి కల్పుఁ డితఁడె, నంగ నర్యాన వెలుఁగొందు నవనియందు. 36

వ. తత్సోదరుండై. 37

సీ. పుష్కరాక్షవిహీనముఁ బొరయకుండినఁ, దగు నలభర్గ కొంగతుల వచ్చుఁ
బెఱయూరఁ గోపతి బిట్టుగీర్వాడ కున్న, మాద్రితోల్యాలింత మాద్రి వచ్చు

వ. అట్టి మహామహనీయాభిఖ్యనీయసుగుణసంతానంబును, సంశ్రిత దీనసంతానసంతా
నంబునగు రాముని పుణ్యసంతానంబునం జతుర్థపుత్రుండనగు నేను. 47

గీ. పరమభక్తిని దుష్కరప్రాసకంద, సూర్యశతకంబు విరచించి సూర్యదేవ
తాశిరోమణి కర్పించి తద్దయావి, శేషమాధుర్యకసుధాప్రసిద్ధి మఱియు. 48

## షష్ఠ్యంతములు.

క. వ్యాసాదిముని మనోజ్ఞా, వాసునకుం దాసలోకవాంఛితఫలదో
ల్లాసునకున్ దుష్టజన, త్రాసునకుం బ్రహ్మమనోహరవిలాసునకున్. 1

క. అక్షీణకరరాక్షసోత్కర, శిక్షణ కసద్వ్యక్షునకుఁ బ్రసిద్ధతరరక్షా
పేక్షునకు దక్షునకుఁ బ, ద్మాక్షునకు వేంకటాచలాధ్యక్షునకున్. 2

క. చరిత్రచరిత్రునకు జగ, న్మిత్రోత్పలమిత్రమహితనేత్రునకు సద్వ
గ్గాత్రునకుఁ బవిత్రునకరి, జైత్రునకు స్వభక్తికలసచ్ఛాత్రునకున్. 3

క. శీలునకున్ జలధిసుతా, లోలునకుం దుష్టకీలాలునకుఁ బ్రభా
జాలునకు న్నుతలోచన, ఫాలునకు న్స్వర్గలోకపరిపాలునకున్. 4

ఉ. హారకిరీటచారుమణిహారికి సన్నవహారికిల్బిషా
హారికి దుష్టసర్పఫణిహారికి నాశ్రితపూరుషప్రతీ
హారికి వేంకటాచలవిహారికి వార్ధిసుతాసతీమనో
హారికి భక్తదోషపరిహారికి నాస్యసరోరుహారికిన్. 5

వ. పరిసమర్పణంబుగా నా రచింప దొరఁకొనిన దాశరథివిలాసంబను మహాప్రబంధంబు
నకుఁ గథాప్రారంభం బెట్టి దనిన. 6

ఆ. తెలియఁజూనికరుణావిమలరామకథ ధాత్రి, పంచ పెల్లఁ గానఁబడిన వేడ్కఁ
బ్రచురభంగిఁ జెప్పఁబ్రాచేతసుండు ను, భక్తిమంజుగా నుపక్రమించి. 7



## కథాప్రారంభము.



## అయోధ్యానగరవర్ణనము.

శా. సాకేతాహ్వయరాజధాని జనతాసంస్తుత్యమై నిష్కుటా
నీకానోకహసల్లికామ్మృతరసాపేక్షాధికీభూతచే
తఃకాకోహలతాగమాగతపతద్రాజ్యాదవప్రచ్ఛలా
స్తోకాభిష్టుతదేవతానికరమై శోభిల్లు భూభూతమై.

క. తద్దయు వేడుక మువ్వురు, ముద్దియలం గూడి భోగములు సల్పుచు నొం
డెద్దియును మఱచియుండం, బెద్దయుఁ గాలంబు చనె నిమిషమాత్రంబై. 28

గీ. ఈతి రహితంబుగాఁగ నీతిసంత, తము మాన్యుఁడై నిరతము మాను
పాలనంబున శత్రు విఘాలనమున, నొప్పిని స్వంతతికిఁ గడు నొప్పి గదుర. 29

క. సంతానము లిహపరులకు, సంతానము గాన నాకు సంతానము లే
కింతయుఁ బిత్రుదేవులకును, సంతోషము సేయలేని జన్మంబేలా. 30

ఉ. దానము లెన్ని యేనియును ధర్మములుం దగునట్లు సల్పితిం
దానముదంబు లేదు విహితంబగు భోగము లెన్ని యేని సం
తానసుఖంబునోలు నెసనంబుగ నాకుఁ దదాప్తి కై ప్రసం
తానసమార్చనాంచితవిధానముచే నగునంచు నెంచుచున్. 31

క. తన పనూహించి సుమంత్రా, దిసుమంత్రులతో నరుంధతీప్రియుఁడు సదా
భ్యసితామ్నాయుఁడునగు న, వ్వసిష్ఠుఁ గురుఁ జేరి మ్రొక్కి వాంఛితమారన్. 32

క. హితుఁడవు నది గాక పురో, హితుఁడవు నంచద్గసహితుఁడవు బాపా
హితుఁడవు నతిసుగుణగణమ, హితుఁడవు నీకీడుగలరె యెందును నుర్విన్. 33

క. మిత్రుఁడవగు నీకరుణను, బాత్రుఁడనై యుండి దుర్గభస్థితి నాకుం
బుత్రరహితతిమిరవ్యాప్తి, చిత్రము సేయుంగదా వసిష్ఠమునీంద్రా. 34

వ. అనిన నఖిల గుణగరిష్ఠుండును మునిశ్రేష్ఠుండు నగు వసిష్ఠుం డిట్లనియె. 35

ఉ. ఏధితకీర్తిసీమఁ దగునే యిటు చింతఁ గుందఁ దత్తప
స్సాధితశక్తిచే నిదె ప్రసాధితసద్గుణభూషుల న్మహో
బాధితశత్రుల న్సుతుల భవ్యులఁ గాంచి సుఖింతువింక ని
ర్వ్యాధి రచిత్తవృత్తి నొనరింపుము భంగకతురంగ మేధమున్. 36

క. అనిపలుకఁ దనమనంబున, జనియించిన కోర్కెకదియు సమమైనమనం
బునఁ బొంగుచు నెలమిం ద, జ్జననాయకుఁ డశ్వమేధ సవనోన్ముఖుఁడై. 37

మ. సరయుం బారఁగ మంత్రులార వినుఁడీ శాస్త్రప్రకారంబున
న్సరయూపుణ్యనదీ సమీపమునఁ బ్రజ్ఞావంతులై మీరు భా
స్వరధూపంబులు నిల్పి శాలలయు సంభారంబులం గూర్చి యా
కరయూదాధిక విఘ్నమేమ అకరక్షాతత్పరత్వంబునన్. 38

ఆ. మించియజ్ఞవాట మంచిరీతిగ నొన, రించి యశ్వవరము నెంచి సత్ర్ధి
మించి సద్విధి విడిపించి మానుల బిలిపించి యాగుఁ దని పలికె నృపుఁడు. 39

ఉ. చూచెను గాంచెఁ గాంచననివేశవిశాలవిచిత్రరత్నశో
భాచయరోచమానమృదువస్త్రఘనస్థగితేద్ధకుట్టిమాం
తోచితసుస్థిరద్విపథికోద్యసదక్షసులాస్త్రిహేతుధ
ర్మాచరణైకయత్నల దురాత్మసపత్నుల ధర్మపత్నులన్. 40

గీ. కాంచి యుల్లముఁ బుత్రులఁ గాంచుకొనుట, కిష్టి సేయఁ దలంపఁ దీక్ష వహించినాఁడఁ
గాన మీరును వేడ్కఁ దీక్షను వహింపుఁ, డనిన ముదమంది దీక్షిత లైరి వారు. 41

గీ. కాంతలును దానునిట్లు తేకాంతదీక్ష, నంతసంబునఁ దాల్చి వసంతమునకు
నెదురుచూచుచునుండెఁ గట్టెదుర భూమి, కాంతునకు నాతఁడనియె నేకాంతముగను.

సీ. మహినాథ వినుము వగ్రహబాధయును రోమ, పాదుదేశంబునఁ బాదుకొనిన
నయ్యంగపతి ప్రజ ల్డయ్యంగఁ గనుఁగొని, హితమంత్రిజనపురోహితులతోడ
మనవిచయమునకే మననిట్టుమఁ దస్త, బాత్రిల్లెడిని నెప్పాటఁ బాపి
కొనవచ్చుఁ జెప్పరే గొనకొని మీరిప్డు, డనవుడు వేగ నయ్యనఘమతులు

గీ. తమమనంబుల నీతిబాధానిరాస, కంబు సేయంగ జాలుమార్గంబుఁ జాలఁ
జాల నూహించి యమ్మహీపాలవర్యుఁ, డెంతయును సంతసింపఁగా నిట్టు లనిరి. 43

క. కశ్యపపౌత్రుఁడు శివసా, ద్రుశ్యుండు విభాండకార్యదేహభవుం డై
వశ్యేంద్రియనిచయుం డై, ఋశ్యవిహారుండునా మునీంద్రుఁడు వెలయున్. 44

క. ఘనపూర్ణమహాతేజుఁడు, వినుసన్మార్గప్రచారి విమలాత్ముండున్
ఘనుఁ డఖిలభూతహితుఁ డా, తని నిట రప్పింపుము విబుధస్తుత వేడ్కన్. 45

క. అతఁ డిట కేగుదెంచిన, నాతతవర్గములఁ గురియు ననవుడు వారిం
బ్రీతిం గనుఁగొని యాతని, వే రేదక్ష లబలలని వినినకతమునన్. 46

క. భూవరుఁడు పిలువనంపెన, వై వారము సేయుచు సముఖమునకుఁ గన్నా
రై వారస్త్రీవారము, రా వారలఁ జూచి యంగరా జిట్లనియెన్. 47

చ. అనఘుఁడు ఋశ్యశృంగుఁడు మహాముని ఘోరతపంబు సేయుచు
న్వనమున నున్నవాఁ డతఁడు వారు లతాంగులు వీరు పూరుషు
లన్న నెది పట్టణం బిది ధృవంబుగ నంచు నెఱుంగఁ డమ్మహా
త్ముని నిటఁ దోడితేవలయు మోద మెలర్పఁగ మీరు నావుడున్. 48

సీ. ముఖపంకజామోదమునకు మూఁగుచు నున్న, భ్రమరకంబులు భ్రమరకము లనఁగ
నదెఁ గాంచి యంఘ్రుల వడిఁ బెనంగొనుహంసకములు విస్ఫుటహంసకము లనంగ
శుకచంచుపుటనికృత్తకమహీపతిపల్లవములు జారుపల్లవము లనఁగ
నటనక్రమోద్భూతపటుఘర్మబిందువిసరములు ముక్తాప్రసరము లనఁగ

ఆ. ననుచు విస్మయాత్ముఁ డైనయామునిబాలుఁ, జేర నరిగి వారకాంత లపుడు
కలసికచ్చినట్టి ఘనదేవత లనంగ, బలసి భూషణప్రభలు వెలుంగ. 58

చ. కుచము లురంబునం గదియఁ గ్రుమ్మి కవుంగిటఁ జేర్చి మోహపా
శచయము వోని వేణుల భ్రుకుంబుగఁ జుట్టుచుఁ బల్లవోల్లస
న్రుచిరుచిరాధరంబుఁ గరతోయజము ల్దగఁజాఁచిముట్టుచు
న్విచలితధైర్యుఁ జేసి రరవిందనిభానన లిక్రియంబునన్. 59

వ. అంతం దమయందు బద్ధానురాగుం డగుట యుపలక్షించి యచ్చంచలాక్షులు మఱ్ఱిం
జొచ్చుమించులంబోలె వంచనం దొలంగించి చనుటయు 60

ఉ. ఎప్పుడు వత్తురో యనుచు నెంతయు వారలు సన్నమార్గముం
దప్పనిచూడ్కిఁ జూచు త్రిదిత ప్పనిరయింపక యగ్నికార్యముం
దప్పన యమ్మహాత్ముఁడు మదంబునఁ దద్గుణకీర్తనంబులం
దప్ప నితఃపరంబు మఱిఁ దార్పకయుండె ససంభ్రమంబునన్. 61

క. ఆత్మభవసన్నిభుఁ డమ్ముని, యాత్మభవకుమారరహితుఁ డైయుండియుఁ దా
నాత్మభవాత్మవిభాండకు, నాత్మభవుఁడు దన్ను విచలితాత్ముఁ డగుటన్. 62

క. మఱునాఁడు చెలఁగుచును వేఁ, మఱు నాఁడుచు మానికడకు మగువలు త్వరతో
నరుదెంచిరి యరుదెంచుట, విమలఖరకరాన్వయాంబుజార్యా. 63

వ. ఇట్లు వచ్చుటయు.

క. నిధిగన్న పేదవోలెన్, బుధనుతుఁ డన్నియమివారిఁ బొడఁగాంచి యనూ
ద్యృధతేజుఁ డిట్టులనుఁ ద,ద్గ్రథితమనోగ్రంధి యగుచు దైన్యము దోఁపన్. 65

చ. ననువిడనాడ న్యాయ మగునా మిము నమ్మినవాఁడ నంచుఁ బ
ల్కినఁ దగఁగాక రమ్మనుచు లేనులు చిల్కను బంజరంబుఁ జే
ర్చినక్రియ నమ్మహామహుఁ బ్రసిద్ధగుణాస్పదరోమపాదకుం
భినిపతి పట్టణోత్తమసమీపమునోపవనోపకంఠమున్. 66

క. హర్షముగఁ జేర్ప నత్యు,త్కర్షముగా నెల్లయెడలఁ గరశాయంత్ర మై
వర్షంబు దేవతానుమ,వర్షముతో నెనసి కురిసె వసుమతి యలరన్. 67

ఆ. అంత రోమపాదుఁ డాప్తమంత్రిపురోహి,తాదిసుజనసహితుఁ డగుచు నేఁగి
యెదురు సని విధి నువిహితపూజ లొనరించి, వేడుకలరఁ బురికిఁ దోడి తెచ్చి. 68

ఆ. పంతసమున విప్రసంతర్పణ మొనర్చి, వరపురమున నుత్సవంబు చాటి
వారముఖ్యలకు నపారవిభూషణాం,బరములొసఁగి వినయభరితుఁ డగుచు. 69

ధార్మికుండుఁ గశ్యపవిధాత్రసుతాత్మభవుండు నీతిజా
మాత్రుఁడు ఋశ్యశృంగుఁ డసమానుఁడు మానవవంశదీపకా. 80

క. అతనిఁ గొనిపోవుటకై, యేతెంచితి నమ్మహాత్ము నెలమిఁ దారా
న్వీతునిఁగా మత్పురమున, కారతగుణ పనుపు మిది ప్రియం బగు నాకున్. 81

చ. అనవుఁడు సంతసించి తనయల్లునిఁ గన్గొని భక్తిఁ దద్విధం
బు నుడివి యాతఁ డిచ్చకొన భూపతిఁ డెంతయు సన్నుతింప న
య్యనఘుని ఋశ్యశృంగుని నిరంతరవర్ష సమార్ద్రభూమిపం
కనిరసనార్థ మంపె ననఁగా నతఁ డంపె జగద్ధితంబుగన్. 82

క. శాంతాత్ము ఋశ్యశృంగుని, శాంతాసహితముగఁ దెచ్చి జననాథుఁడు దా
శాంతాపూరితహృదయుఁడు ని, శాంతము సాత్రెంచె సకలజనములు పొగడన్. 83

గీ. శాంత నంతఃపురమునకు సంతసమున, ననుప నమ్మునిపత్ని కయ్యధిపపత్ని
తెమలు సని గ్రొక్కి యయ్యవ కిష్ట మెసఁగ, భక్తిసేయంగ నుండె నప్పరమసాధ్వి.

వ. దశరథుండును ఋశ్యశృంగసందర్శనసంభాషణంబుల సంభావితుండై యుండె. 85

ఉ. చాల ముదంబు సేసెను విశాలరసాలకిసాలలోలపై
కాలము వల్లరీస్తమధుపాళిధరానమితోల్లసల్లతా
జాలము సౌఖ్యమూల మురుసౌరభసంయుతమందమందవా
తాలము గ్రామకూలము సుతుల్గ్రామమాధవకాల మంతటన్. 86

సీ. మాధవురాకకు మానితామోద యై, నవవనలక్ష్మి జీర్ణచ్ఛదములు
తగ వని నూత్నచ్ఛదము లోలి ధరియించి, హస్తము ల్సాఁచి గమ్మనుచుఁ బిల్చె
మన్నదో యన సుగంధోద్భాసి యై పంతు, ఓకాకు లాడెడి తలిరాకు లెలమిఁ
దనరఁ బికాళిబృందంబు లందందయా,నందంబు నొంది ధ్యానములు సేయు

గీ. నొసర మతిరయముఁ దత్పంగ ఘనసుఖమున, నొదవుపుల్కలనాలు నా నొప్పమీ
నములనిజము చివిజితనీహారకేద్ధ, తారకము లగునభినవకోరకములు. 87

గీ. శ్యామ యల్పతరుస్కంధసాక్రమణము, గాదనుచు వేడ్క ఘనతరుస్కంధ మెంచు
ననఁగ నల్పతరుస్కంధసాక్రమణము, గాదనుచు శ్యామయున తరుస్కంధ మూనె.

క. కమ్మని తెమ్మెరలుం జుం, జుమ్మనుతుమ్మెదలు న్స్ఫుటవిశుద్ధపోమనో
జ్ఞమ్ము లగుకుసుమమ్ములు గడు, నెమ్మెలు గులుకఁగ వసంత మిమ్మెయిఁ దనరెన్.

వ. దశరథుఁడు ఋష్యశృంగున కిట్లనియె. 90

ఉ. ఆయతకీర్తి రికాలి ముదమార వసంతము డాసియొప్పె యు
క్షాపురనంబున న్సకల మాయితచుమ్మె మునీంద్ర యెల్లి

ప్యాయుతసంఖ్యులై కడురయంబున వచ్చిరి రాజకోటి నే
నాయుత మై క్రతూత్సవఘనంబుఁ గనం బురినిండెఁ గావునన్. 91

క. నాయజ్ఞము నెఱవేర్పుము, నాయజ్ఞానము సహించి నలువొందుదయన్
న్యాయజ్ఞ మునీశ్వర ప్రభు, నాయజ్ఞామాత్యులెల్ల నవహితబుద్ధిన్. 92

క. నీపంపునేసి మెలఁగఁగ, నేపార వసిష్ఠమునియు నీరలుఁ దగుపు
త్రాపాదనహయమేధ,వ్యాపారము లెపుడు మెలఁగవలయు నటంచున్. 93

క. మునిపతి వసిష్ఠ గుణధా,మునిపతితేంద్రియవికారమును భయచిత్తసో
ముని పతితాదిరపుఃకా,ముని కతి యిట్లనుచుఁ బలికె మోదము లర్వన్. 94

ఉ. మేధ్యముగాఁగ నశ్వహయమేధ మొనర్పఁగఁ బంది శాస్త్రవా
సాధ్యుల సంతతప్రణుతసాధ్యులఁ బుత్త్రిల సిద్ధసద్గుణా
రాధ్యులఁ గాంచునట్లుగ వరంబుఁ గరంబు నొసంగుమంచు సా
న్నిధ్యమునందు వేఁడుధరణీపతిఁ గాంచి వసిష్ఠుఁ డాద్యుతిన్. 95

క. నాకుత్స్థాన్వయదీపక, నీకింతవిచార మేల నేఁగలుఁగఁగ సు
శ్లోకులఁ బుత్త్రులఁ బడసెదు, ప్రాకటసరయూనదీవరతటంబునకున్. 96

క. విను నీవు నీదుభార్యల, జననాథక మంత్రిపౌరజానపదుల స
జ్జనుల మునుల విప్రులఁ దో,డ్కొని చను మేబుత్త్యశ్వంబు నొగి యేతెంచున్. 97

వ. అని పల్కుటయు. 98

సీ. రవి శశిమణిచక్రవిభ్రాజితంబు, నై సమస్తాదకుల్యసమావృతంబు
నై హారిస్ఫురితంబు నై యలరుచుండిన సరయూవాహినిం జేరి నరనాథుండు. 99

వ. విబుధపరివృతుం డై మహేంద్రవిభవంబున వశిష్ఠగుణగరిష్ఠుం డగువసిష్ఠుండును, మంగళగుణానుషంగుం డగు ఋశ్యశృంగుండును, హృష్ట లగుమహర్షులును, తపో ధను లగుమౌనులును, మహానుభావు లగుమహీదేవులును, సర్వజ్ఞు లగుదైవజ్ఞులును, సాధు లగుహోతలును, జ్ఞానవిదు లగుజానపదులును, నిర్వర్తితరాజ్యతంత్రు లగు సుమంత్రాదిమంత్రులును, శాంత లగుపుణ్యకాంతలును, సుత్రైకయత్న లగుధర్మ పత్నులును, వినయనిధు లగువందిమాగధులును, శృంగారాధార లగువారనారులుం దోడరా ననురూపరూపయూపప్రపాసుందరంబును, స్పష్టాష్టపదేష్టికావిరచితవేదికా కుండమండితంబును, ప్రసిద్ధక్రతూత్సవాలోకనాగత చాతుర్వర్ణ్యత్రరుచితనికాయ్య నికాయకాయమానసమావృతంబును, కుంభామనోహరంబును, ధనధాన్యశాలితండుల ఘృతతైలగుడసూపశాకతృణకాష్ఠజలప్రభూతవస్తుప్రశస్తంబును, విమలసరయూక మలానుకూలకూలలతాసాలజాలనూనసుగంధవహగంధవాహసుప్రవేశంబును, దక్షి

ణానీలఘనాపీనసైచికీమణీగణసంభరితంబులు నై పవిత్రంబు లగుధవిత్రంబులును,
పవిత్రంబు లగుసువర్ణపాత్రంబులును, నవంబు లగుస్పృష్టవస్త్రంబులును, మంజులోల్బణ
రత్నకంబళపుంజంబులును, మఱియుం దక్షిణావివిధోపకరణంబులును గలిగి యొప్పు
నభినవసవనభవనంబుఁ బ్రవేశించి ధర్మపత్నీసహితుం డై. 100

గీ. శుభముహూర్తంబునను వసిష్ఠుఁడును ఋశ్యశృంగుఁడును మునివరులును వెలవొసంగ
నగ్నిముఖు లగ్నిముఖమునసలర నప్పు, డగ్నిముఖమొనరించెఁ గ్రత్వాదియందు.

క. తదనంతరంబున. 102

శా. ధాయ్యాగర్ధ్రితజాతవేదహితమధ్యప్రష్ఠితాపూరసా
న్నాయ్యప్రాహుతినిర్గమప్రబలనానావర్ణధూమాభ్రసా
హాయ్యంబొప్పఁగఁ గ్రతుండు గ్రతుభాగార్థంబు రా దక్షిణా
నాయ్యాశ్వగ్ను లయాజ్ఞికోత్తములు ఛందోష్ణు బ్రవర్గ్యాదులన్. 103

గీ. సముచితంబుగ వేల్వ నశ్వముఖులసదు, పాకృతకమన మొప్పవసాప్రహోమ
విధుల నింద్రాదు లైనదివిజవరులకుఁ, దృప్తి యొనరించె నజ్జగతీవిభుండు. 104

సీ. ఈక్రమంబునను సర్వక్రియాసంపూర్ణ, మై విశ్రాణనపానాదితర్పి
తాఖిలలోక మై యనవద్యదక్షిణాభ్యాత మై కృతవసాధూమ మై శ
గం బయి శిష్టదుర్గం బయి ఖచరభాగ్యం బయి ద్విజదసహ్యంబు నై స
భాసదాహ్లాద మై బహుళసంస్తావపూతం బయి పాపవాదంబిసీప్ర

గీ. భంజనం బయి వాద్యసంభరిత మై ధ, రామరాశీర్తి నాదపీణానుకూల
వాదపుణ్యాంగనాగాననాదపూర్ణ, మూన మై యశ్వమేధ మనూన మయిన. 105

చ. పుడమివిభుండుఁ దాపసవిభుండును భాండకునాత్మజుం గ్రతిం
పుగను నతిహర్షుఁ డై కరుణఁ బుత్రకదాపవనిష్టి సేయు న
ప్పుడ మిశ్రభాషి తన్మని ప్రభూతహితావహుతు లొప్ప వేల్చిన
ప్పుడమిజనంబులెల్లఁ గనుఁగొంగి కనుంగొనుచుండ సద్విధిన్. 106

మంగళమహాశ్రీవృత్తము.

ఆసమయమందుఁ గమలాసనుని గన్గొనఁగ వాసవపురస్సరముగా సం
త్రాసు లగుచుం ద్రిదివవాసు లొగి డాసి నతిచేసిన దయామయుఁడు నావా
ణీసతినిఁ గూడి దరహాసము ముఖంబున విలాసనుమర స్ఫురణతోను
ల్లాసమొదవం గరుణచేసి పలుకు న్వ్రతలఁ బాసి ముదమందుచు వినంగన్. 107

క. ఈతడకు మీరువచ్చిన, యీకార్యముఁ దీర్ప దక్షుఁ డీక్షితి నరయ
న్నైయ్యనంతపురాధీశుఁడు, నైకుంఠుఁడు గాక యొరులుగలఁగుదె యనుచున్. 108

గీ. వారిఁ దోడ్తెచ్చి యప్పు డవ్వారిరమకు, వారిజభవుంకు పూర్వదేవారి యొంకు
వారినిధి గాంచి యచట దేవారిహతుఁ, వారిహితుఁ గాంచి పొగడె నవ్వారి గాఁగ. 109

సీ. అచ్యుతసంతత్స ద్యాదినామోత్కర్ష, పాలితామృతతర్ష పరమహర్ష
భక్తనేత్రోత్కర్ష బహుసద్గుణాకర్ష, యమితశ్రుకర్ష సహస్రశీర్ష
సుజననిరామర్ష కుజనధుగాధర్ష, దానవసామర్ష మానితార్ష
శరకృపామృతవర్ష వాహనవిహగర్ష, భవునాఘమర్ష సంభరితవర్ష

గీ. యాతఘర్షిగిరిపుకీర్ష కామకర్ష, సంతతానందయోగి సత్సన్నికర్ష
కరుణ మాకొంత వినిపొమ్ము పరమపురుష, యధికతరదుఃఖరాశిసమాపకర్ష. 110

క. లోకంబులు గలిగింపను, లోకంబులు మనుప సర్వలోకంబులు వే
నాకార్ణవంబు సేయఁగ, నీక చనుం గమలనాభ నిరుపమశోభా. 111

క. లోకాధారుండ వఖిల, లోకాతీతుండ వార్యలోకహితదయా
లోకుండవు నసమానా, లోకుండవు సోమలోకలోచననేత్రా. 112

క. అభవుఁడ వైయుండియు దు, ష్టభయంకరరాక్షసప్రతతి నణఁచ గా
ప్రభవించెద వొక్కొకతఱి, శుభచరితుల యిడ్డ భక్తసులభుఁడ వగుటన్. 113

చ. అనఘ త్వదీయదర్శకులయత్యవిహీనతఁ జేపులై జయుం
డును విజయుండు లోకము గడుం భయమందఁగ దైత్యులై జనిం
చినను వరాహరూపమునఁ జిత్తజవహించి హిరణ్యనేత్రునిం
దునిమి నృసింహవిస్ఫురణఁ ద్రుంచితి వగ్రజు హేమభోజనున్. 114

క. ఆదనుజాధము లఖిలన, రాదులు ఘటకర్ణ రావణాహ్వయుములచే
మేదిని జనించి దివ్య, లాదుల భర్జించుచుండి రతిబలు లగుటన్. 115

సీ. నిమిషసుస్థితి లేగు నిర్జరవరులకు, నఖిలదిక్పతులు ని ... స్థిర
పాతాళమునకు నై పాఱిరి భుజగులు, కిన్నరుల్గుహల దాఁగిరిధరమున
గ్రహములు నిర్వక్రగతిఁ దనర్పుట లేదు, సాధ్యుల కధికవిచార మయ్యె
బ్రాహ్మణోత్తములకు రాగసీమంత ఘనతరల కాపులపాటు పరిఢవిల్లె

గీ. వరమఖంబులు కడు దుర్లభంబు లయ్యె, మునుల గర్వసమృద్ధి నిష్ఫలము లయ్యె
ఖచరకాంతాక్రమణమహోత్సవంబుఁ జెంది, పక్షికంఠుఁడు సేయు నుపద్రవమున.

క. హేమనగశరాసనునకు, మేమనఁ గల దతఁడు లీల నెత్తింతో నిం
కేమనఁగ నెంత నిలిచెద, మేమనఁగలమే సురారిమోఁదికిఁ జనవన్. 117

క. రావణు సమస్తలోకవి, రావణుఁ బరిమార్చి చెచ్చెరం దదనుజునిం
గావర మారించి మమ్ముం, గావ రమాధీశ నీవ కలవనియుటకున్. 118

వ. చనుదెంచినవార మని పలికి రందఱును. 119

క. భవదారితనామ మనో,భవదావాశ మతిశ్రీహిత విభవదాయక ధీ
భవదాలోకము కుంఠీ, భవదాశరలోక మగు నభవకాంతమతా. 120

క. అని కమలాసనముఖ్యులు, వినుతింపఁగ సంతసించి విశ్వమయుండు చ
య్యనఁ బ్రత్యక్షం బయ్యె, న్వనజోదరుఁ డపుడు భక్తవత్సలుఁడు గదా. 121

సీ. కాదంబినీసముద్గమము లై చంచల, త్వంబు నొందని కెత్తి తండ మొప్ప
శ్వేతపోతకతతిశాశ్వాంగారయూగపత్ప్ర, దీప్యత్సహస్రేందుదీప్తు లొప్ప
యవనీభరవహశేషాద్యశేషవిశేష ఫణిఫణామణిఘృణిప్రచయ మొప్ప
యత్యయద్వాదశాదిత్యసంస్తుత్య ఘ,నాత్యంతరుచిరతీవ్రాంశు లొప్ప

గీ. యనఁగ గాడ్పులు మిఱుమిట్లు గొనఁగఁ జల్లఁ,దనముమీఱఁగ నధికచిత్రంబు గాన
సహానదుస్సహముగ నొప్పు మహితదేహ,కాంతు లెల్లెడఁ బర్వ సాక్షాత్కరింప.

క. చతురాననుండు నిజఘన,చతురాననములను విష్ణు జనపరిష్ణు
జతురాగమములఁ బొగడెను, జతురత యొప్పంగ సంతసము నిండారన్. 123

గీ. అపుడు తద్దివ్యమూర్తి తేజోవలోక,నంబు సేయఁగ నధికముదంబు గదుర
నట శతక్రతుఁ డురుసహస్రాక్షుఁ డయ్యె, నమరవరు లెల్ల ననిమిషు లైరి మఱి. 124

సీ. అశ్వమేధశతఫలావాప్తిఁ గోత్రభి, దికి సర్వభక్షుఁ డనఁ శుచిత్వ
మురుదండధరుఁ డనఁ గురుధర్మదేవత్వ, మలరాక్షసునకుఁ బుణ్యజనఘనత
జడపతికిఁ బ్రచేతసత్వంబు లోకప్ర,భంజనుఁ డనఁ. జగత్ప్రాణమహిమ
నరవాహనుఁ డనఁ ధనదమహాభిఖ్యయు, సర్వేష్టదనుధర్మశాస్త్రవునకుఁ

గీ. దనరు తేజోమయాత్మదర్శనముకతనఁ, గలుగఁ జేయుచు నందఱఁ గలయఁ జూచి
మేఘగంభీరములును నమోఘములును, మధురములు నైన వాక్కుల మధుహరుండు.

ఉ. భానుకులాగ్రగణ్యుఁ డగు పఙ్క్తిరథాత్మసుతత్రయంబునం
దేను జతుర్విధాకృతుల నెంతయు వేడ్కఁ జనించి రావణు
న్మానమదాతిరేకములు మాన్చి యమర్త్యసహోదరాప్తసం
తానము మున్నుగా యమపదంబున కంపెదఁ జింత యేటికిన్. 125

క. మీవలని యనుగ్రహమున, మీవలనికి వచ్చితి నిటమీఁద నయఁడై
మీవలసినటుల మెలఁగెద, రావణు మాత్రములు మీకు రావణు బాధల్. 126

ఆ. అతని వరము లడుగు నప్పుడు నరవాన,రాలిఁ బాపకుండ నడుగఁ డతఁడు
గాన నేను మర్త్యయోని జనించెదఁ, బుడమిఁ బ్లవగులగుచుఁ బుట్టుఁడీరు. 127

వ. అని యానతి యొసఁగి. 128

క. రోహిత నిధిశయనుఁడు పటు, రోహిత కరమహితదీప్తరుచియుఁడు సుగపా
రోహిత శోభితమయుఁడా, రోహిత ఖగనాథుఁడై తిరోహితుఁడైనన్. 129

క. వనజజుఁడు జాంబవంతుని, ఘనయములు హరిహయులు వాలిసుగ్రీవుల న
శ్వినులు మైందద్వివిదుల, ఘనభల్లుకకీశపరులఁ గలిగించిరొగిన్. 130

క. అనలాత్ముఁ డంశమున నం, జనయను సాధ్వీమతల్లి సద్గర్భపయో
నిధిఁ దగఁ గపికులచంద్రుఁడు, హనుమంతుండుదయమయ్యె హరిదయ మతియోన్.

క. తమతమ యంశంబులనుఁ, దమతమల బలిముఖులను దలంచు గసురస
తము లెలఁ గలిగించిరి చి, త్తము లానందింప దైత్యదర్పచ్యుతులన్. 132

వ. ఇట్లు గలిగించిన దేవాంశసంభూతు లగు నాప్లవంగమపుంగవులు. 133

ఉ. కొందఱు నీలు నెన్నలని కొందఱు కొందఱు మిత్రసంభవుం
గొందఱు గంధమాదనుని గొందఱు మైందుని గొంద ఱంగదుం
గొందఱు గేసరిం గజుని గొందఱుఁ గొందఱు వాయుపుత్రునిం
గొందఱు నింద్రనందను నహర్నిశముం గొలువం దనర్చుచున్. 134

ఆ. పర్వతంబు లెత్తి బంతులాడుచు గండ, శిలల నుగ్గు గాఁగ జేఁజఱచుచు
ధరణి గ్రక్కదలఁగ దాఁటుచు నుండిరి, ఋశ్యమూకముఖగిరీంద్రములను. 135

క. అంతక మున్న కృపాకర, తంతుల సంతతుల దశరథేశ్వరుఁ డఖిలా
శాంతవ్యాపితధూమా, త్యంతమనోహరసుతేష్టి యమరించు నెడన్. 136

తే. యజ్ఞకుండాంబునిధి ఋగ్యజుంగమాధ, వాను శాసనమున విబుధాధిపుండు
మంత్రమంథనగంబుచే మథనవిధియొ, నర్చ నమృతంబు దెచ్చు ధన్వంతరి యన. 137

ఉ. ఆతఱి యజ్ఞకుండమహితాంతరము న్వెస నిర్గమించి శో
భాయుత దివ్యమూర్తి రఘువంశసుదీపకుమారసంభవో
పాయసపాయసుండయి నృపాలకృతాహుతిసద్విధానవి
స్సాయదనుగ్రహంబున విభాతనుఁ డాత్తనిజస్వరూపుఁడై. 138

క. అతులితమునఁ దనకుం బ్ర, త్యక్షంబయ్యె ననదివ్యుఁ డగు నొకపురుషుం
దక్షిణ ప్రథనోప్పఁ బ్రదక్షిణ మొనరించె విభుఁడు దయితాయుతుఁడై. 139

వ. ఇట్లు. 140

చ. తనకుఁ బ్రదక్షిణించి యాచితంబగు భక్తి నమస్కరించి యా
న్న నరవరేణ్యుఁ గాంచి మహినాథ తనూజులు నీకు నల్వు ర
త్యనుపమమూర్తు లిద్ధబలు లర్కకులాగ్రణు లుద్భవింతు రీ
ఘనతరపాయసంబుఁ గులకాంతలకు న్సమంగ నిచ్చునన్. 141

క. అని చెప్పి మనోరథసిద్ధి నొసంగి దభంగి నపుడు దివ్యపురుషుఁ డొ
య్యనఁ దత్పాయసపాత్రము, దినకరగోత్రునకు నొసఁగి యదృశ్యుం డయ్యెన్. 142

క. పరమాత్మస్వాద్యమున మహీ,పరమాకర్ణనపరుండు పత్త్రిరథుఁడు త
ద్వరమాన్నపాత్రఁ జేకొని, పరమాహ్లాదమున నపుడు పట్టణమునకున్. 143

సీ. చవిగొంచి యప్పాయసము రెండుభాగము, ల్గావించి యొకభాగంబుఁ బెద్ద
భార్యకు రెండవభాగంబు రెండవ,భార్య కొసంగి భూభర్త పిదపఁ
గౌసల్యపాలిసగంబులు నైకభా,గంబున సగము రాగంబు మీఱఁ
దెచ్చి సుమిత్ర కందిచ్చె భాగములు నా,ల్గింటిలో రెండు గ్రోల్గాంచి చిన్న

ఆ. భార్య కయ్యెఁ గడమ భాగద్వయంబు భా,ర్యాద్వయమున కయ్యె నధిక మైన
ప్రేమ పతికిఁ జిన్నపెండ్లామునం దును, దల్లికిఁ గడగొట్టుబిడ్డయందు. 144

మ. పరమాన్నానుభవంబున న్సతులకున్ భావింపఁగా వృద్ధిఁ గాం
చె రహిం గ్రొమ్ములు వాస్యపాండిమములున్ శృంగారదక్షోదరా
ధరము ల్జిట్టుము లావులీని లనుపద్మాయు ల్ముఖంబు ల్విచో
మరుచు ల్ముక్కలుగ మందమయ్యె నడలు స్తన్యంబు వాపేకులున్. 145

క. కటిసీమ కరచ్ఛాయలు, బటువగు చుమనం గర్భభారంబులతో,
స్ఫుటభార సురుచిరమహో, త్కటరత్నాభరణగణము గడుభరమయ్యెన్. 146

గీ. అధికమధుపానమత్తత నబ్జవాంఛ, భ్రమరకంబులు చక్రవాకముల మీఁద
వ్రాలెననఁ గాంతలకు లిప్తపరకుచాగ్ర, నీలిమ దనర్చె నత్తోలిమోములవేళ. 147

సీ. ప్రియపుత్త్రదర్శన స్పృహమించె నృపతికి, గంబుకంఠులకుఁ గ్రమంబు మించె
దాఅనిమొకంబు మీఱె నరేంద్రున, కంబుజాస్యలకు నూఁగారు మీఱె
బటువరంబుగ మేను పాటకరించె మహీంద్రున కంగనలకు లాప్పుటకరించెఁ
దెలివత్వ మొలకలెత్తె నిలాపతికిఁ జంద్రముఖులకుఁ దెలిగాలు మొలకలెత్తె

గీ. మానసభ్రమవిహీనమౌ కామ,సప్తగంగప్రభవపుణ్యప్రవరస
మాత్రమాధుర్యపాకసాహాయకలనఁ, బ్రాకటంబగు దౌహృదశ్రీకరమున. 148

ఆ. సకల జనులకుఁ బరమహర్షంబు నిండఁ, దేవతాస్తుతి గరముల దిశలు నిండఁ
గలితజీవితకాలం బరులకు నిండ, నెలఁతలకు నంతఁ బండ్రెండునెలలు నిండ. 149

మ. మధుమాసాగతశుద్ధశుద్ధనవమీమధ్యాహ్నకాలంబునన్
బుధవారాదితితారఁ గర్కటకసత్పూర్వాగ్యులగ్నంబునన్

క. నలుగురురూపకళాఢ్యులు, నలుగురుసుతు లుద్భవింప నలువుగ విరివా
నలు గురిసె దివ్యులు వెంటా,నలు గురుతరవాద్యముల మ్రోసెను మింటన్. 160

క. పాపంబులు భక్తమన,స్తాపంబులుఁ బాపనోపు తద్బాలురకు
న్రూపంబులు పురుటిండ్లను, దీపంబులు గాఁ దెలంగ దీపితభంగిన్. 161

క. పురుషోత్తము లగుపుత్రులఁ, బురుషార్థచతుష్టయంబుఁ బోలెం గని తా
పురుహూమిత్రజనమదం, బురుసాహసహితముగ నృపుఁడు పొంగుచు నతిచెన్. 162

వ. తదనంతరంబున. 163

సీ. పుణ్యాహవాచనపూర్వకజాతక,ర్మానంతరంబున మానవేంద్రుఁ
డతిభక్తిఁ గులగురుం డగువసిష్ఠునిఁ గాంచి, సుతుఁ డయిసుతులకు నామకరణ
మొనరింపుఁ డనుడు నయ్యోగిముఖ్యుండుఁ గౌ,సలరాజకన్యకాసత్పుత్రునకుఁ
గైకపుత్త్రునకు మాగధరాజపుత్త్రికా,పుత్త్రులకును గ్రమంబున నొసర్చి

గీ. రాముఁ డని రాముఁడనుచు భరతుఁడు గాన,భరతుఁ డనిలక్ష్మణుఁడు గానఁ బరఁగలక్ష్మ
ణుం డటంచును శత్రుఘ్నుఁ డంద్రుగాన,మహితశత్రుఘ్నుఁ డనుచు నామంబు లిడెను.

చ. క్రమమున బాద్యపతుమిహికాకిరణోరుకళోపమాను లై
సుమవిశిఖావరీణపటుసుందరు లై వినుతాంబుజాసనా
ద్యమరులు నై కరేశ్వరుఁడు నంబలు సంతసమంద మిత్రగో
త్రము వెలుఁగంగ రాజసుతులు పెద్దయు నొప్పిరి నాఁడునాఁటికిన్. 165

గీ. తల్లిదండ్రుల సంతోషవల్లి ప్రాఁకఁ, బ్రాఁక నేర్చిరి చిలుకపలుకు తెలియఁ
బలుక నేర్చిరి ధర్మము ల్ప్రబలి నడువ, నడువ నేర్చిరి వెడవెడనడక లప్పుడు. 166

మ. కని మోదించిరి తల్లిదండ్రులు జగత్కల్యాణచారిత్రుల
న్వనజాతాయతనేత్రుల న్విమలశోభాగాత్రులం బాగలో
చనిరేయహామిత్రుల న్మధురభాషాచిత్రుల న్మిత్రశా
సనసచ్ఛత్రులఁ గాఢజత్రులను నానాస్త్రోత్రులం బుత్రులన్. 167

వ. అని మనోల్లాసంబుగా నుపన్యసించి. 168

క. ఖండనరిపుఖండన ఖల,దండన గుణమండనానితాంతప్రణుతా
ఖండల మణికుండల భూ,మండలధర విధుదినేశమండలనేత్రా. 169

శా. జంభారాత్యభియాతిఖండనపటిష్ఠప్రోల్లసత్ఖడ్గదో
స్తంభాళిష్టితభూరిభూరిమణిదృప్యత్ప్రస్ఫుటోద్దామ దా
మాంభోధ్యాత్మధివాసమాశ్రిత సుతక్షాదీనరక్షాంచితా
రంభాదంభమహాభిలాష జగదారాధ్యాంఘ్రిపద్మద్వయా. 170

లయగ్రాహి.

పారఘనసారసువిసారసుమవారపటుహారవరక్షీరధృతిసీగసితతారా
దారఘనపారదశుకీరహితశారదనిశారమణశారదశరీరమృదుముక్తా
హారమధుపూరసురవారణసమీరణకుమారవరహారవరహాగవిలసద్డిం
డీరబహుతాసకరుపారకలిశారమణకైరవమహోరగపచారుతరకీర్తీ.

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణపదాబ్జధ్యానపరాయణ భూనుతభాగ్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ కొత్తపల్లి
లచ్చయప్రణీతం బైన దాశరథివిలాసం బనుమహాప్రబం
ధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః.

# దాశరథివిలాసము.



## ద్వితీయాశ్వాసము.



శ్రీమహనీయవదన వర, రామాజనమదన సుందరరదన రిపుమహా
భీమకదన రుచిరసువర్ణామేయచ్ఛదన వేంకటాచలసదనా.

క. అవధరింపు మనంతరకథావిధానంబు భగవంతుండగు వల్మీకోద్భవుం డిట్లని చెప్పం
దొడంగె. 2

క. తమ తలిదండ్రుల కానంద మధిక మగుచుండ రాజతనయులు ప్రో
త్తమకృతదీక్షులై యు, త్తమవృత్తము పౌరులకు ముదం బొనరింపన్. 3

గీ. రామలక్ష్మణులు మనోభిరామలీల, భరతశత్రుఘ్ను లురుశుభభరితలీలఁ
గవలు గూడిరి జక్కవకవల ఱేఁడు, వేలుపుటూడుఁ గూడు నస్వథము గాఁగ. 4

శా. విద్యాభ్యాసి వసిష్ఠునొద్ద ననుజాన్వితుండుగా నెంతయు
న్విద్యాభ్యాస మొనర్చి రాముఁడు మహావేదవేదాంగము
ల్విద్యానాథుని యట్లు నేర్చి మఱియు న్వీరుండు ప్రౌఢ్యద్ధను
ర్విద్యాపారగుఁ డయ్యె భీతి నవిలోర్వీనాయకు లుండఁగన్. 5

చ. గజిబిజి లేక వీఁకఁ దురగంబుల నెక్కి రణంబొనర్చుట
ల్గజముల నెక్కి పోరుట లిలాస్థితి జన్యము సేయుట ల్పతాం
గజలదయాత్రికిఁ గాండపటుకాండపరంపరఁ జూపుట ల్వరాం
గజనిభయాత్రి రాముఁ డధికంబుగ నేర్చె సహోదరాత్తుఁ డై. 6

వ. అంత. 7

క. దారకుల నంచితబ్బృం, దారకులం దుష్టజనవిదారకుల మహో
దారకరుణావిశేషులఁ, దారకరాజనిభముఖులఁ దారకనఖులన్. 8

మ. తనరాజన్యుఁడు పుత్రరత్నములకుం గళ్యాణము ల్సేయఁ బ
ట్టని రాజన్యసుకన్యల న్వెదకుచో గాధేయుఁ డామర్షతో

వారివిభేదనక్రమము నాత్మఁ గడుందలపోసి సత్కృపా
వారిధి వైన నీకడకు వచ్చితి మెచ్చితి నీదుభక్తికిన్. 21

శా. ఆపాపాత్ముల సంహరింపఁగ మదీయాంశంబులై నజన్మంబులు నెం
తేర్పూర్ణంబుగ నిర్వహించి విలసత్కీర్తిం బ్రతిష్ఠింపఁగా
నీపుత్త్రు రఘురాముఁ బంపు మతఁ డానీరేజపత్త్రేక్షణుం
డీపృథ్విన్ నరుఁడై జనించె ఖలశిక్షేచ్ఛన్ ధరిత్రీశ్వరా. 22

ఉ. ఈతఁడు సర్వలోకగురుఁ డీతఁడు దానవలోకభీకరుం
డీతఁడు మాధవుండు మఱి యీతఁడు మాధవభావభావితుం
డీతఁడు సర్వభూతహితుఁ డీతఁడు భూతలధారి గావునం
భీతి యొకింతయేని మహిభృద్వర పొందకు పంపు మింపునన్. 23

వ. అని పల్కి శ్రీరాము నుద్దేశించి. 24

గీ. తానవారికలీల నిద్రావశారి, తానవారిజంబుచందాన వారి
ముఖకమలములు నిజశోభ మఖకరాతి, ప్రమ్చఁ గళ్యాణమూర్తుఁడై వచ్చు మఱల.

గీ. అనుచు నవ్వాక్యములు వినునంత నగ్గ, సంభ్రమములఁ బడి హృదయాంతరంబు నిండఁ
బ్రజ్ఞ చెడి నవలగ్నంబు భగ్నమయ్య, మేను మ్రానయ్యెఁ బ్రాణంబు బిఱీణమయ్యె.

క. ఝల్లను జల్లుమనఁగ నో, యెల్లను వెల్లఁదన మూన నింద్రసఖుఁడు భూ
వల్లభుఁ డల్లన నమ్ముని, తల్లజుఁ బలుక స్మరంబు దల్లడ పడఁగన్. 27

క. తండ్రీ విను రాముఁ డెక్కడ, క్రౌరులు రాక్షసులు వారిఁ గైకొనక కడుం
దీండ్రించి నిలుచు టెక్కడ, వేండ్రము లీమాట లుడిగి విను నాపలుకుల్. 28

సీ. ముఖపద్మసౌగంధ్యముఖముఖునికశలి, ముఖముఖుండు రాముండు గలవా
ముఖమునఁ బూర్వాగ్ని ముఖశిఖిఖపంక్తి, ముఖుఁ డగు హరిదేవముఖసురప్ర
ముఖులు మజ్జన్ముఖు గూడి మొనయుజేయానమ్ము, ఖుల గాను జెప సుముఖుఁడవు గమ్ము
ముఖిలోకవచతుర్ముఖపతి పాలక, ముఖ మసోద్ధగితి దిజ్ముఖమునీంద్ర

గీ. ముఖ్యదండప్రసిద్ధాముఖు ఘటించు, గరము ఖగకరవంశశేఖరుఁడు దైన్య
ధనము ఖండితము సుఖచిత్తము గలంగ, ముఖము దిగవైచి హానిసమ్ముఖమునందు.

చ. ఇటులు నధోముఖుండయి దశేంద్రియవృత్తులు మాని హాని యై
కిటకిటలాడి కొంతవడికిన్ మొగమెత్తి నరేంద్రచంద్రుఁ డ
ప్పటిలునితోడ నిట్లనియె జానుగ నే నటు కేగుదెంచి ద
క్షటునకు కైసి ముఖముఁ గాచెద నేఁచెద దైత్యవర్గమున్. 30

క. తేర్చి బలంబుల వేసము, దూర్చికొని మహోర్మి మిత్తుఁ గూర్చి ఖలతనిం
గార్చిచ్చెర్చుపగిదిఁ బోఁ, గార్చి సవనము నెఱవేర్చి యశరదేంద్రు వనఘా. 31

క. మునిసింహుఁడు నృపకుంజరుఁ, గనుఁగొని సటలునిగుడంగఁ గనలుగదురఁ ది
గ్గన గద్దియదిగ్గనుతెంచి, చనసుద్యోగించి యద్దశరథునితోడన్. 32

మ. విన నర్హంబులు గానివాక్యముల నీవేళం బ్రశంసించితా
వినశంశంబునఁ బుట్టి నూహృదవహోహీనాంతరంగుండవై
వినయంబు న్నయముజ్ఝయం బనయము న్నిర్ధ్వస్తముం జేసి తీ
వినవత్యున్నసుశీల బొంకఁగలవారే పాతకాభీతులై. 33

క. జ్ఞానంబు విడిచి నూన్పరి,హీనత్ముగ నోర్చినాఁడ వింతియచాలుం
గానిమ్ము పోయివచ్చెదఁ, బోని మ్మనుసంతలోన భూపతితోడన్. 34

చ. కడఁగి వసిష్ఠుఁ డిట్లనియెఁ గంజహితాన్వయ మౌనిపాదముల్
గడిగి విశేషభక్తి నొకగద్దియనుంచి మునీంద్రచంద్ర నీ
కడిగిన వెల్లనిత్తు నని యాయనఁ బల్కి కుమారుఁగోరనీ
కడఁగి నిజంబుఁ దప్పుట మహత్త్వమె మెత్తురె దీని నుత్తముల్. 35

ఉ. రాఁప సమస్తవస్తువు లుదాత్తత నిచ్చెద నంచుఁ బల్కియుం
దాపసనాథవృత్తి యనుచితంబె కుమారుఁ గుమారధీయుతిం
దాపసనాథు వెంట నుచితస్థితిఁ బంపు మితండు ధాత్రిలోఁ
దాపసమాన్యుఁ డీతనివిధం బెఱుఁగంగ నశక్య మేరికిన్. 36

క. ఈమునిరక్షానికి నుతు, నీ మని మనమంత్రి మేని యతిఁ దల్లిచవో
నీమునికిఁ జెల్లనిచ్చెను, యామునికిం జోడు గలరె పృథ్వీనాథా. 37

వ. అని చెప్పిన విని. 38

క. గురునిధుఁ డగు గురు నాజ్ఞన్, గురుతర ముని తల ధరించి గురునాగ్ముణన్
గురుఁ డాకుచున్న తన నలు,గురుపుత్త్రులఁ గాంచి కృపయుగుఁ గురువెట్టంగన్.

క. బాలకుల నహితగజదం,బాలకుల వినీలనీలపరిహాతకోలం
బాలకులను గనేయఁగ, బాలకమలముఖుల నపుడు బనుమటు దూఁ దగన్. 40

ఉ. లజ్జగదీశునాజ్ఞ ముదితోల్లసితాత్మకులై రయంబునం
గొజ్జఁగ తేటనీట నృపకుంజరపుత్త్రులకుం గ్రమంబున
న్మజ్జనమాచరించి వదనంబులఁ గస్తురిరేఖ లుంచుమం
గజ్జలముంచి రాట్పుత్రుల కన్నులఁ గన్నులపండువై చనన్. 41

సీ. అబ్జాస్య యొకతె శుభ్రాంశుకంబు లొసంగఁ, బుష్పంబు లొకతీరుఁబోణి యొసఁగ
నొకశైలకుచ బంగరుకటకంబు లొసంగ, గంధం బొకస్మరాంకుశనిభ యొసఁగ
ఘనవేణి యొకతె ముక్తావళు లొసఁగఁ బ్రాకటితోరు రత్నకంకణము లొసఁగ
నొకఘనరసవతి యూర్మిక లొసఁగ రంభోరు వొకతె చంద్రహారముల నొ
గీ. సంగ నవ్వాలురకు సొంపెసంగుచుండ, నిట్లు సైసేయుఁ దల్లుల కెలమి మ్రొక్క
రాజహంసల గతులనా రాజసుతులు, రాజహంసల గతుల విరాజు లగుచు. 42

సీ. తమమందహాసజ్యోత్స్నాప్రపూర మచటిచంద్రోపలంబుల నీర మూరఁ జేయఁ
దమకచమేచకతమము భిత్తికల యూ, తమహీరములను నీలములఁ జేయఁ
దమపదపల్లవోద్గమశోణ మచటఁ గూర్పవకెంపులజిగిలోఁ జెలిమి సేయఁ
దమవిలోకనసుధాధావళ్య మచటి గృహములకుఁ దగువితానములు సేయఁ
గీ. దమతనూస్వర్ణరుచులవిస్తార మచటి, సకలజనులకుఁ బరమహర్షంబు సేయ
వచ్చి మ్రొక్కిరి మృదుతనూవల్లులకును, దల్లులకు సద్గుణవతీమతల్లులకును. 43

క. మ్రొక్కిన దీవన లొసఁగఁగ, నక్కొడుకుల నెత్తి ముద్దులాడుచు నెంతే
మక్కువఁ జాబుకతు లంటుచు, గ్రక్కున నారాజవర్యు కడఁ గనుచుండన్.

చ. నలు వగురీతి వచ్చి మునినాథులకున్ నరలోకభర్తకున్
నలువురు మ్రొక్కి నిల్చిన ఘనంబుగ దీవన లిచ్చి రంతన
న్నలువురిలోన నగ్రజు ఘనాఘనరాముని రాముఁ గాంచి య
న్నలువకుఁ దుల్యుఁడు న్నియమినాథుఁడు సైనవసిష్ఠుఁ డిట్లనున్. 45

చ. రవినిభ జాలమేల మన రాముసలక్ష్మణుఁ జేసి తాపస
ప్రవరుని వెంటఁబంపుము శుభంబగు నీకును నీదు నాత్మసం
భవులకు నంచుఁ బల్కుటయుఁ బార్థివుఁడున్ ముదమంది బాణతూ
ణవిహితపాణిహంసుల నొనర్చి యనర్చిన పుత్త్రమోహమున్. 46

క. ఒక్కింతసేపునకు దిగఁ, ద్రొక్కియతీశ్వరునిఁ గాంచి తోడ్కొని చనుమీ
చక్కనిబాలుర నని ధృతి, నెక్కొనఁ గా మఱియు నమ్మునీశ్వరు తోడన్. 47

క. కంటి బహుకాలమున కీఁ, గంటి న్నిమువంటివారి కార్యాగ్రము మీ
కంటెఁ గృపాపరు లెవ్వరు, కంటికి ఱెప్పవలె సుతులఁ గాపాడవలెన్. 48

వ. అని చెప్పి యాత్మజుల నాక్షోణీపతి యక్షీణతనయులన్ గృతలక్షణులును, సకల
కళావిచక్షణులును, శిల్పపారణ్యదక్షులును, శిష్టసంరక్షణులును, దుష్టజన
శిక్షణులును, ధర్మాన్వీక్షణులును, వినయలాభేక్షణులును, బద్ధపత్త్రిక్షణులును,

సమాచరితగురుప్రదక్షిణులును, లక్షణులునగు రామలక్ష్మణుల సమర్పించుటయు
నవ్విశ్వామిత్రుండు. 49

ఉ. ఆదట రామలక్ష్మణుల నాదరపూర్వము గాఁగఁ జూచి కొం
డాడెను రాజుఁ జూచి యిటులాడెను భీతిని నేను వీరిఁ గా
పాడెదువాఁడ నే ధరణినంతయు దుర్గతినొందకుండఁ గా
పాడెదువారు వీరు దునుమాడెదరు దుష్టుల నన్నికృష్టులన్. 50

క. అని యూఅడిల్లం బలికె. 51

మ. వనకియ్యా నృపజన్ముఁ గూడి మహిమ న్వ్యంచేయుశంభున్వలె
న్వ్యానుకయ్యన్నయుఁ దమ్ముతుం గొలువఁగా వేంచేసె నమ్మౌని పా
వనభూతిర్లలితాంగమున్ ఘనజటాబంధం బుర న్నాకభూ
వనభూజాతసుమంబులోలిఁ గురియన్ భావంబునం బొంగుచున్. 52

క. కామక్రోధరహితు లటి, భీములు ధర్మాత్మవనులుఁ గృపీటజనేత్రు
లాప్తమునిఁ గొలుముఖంబుల,తో మునిపతి వెంట దశరథునిసుతు లరిగన్. 53

క. చల్లనిగాడ్పు గదు వేద, చల్ల నకటభూరుహముల సత్పూనంబు
లల్లని సేసలగుచుఁ బై, జల్లని రాలంగ సంతసమునఁ బొదలుచున్. 54

మ. గణనాతీతలసద్గుణాగ్రణులు రంగత్ప్రాంచి కాకింకిణీ
క్వణనాసేచనకోరువిగ్రహులు లోకాలోకధైర్య ల్సుధీ
జనదూరాయిలు రామలక్ష్మణులు భాస్వద్వీక్షణు ల్సాగ్ధయా
జనదూరంబు పయోజబాంధవునియోజ న్మించునమ్మౌనితోన్. 55

క. మది నానందించుచు నెమ్మది నీగతి నేగి స్నేహమహిమ న్నగుచు
న్నదివోలెఁ బొలుచు సరయూ,నది గాంచిరి రామలక్ష్మణకుమారు లటన్. 56

సీ. పిలుఁదులకెనయగు పృథుపులినంబులు, వాలసామ్యమగు శైవాలములును
స్తనసదృశంబులౌ చక్రవాకములు నే, త్రములకీడగు శఫులములగములు
బాహులవంటి శోభనబిసంబులు భ్రమ,రకసదృశములైన భ్రమరకములు
నాననశోభాసమానాంబుజంబులు, చెక్కులరీతి భాసిల్లుకుస్త

గీ. లమరుపాళిక్కెఁ బోలిన యుల్లిసుళ్ళు, వళులకెనయగు వీచికావళులు గలిగి
వారకేలాసమాసక్తవారిజాస, నారుచిరవోలె మిగులఁ దనర్చు దాని. 57

మ. సరయూశైవలినీలలామఁ గని విశ్వామిత్రుఁ డా రామునితో
దరహిం బలర్కఁ గుమార యిత్తటినిఁ జూడం బంకజామోదయై

ఖరవాకంకణహంసకోర్మికఘోషాయత్తయై కామినీ
స్ఫురణం బొంపు వహించెఁ జూచితివె యంచుం దత్స్వరూపంబునన్. 58

క. వనజాతతటమనోహర, వనజాత సుమప్రభూతవరగంధము లోఁ
గొని శీతవాతపోతముఁ, గొనియాడఁగ నిట్టు లలమికొనిన నలరుచున్. 59

ఆ. విశ్రమించి రామవిభు రామవిభుఁ గాంచి, తత్స యీజలముల వార్చి రమ్ము
సకలభయనివారణకర మహావిద్యోప,దేశ మొసఁగువాఁడఁ దెలియ ననిన 60

మ. తనపాదోద్భవ యైనగంగమహిమం ద్రైలోక్యలోకాళిఁ బా
వనముం జేయుచు నుండఁ దాను సరయూవాఃపూరపూతాత్ముఁ డై
మునిసంఘంబులు దన్ను వార్చి ఘను లై మోదించుచుండంగ న
మ్మునియాజ్ఞ న్వెస వార్చి రాముఁ డనుజన్ముంగూడి భక్త్యున్నతిన్. 61

క. కరములు మోడించి జగద్గురుఁడుఁ గళాధారుఁడుఁ గౌశికుని గురుఁ దనుచుం
గరము వినుతించె విద్యాపరిగ్రహముఁ గోరి నియమిభాగ్యం బనఁదే. 62

క. ఈపగిది నిభృతుఁ డైనమహీపకుమారకుని సంయమీశ్వరుఁ డభయ
ప్రాపక బలాతిబలవిద్యాపరిణతుఁ జేసి మతియు నమ్మని పలుకున్. 63

చ. సనకసనందనప్రముఖసన్మునులీమహనీయవిద్యలం
దనర బఠింతు రర్థ్యులఁ దానవబాధలు మానసవ్యథ
లను క్షుత్పిపాసలును దార్కొన శాంతము సంతసం బగు
న్విను నృప యీయువిద్యలను వేడ్కఁ గ్రహించిన యంతలోననన్. 64

క. కొనియాడుచు విద్యలు చే,కొనియాడుచు ననుజుఁ గూడికొని హర్షించెం
దిననాథుఁ డస్తగిరి నొం,దిన ధరణీశసుతులు తృణతల్పములన్. 65

శ. ఆరాత్రి నిద్రఁ జెందిరి, యారాత్రిచరయూతరంగజానిలమొలయ
న్వారిరుహాయతనేత్రులు, వారినపుడు వేడ్క మౌనివర్యసహితు లై. 66

వ. ఇట్లు నిద్రించి విశ్వామిత్రప్రబోధితు లై కాలోచితకృత్యంబులు నిర్వర్తించి. 67

క. వేగంగ మనోముదమున, వేగంగ మనోజ్ఞగుణులయి విద్విషులు మది
న్వేఁగంగ మానియుతు లై, యోగంగ బవిత్ర యగుచు నేగంగఁ దగున్. 68

గీ. అట్టిజాహ్నవిఁ గని ద్యుమణ్యన్వవాయమణులు రమణీరమణులు లక్ష్మణులు రామ
లక్ష్మణులు సంతసమున నేలాలతానుకూలకూలంబు నంత మ్రొక్కుచును జేరి. 69

చ. లలితతరంగరంగమునలాస్యము సల్పుచు నున్న రాజహం
సలు జలపానలోలుపలసద్విపయూథపసత్క్ర మేఘుమం

జలము లటంచు భీతి గగనంబునకున్ వెసఁ బాఱి బాఱ నై
యుఱలెడు శారదాభ్రముల యట్టులు చాతకభీతి నేయుచున్. 70

చ. కమలకనీనికామణుఁ గోముదరేణుపమానపద్మపై
యమరెఁ గనుంగొనంగ మధుపాళి సువర్ణత గాంచియుండె నె
ట్టెదురెరులైనఁ జేరిన ఘటించెడి యోగ్యత యుండుఁ గాకయుం
డు మతి యెట్టి వస్తువు నీవనమునొప్పున గన్గొనుఁ డిమ్ముదంబునన్. 71

క. అంగములు వొంగ రంగ,ద్భంగము మజ్జఝాఘుధంగము జలమా
తంగరథాంగము సరసము, సంగముఁ దను జేయఁ బ్రసంగము నిదురన్. 72

వ. కనుంగొని రంతం దత్సమీపప్రదేశంబున. 73

సీ. తాలహింతాలరసాలసాలతమాల,కృతమాలపృథుసాలవితతిఘనము
నుపకంఠపీలకంఠోత్కంఠకలకంఠ,కలకంఠయుతమనోజ్ఞప్రదంబు
సారవిసారవిస్తారసారసనార,సాధార కాసారకాన్వితంబు
రంగత్తురంగాభిమంగభృంగాంగనా,భంగసంగీతశోభాయుతంబు
గీ. గండభేరుండసదవేదండకాండ,గండశోభద్దండపుండరీకప్రచండ
జీవజాలాదనము మునిజీవనంబు, పావనం బగు నొక్కతపోవనంబు. 74

క. కని రాముఁ డెవరి యాశ్రమ, మని మునిపతి నడుగ నాతఁ డావరమున ని
ట్లనియె ఘనాఘనగర్జా,ధ్వని దశదిక్పరదశాంధవరిమ మెఱయన్. 75

క. విను కామాశ్రమ మిది రా,మనృపాలక తొల్లి మాటిమాటికి దుండై పా
వననిష్ఠు గందర్పుఁడు, ఘనతప మొనరించె నిందు గరళగళుండున్. 76

చ. పరమతపం బొనర్పఁ గని భగ్నవ కయ్యమతోడిపాత్తుఁ గూ
ర్పు రహినటంచు దేవవిగతు లిమ్మనుకు ల్ఘటియింప నేగి చె
చ్చెర హాయిచిత్తముం గలఁగఁ జేసిన నాతఁ డెఱింగి మారు భీ
కరనయనాగ్ని దగ్ధతనుఁ గా నొనరించె నిమేషమాత్రలోన్. 77

ఉ. కాముఁ డెఱుంగునే యుచితకాలగతు ల్దనుగిట్లు భీముఁ డై
భీముఁడు చూడ దగ్ధుఁ డయి పృథ్విచలింపఁగ వ్రాలె వ్రాలిన
ప్రాము తదంగసంగమున రాజిలు నివ్వనయాబునంగసం
జ్ఞామహిమంబు వొందె నని గాధిసుతుం డెఱిఁగించి వెండియున్. 78

క. వి న్నిది నృపాల యాధయ,స్మరణర్ధ్యము ఘనతలునపరితుడు మిచ్చో
ట నివసి మాపినతే నం,బు నతి రేయి యూరుఁ గడపి ప్రొద్దు వొడిచినన్. 79

క. సంధ్యాకాలికవిధు లన, సంధ్యాగతిం దీర్చి జ్ఞానవారినిజచి
త్తాంధ్యు లగువారు గాశకు, వింధ్యాచలధైర్యుఁ గాంచి వినమితు లగుదుర్. 86

ఉత్సాహ. వారి నాదరించి మౌనివల్లభుండు జాహ్నవీ
వారి వే తరించి పోవ వాంఛచేసి పూజ ల
వ్వారిగాఘటించి మ్రొక్కి వచ్చుమౌనివర్యుల
న్వారియాశ్రమముల నుంచి భాగ మంచితంబుగన్. 87

క. తరణి యుదయించుచుండఁగఁ, దరణికులాభరణు లన్నదమ్ములు గొలువం
దరణిన్ భవభయసాగర, తరణిన్ జాహ్నవిఁ దరింపఁ దా నుద్యతుఁ డై. 88

గీ. యానపాత్రమహోమహాధ్యాని మౌని, యానపాత్ర మధిష్ఠించి యరుగుచుండ
నది గరము వొంగె హరిజగన్నాథుఁ దాల్చి, యతన భువనప్రసిద్ధి గాంచితినటంచు.

గీ. పావనాదసుధీశనందనులు రామ, లక్ష్మణులు లక్ష్మణులు పుణ్యులవారిఁ గడచు
నెడల నెడలనిరతముల నెలమినాల, కించి కించిజ్జ్ఞదూరు నక్షీణపుణ్యు. 90

ఉ. కౌశికుఁ జూచి మౌనిజనకౌశిక యిమ్మధురారవంబు లి
ట్లాకు గతిన్వినంబడియె నాకుగవృత్తి వశేఁబువంద యా
వేశతచి త్తవృత్తి వతివేడ్క నదభ్రచమత్కృతఘోవనీ
శౌకఘనోత్కలం దెలియఁగా నెలవి మ్మవి యంతుఁ బుట్టెనో. 91

వ. అనుటయు. 92

క. సరయూగంగాసంగమ, తరంగసంఘట్టనాద్భుతప్రథనమహో
త్తరనినదము లివి మ్రొక్కుఁడు, కరను వినీతు లయి ఫాలఘటితాంజలు లై. 93

వ. అని యానతిచ్చుటయు. 94

క. తలరాజసోదయగముఁ గ, ల్వలనే ల్గన్నులును గలకవలహాంసపుడ
వ్వలను గనుంగొని మ్రొక్కుచు, వలసినయవి యెల్ల మౌనివలనఁ దెలియుచున్.

క. కలమాదిసస్యములు విచి, కలమాలూరాదిలతలు క్ష్మాజాతంబు
ల్గలమానితతీరంబున, కలమారాసుతులు డిగిరి కౌశికయుతు లై. 96

క. కలిగాడు పెదిరికొన న, వ్వలియొద్దనసట్లునార వదలి యరుగుచు
న్వలిముఖులు లాయుశరభా, వలిఫేరవఘోరతరరవలి గలదానిన్. 97

గీ. భీకరం బగుదాని తమాకలింత్రి, తీకతమ్యాకపటుతి క్తశాకశాక
పీలుశాకోటవిరతశేఫాలిశామ, ధూకబంధూకవటముఖానోకహములు 98

క. కలిగితమోదూషిత మై, ఖలుచి త్తమువోలె దురవగాహం బై శా
ఖులపెనుమూఁకలచే నం, దుల మగుదాని నొకపెద్దకోనం గనియెన్. 99

చ. కనుఁగొని యయ్యగమ్య మగుకానన మెవ్వరిదో మునీంద్రచం
ద్ర నుడువు మంచు వేఁడిన నతండు మహాదరణంబుమీఱ రా
ము నగభేది వృత్రుఁ బరిమార్చిన బ్రాహ్మణహత్య చుట్టుము
ట్టినఁ దగఁ దద్విశాలము ఘటింపఁ దలంపమునీంద్రబృందముల్. 100

ఉ. మౌనులఁ గూడి పావనకమండలశీతలవారిసేచనా
నూనవిధానము ల్సలుప నుత్కటమౌ మలదుష్కరూశము
ల్మానవనాథపుత్త్రి విను మానగభేదితనుచ్యుతంబు లై
మానుగ నిర్మోదంబడె నమర్త్యులు మౌనులు సంతసింపఁగన్. 101

క. ఇద్ధరణిపయింబడిన, న్వృద్ధశ్రవుఁ డంతటం బ్రహ్మాప్తాత్ముం డై
శుద్ధతనుఁ డయ్యెఁ బిదపఁ బ్రసిద్ధముగా మలకరూశచిహ్నిత మగుటన్. 102

క. మలదకరూశము లనుచుని,మలదయనామములు వెట్టి మానితదేశం
బులు ధనధాన్యసమృద్ధం,బులు రెండొనరించె సురలు మునులుం బొగడన్. 103

ఉ. ఇందునిభాస్య రామ విను మీగతి సొం పెసలారుచున్న సం
క్రందననిర్మితంబులు పురంబులు చేరి దయావిహీన యై
సుందునిభార్య క్రౌర్యమునిశోషిణితాటక చాలనార్తు లై
యుందలిమానవు ల్బెగడ నందఱ మ్రింగెఁ గ్రమక్రమంబునన్. 104

క. మందుని సిరివలె మనుజుల, మందునకు న్లేశయుండె మదఘునఁ దినె నే
మందు నరేశ్వర వరలే,సుం డునుమాడంగ బలసమగ్రుఁడు లేమిన్. 105

క. తనకంటెన్ బలి తనయుఁడు, తనతనయుఁడు క్రూరుఁ డగుచుఁ దత్పారుల మ్రిం
గ నలరి యమ్మారీచుని, జననియు నధ్వగులఁ జంపు జనని యాతములన్. 106

క. అప్పటి నుండియు రాఘవ, యప్పట్టణయుగము శూన్య మయియుండుట చే
నిప్పగిది మార్గములు కడు, నొప్పక దుర్గమము లగుచు నుండు ననయమున్. 107

మ. ఇట తాటక యర్ధయోజనమున స్వేచ్ఛావిహారంబునం
దిట మొప్ప న్నివసించు దాని కెదు రై దేవేశుఁడుం బోవఁడే
డటుగాన న్వెసదానిఁ జంపి యశ మత్యంతంబుఁ జేకొంటు క
చ్చొటుపుం బోవఁగ నీకుఁ దక్కవశమే క్షోణీశ యెవ్వారికిన్. 108

వ. అని మఱియుం దజ్జన్మబలపరాక్రమప్రకారంబు లుపన్యసించుచుండం గాత్రితసవన
వాటిక యగుతాటక యున్నవనంబున కభిముఖు లై చనిచని 109

చ. మునివరు నాజ్ఞ దుష్టమృగము ల్వెగడొందఁగ సన్మునీశ్వరు
ల్వినఁ ముదమొంద రాముఁ డరవిందదళాక్షుఁడు దక్షుఁ డై కరం

బున విలు గుందరం బెసఁగఁ బూని భుజాబలసూచకంబుగా
నినకులసార్వభౌముఁ డెసఁగించె దిగంతర దంతురంబుగన్. 110

గీ. అమ్మహాధ్వని నిజహృదయమ్ము గలఁపఁ, గోటరమున సుకేతునికూఁతు రంత
నఖిలజనములు బెగడంగ నార్చికొనుచుఁ, బండ్లు గొఱకుచుఁ గ్రుల్లి పైఁ బాఱుతేర.

క. కని రతివిశాలకుక్షి, న్మనుజామిషభక్షిణిని సమర్త్యవిపక్షిన్
ఘనపవనకరేణుని బ్రహ్మణగుణహార్యక్షి లోహితాక్షిన్ యక్షిన్. 112

వ. కనుంగొని యాసమయంబునం బవిత్రచరిత్రుం డగువిశ్వామిత్రుండు దశరథాగ్రపుత్త్రున
కిట్లనియె. 113

క. మానిని యను ననుమానము, మాని నియమిహాంత్రి దీని మడియింపుము రా
మా నిను యశంబు వొందెదు, మానియమితవృత్తి నీవు మానితము గదా. 114

సీ. అనుచు మహాప్రేమ నారామునకు వాని, యానతి యిచ్చుచో నన్నిశాటి
కచురజఃకలితన స్ఫారణినమ్మువ్వ్రగ, మించి రజోవృష్టి ముంచి ముంచి
దూషితం బగుతమోరూపిత నని తెల్పు,మాడ్కిని మాయాతపంబు నన్ని
హెచ్చుపత్యము పొట్టత్రచ్చిన లేదు క, నుంగొనుఁ దనుభంగి నోరు తెఱచి.

గీ. చిత్రము శిలామయం బని చెప్పునట్లు, పరువపాషాణవిసరము ల్వఱపి పఱపి
వారిజాప్తేద్ధతేజుల వారి గ్రమ్మఁగఁ, డాయఁ జనుదెంచెఁ గాలఁబు డాయుకలన.

వ. అండియు నన్నక్తంచరి. 116

ఉ. మానక పైపయి న్వివిధమాయలు నన్నుచు దుష్టచేష్ట న
మ్మానవనాథనందనుల మానవమాత్రులఁగాఁ దలఁచి దు
ర్మానమదాతిరేకమున మానస మంతకునంత కుబ్బ న
మ్మానవమాంసభోజి యనుమానము మాని పరాక్రమించినన్. 117

క. కని రాముఁడు తన్మాయా,వినివర్తితశరము వఱపి విగతకృపం దీ
నిని జంపుట యెట్టులు మా,నినిజంపుట దోస మంద్రు నిగమాచార్యుల్. 118

వ. అని దయాస్వరూపిగావునం బాపి నకార్యపరూపిణి విరూపిణిం జేయనిరూపించు
సమయంబున సమీపించి విశ్వామిత్రుండు. 119

ఉత్సాహ. రామ సద్గుణాభిరామ రామ యంచుఁ గ్రవ్యభు
గ్రామ నిష్ఠ పంపకుండరాదు విన్ము తొల్లి సు
త్రామవందితుండు చక్రధరుఁడు భృగునిభామ సు
ద్దామ దుష్టకామఁ జంపె దాన దోస మొందెనే. 120

వ. కావున. 121

క. శస్త్రాస్త్రము లీవ్వఁ బఁ, చాస్త్రునకీ విద్య లెల్ల కుశమాతునకు
న్యస్తాభరణంబులు గడ, శస్త్రాస్త్రము లట్లు సంతసముఁ గా వనుచున్ 132

క. ధీకరతరశాశీక నా, శాశాశీక మగువనంబున నున్ని వినుతుం
డాశాశికు లెడ్కాని చనె, నాకాశను లెల్లఁ గొలువ నాశాశిపుడున్. 133

ఉ. అకలంకం బగు పస్వదన్యజసము ద్రాబ్జుండు రాముండు కా
శికు వెంటన్ జనకాజ్ఞ నెగి యటదోషింప గ్రూరఁ ద్రైలోక్య కం
టకి యాతాటకయున్న మంచుఁ దెలియ న్నాతాశిలోకంబునా
తికిఁ దెల్పు జనుభంగి నక్య్యపరవాధిం గ్రుంకె మిత్రుం డొగిన్. 134

క. సమయోకదంబకదంబక, మమరం బుష్పించి యతిశయం బగు నాశా
శ మనెడు తటాకమున నో, క్కా మొగిం బువ్వులెచ్చె నన్నగతి సందడియున్ 135

క తత్సమయోచితకృత్యము, లత్సాహపురస్సరముగ నొనరించి కడు
న్వాత్సల్యంబున వత్సల, నుత్సంగముఁ జేర్చి ప్రీతి నుపలాలించెన్. 136

వ. ఉపలాలించి 137

క. పుణ్యజనరహితవింధ్యారణ్యంబున రాజపుత్రరత్నంబులతోఁ
బుణ్యస్థలమున సుగుణాగణ్యుఁడు నిద్రించె నగ్రగణ్యులు వొగడన్. 138

ఉ. గ్రామణి సేవితుండు చతురబ్ధిఘనుండు నిపాతితేంద్రియ
గ్రాముఁడు గాధినందనుఁడు కాశ్యపసారథి వేడ్కఁ బూర్వగి
గ్రామ నలంకరించుటకుఁ గా జనుదేరకమున్న భీమసం
గ్రాముల రామలక్ష్మణుల గాఢదయామతి మేలుకొల్పనన్. 139

క. లలి మేల్కాని యాన్పపుత్రులు కృతకృత్యు లయి శర్మదుం డగు మునిపుం
గ్రుఘుల వ్రాలి నెత్తి ముదమున, నలఘుఁడు దీవించి శిరము లాఘ్రాణించెన్. 140

వ ఇట్లు గాఢాలింగనపూర్వకంబుగా గారవించి చారుమేఘశ్యాముం డగు రాముం గనుంగొని కామరూపంబు లగురోపంబు లొసంగెదం గొను మని పరిహాపితనిర్వక్ర కారిఖలాదండచక్రం బగుదండచక్రంబును వినాశితనిశాచరచక్రంబును పాలితధర్మ చక్రంబు నగుధర్మచక్రంబును విపత్కృత్యాదయశూలం బగుశూలంబును విరాధ్వతకాల పాశం బగు కాలపాశంబును ప్రధమాయావంతంబగుమాయావంతంబును దృఢశక్తి యగుశక్తియు దుష్టసంవర్తం బగుసంవర్తంబును బ్రహ్మాస్త్రబ్రహ్మశిరోస్త్రనారా యణాస్త్రంబులును నళనినిభంబు లగుపద్మనాభ మహానాభ సునాభసర్వనా భంబులును మఱియుం జేయఁగల నానాముఖంబులగుశిలీముఖంబులును సంప్రయోగో పసంహారక్రమపూర్వకంబుగా నొసంగుటయు శుచీభూతుం డై పరిగ్రహించి య

క. చెనక వకేము గాని మహీ,జనకరితుల రక్కసులను సాధించిరి మీ
జనకు నిదేశంబున నిఁక, జనకుని దేశంబునకును జనఁగాఁ గలయున్. 180

క. తద్విమయము భావన చే,తద్విమయము వినుఁడు జనకధరణీవిభుఁ డం
చద్విధి సవనార్థము బఁ,దద్వ్రమ భయాగంబు యాగము బంధించి కడున్. 181

క. పూత మగుచున్న హాలమున, భూతలమునం దున్నచున్న భూతిసమునకున్
భూతధృతికి సీతాసం,భూతిం బగు మందసంబు పొడఁగనవచ్చెన్. 182

వ. ఇట్లు తొక్కసంబుగ నొక్కటొక్కసంబు దోఁచుటయు. 183

గీ. రత్నగర్భ ప్రయత్నపూర్వకము గాఁజి, రత్నగర్భము లిట సుస్థిరంబు గాఁగఁ
బడిలపుబచెన్ గాక నాహాలిలక్ష్మి, నను గృతార్థునిఁ జేయ దీనను గలుగున్.

క. అని తత్సమీపమునకుం, జని మనమున నమితసంతపము పొంగారన్
మునిజనులమతమున జనక,ముని యించుక వెలిచి గాని మూతఁ దెలుచుతాన్.

చ. చలువునికిఁ ప్రయాణమును సంతతరాహువిరోధము న్వలా
హాలగళుఁ దగ్నిలోచనుఁడు నాజగరోన్నతుఁ డైవభిము పెం
దలను నివాసముం గని సుధానిధి పైఁపక యిట్టు లొంత్రి ని
ర్మలుఁ డయి డాఁగెనో యనినమాడ్కి ముఖంబు వెలుంగుచుండఁగన్. 185

సీ. మెఱపుఁ దీవలలోని మెఱుంగు నేరిచి తెచ్చి, నవక మై తగుకుందనంబుఁ దెచ్చి
ప్రమ్మసంపదలోనిపాలుపు నంతయుఁ దెచ్చి, వెన్నెలలో నీటు వెదకి తెచ్చి
గాయంబు గా నజ్ఞగర్భుండు సవరింప, వలయు లేకున్న నీతళతళయును
కరమిమ్మృదుత్వవైభవమును సౌరభం, బిప్రసన్నత ధర నెందుఁ గలుగ

గీ. దనుచు నుతియింప ననువగు తనువుతోడ, నక్కజంబుగ నుదయించె నొక్కబాల
జనకభూపాలుఁ డానందజలధిఁ దేలి, నీలవాల మనోజ్ఞలీలాలవాల. 187

వ. ఇవ్విధంబున నుదయించి. 188

క. సన్నని యవలగ్నంబును, సన్నని సుస్వరముఁ గడుఁ బ్రసన్ననిటలముం
జిన్నతనంబునఁ గలిగియుఁ, గన్నులు పెద్దవయియుండుట కరమరుదు గదా. 189

గీ. ప్రమదలమదం బడఁపఁగోరి పద్మభవుఁడ, పరమశృంగారముల నేర్చి భామ గూర్చి
యనుత లజ్జావతులు తల ల్వంచు రనిత,లంచి పెట్టియఁబెట్టి దాపించబోలు 190

చ. అని కొనియాడఁ బాత్ర మగునట్టికుమారిక నార్యమంత్రిస
జ్జనగుణసమ్మతంబునను సమ్మద మిమ్మడియై తనర్పఁ ద
జ్జనకుఁడు ప్రీతి నెత్తుకొని చయ్యన నాత్మపురంబు సేరి పౌ
రనికర మెల్లఁ జూచి యవురా యని సంతస మందుచుండఁగన్. 191

క. అంతిపురమునకుఁ జని తన, యింతికిఁ దాఁ బుట్టయు శిశువు నెత్తికొని కడున్
సంతోషించెడు నామెకు, వింతగ బాలెంత రాలివిధములు దోఁచెన్. 192

ఆ. పురమువారు నంతిపురమువారును హర్ష, జలధిఁ దేలుచుండ జనకుధర్మ
పత్ని పుత్రిఁ గాఁగ భావించి పెంచఁగఁ, జెలఁగెఁ దండ్రి వేడ్క మెఱుఁగు చుండ.

తే. పేదకు వసుపాత్రము నుమహాదాతకుఁ బాత్ర ముదవి కలవైత్రము సం
పాదిత మగుచందంబున, నానంపతులకుఁ గుమారి యాట్టులు కల్గెన్. 194

క. సీత యనఁ హలపథమునకు, ఖ్యాతిగ నామంబు గలుగు గావున మును వి
ఖ్యాత యగుటు సీత యనఁ బ్రతీతాహ్వయమున్ బ్రభవానికి తివిరియొసఁగెన్ 195

చ. జనకునిచేతఁ బెంపఁబడి జానకినాఁగఁ బ్రసిద్ధయై మహీ
జననముఁ గాంచి మించి మహిజాత యనం బొగడొందె కామినీ
జనమణి యైనసీత యిలజన్మని యై తనరారెఁ గుందనం
బునకును సౌరభంబు జత పొందినయట్లు క్రమక్రమంబునన్. 196

వ. సంప్రాప్తయౌవన యగుతనయం గనుంగొని తనయంతరంగంబున జనకుం డగు
జనకుండు. 197

సీ. పృథుకుసుమామోదనిష్పత్తాత్త్వ మే, పున్నాగనకుఁ గూర్చు ఘనతఁ గాంచు
నాభాగ్యదేవత నీభవ్యవక్త్రమా, స్త్రిక నేపుణ్యపాత్రుని కొసఁగుదు
నీసర్వమంగళ యాసతీతిలక నే, సర్వజ్ఞునకు బెండ్లిసలుపఁ గందు
మృదువాణి నీమనోహృతహంసయాన నే, లోకేశునకు నింక లోను పఱుతు

గీ. హంసకమహోగ్రకాకంకణాభిరామ, రమణి నీఘనవేణి నేరసనికి నొ
సంగువాఁడనో యనుచు సజ్జనవిభుండు, ప్రమదము నుండి తా నొకప్రతిన సేసె.

క. తమమందిరమునఁ జిరకాలము నుండియుఁ బూజ్య మగుచు లలినొప్పెడు ను
త్తమసత్త్వం బగుగంగో, త్తమాంగు చాపంబు నధికతారూపంబున్. 199

ఉ. ఎవ్వరు చాపసత్యమున నెక్కిడనోపుదు రట్టివారికిన్
జవ్వనిఁ బెండ్లిసేతు నని సర్వజనంబు లెఱుంగఁ బల్కఁగా
నివ్వసుమర్త్యధీశ్వరు లనేకులు తన్మహనీయచాపమున్
దవ్వులఁ గాంచి భీతిలి మనంబలఁతిపాటు నేమి చెప్పఁగన్. 200

వ. అనిపలికి రాముం గనుంగొని. 201

ఉ. అవనిసుధేశుఁ డిప్పుడు మహాధ్వరకర్ముఁడు నై మునీంద్రుల
న్వావిరి బిల్వఁగాఁ జనిదినాఁ డటఁ గావున సత్వరంబునం

ఉ. ఆధ్వని సీత కెంతయుఁ బ్రియంబయి తోఁచె సభాసదాళికి
న్సాధ్వసమయ్యె సప్తకులశైలసరిజ్జలరాశ్యుపేతమై
పృథ్వి చలించె భూజములు పెల్లగిలెం గ్రహతారకంబులు
ద్వ్యత్యధ్వములయ్యె సజ్జనులఁ దద్భుతమందె సమిత్రబంధులై. 294

క. తదనంతరంబ రామునిఁ, దదనుజునిం జూపి జనకధరణీపతి ముద
మ్మొదవఁగఁ గౌశికు నత్యం, తదమోఘతఁ గాంచి కడుహితంబుగ ననియెన్. 295

క. పుణ్యజనపోషణులు ఖల, పుణ్యజనద్వేషణులు సుభూషణులు గడుం
బుణ్యాత్ములు బుణ్యాత్ము, ల,గణ్యాత్ములు యూథపాగ్రగణ్యులు మఱియున్. 296

క. ద్విజరాజాననులు లస,ద్విజరాజాననులు ద్రవిణవిజితమహోద్య
ద్విజరాజులు కుండలస,ద్విజరాజులు వీరి సన్నుతింపఁగ వశమే. 297

సీ. అనుపమకీర్తిసమన్వితు లగు నీసుతు,మారులు దలఁపఁ గుమారసములు
భాసురసత్కళాపరిపూర్తు లీమహా,రాజు లాలోకింప రాజనిభులు
చక్రసంరక్షణసమగ్రు లీజగ,ద్బంధులు ఘనజగద్బంధుతుల్యు
లధికమహాబలప్రథితు లీసదా,గతులు గణ్గాన సదాగతిసదృశులు

గీ. పాదకటకాభిరాములై పరఁగు నీధ,రాధిపులు సన్నుతింప ధరాధిపులు ని
జమ్ముగ నటంచు రామలక్ష్మణుల గుణాళి, చక్షణులలక్ష్మణుల నుతిసల్పి మఱియు.

ఉ. పెద్దలు మీరు మీకరుణ పెంపున రాముని కీయఁగంటి నా
ముద్దులమూటవంటి సుత మున్నటువంటి మహాబలాఢ్యులం
బెద్దలచేత వింటిమె కుభృన్నిభధీరులఁ గంటి కన్నులం
దద్దయు వేడ్కమంటి నిఁకఁ దంగటిజూఁటి విధంబకోరుదుల్. 299

వ. అని యంత నిలువక. 300

శా. అత్యంతోత్కలికామిళద్ధృదయపుల్లాంభోజుఁడై యమ్మహీ
పత్యధ్యక్షుఁడు రామచంద్రునకు దద్భ్రాతకి న్నన్నుతా
పత్యాధఃకృతసుందరాత్మునకు నస్మత్పుత్రికన్ సీత సం
స్తుత్యప్రక్రియలో వివాహమొనరింతు న్సత్యవాక్యుండనై. 301

శా. ఉత్సాహం బభివృద్ధినొందఁగఁ గుమారోద్వాహముం జేయ వి
ఖ్యాత్సామంత పురోహితాప్త సచివవ్రాతాత్ముఁడౌ పేర్మిఁడై
సత్పాంగత్యరతుండు పఙ్క్తిరథుఁ డాసాకేతనాథుండు సం
పత్సౌఖ్యం బిటువచ్చునట్లు గుణనామాత్యావలిం బుచ్చెదన్. 302

క. అనిపలికి విశ్వామిత్రు ననుమతంబు వడసి. 303

ఉ. రాముఁడు లక్ష్మణుండు యతిరాజగు గాధితనూజు నాశ్రితుఁ బూ
ర్వామరసంఘముం గడిమి యన్నియమిప్రభునధ్వరంబు ను
ద్దామత నొందఁగాచి ప్రమదంబున దాఁటిని గోఁటఁ జేయఁగా
మామిథిలాపురీపవనమార్గమునం జనుదెంచి యొప్పఁగన్. 304

గీ. ఇట్టు లేతెంచి యొలమి మాయింట సార్వకాలమును బూజితంబగు కాలకాలు
చాపరాజంబుఁ గాలసర్పపతుంబు, నేపుమీఱంగ మేమంతఁ జూపుటయును.

ఉ. మత్స్వరవాసు లిద్ధమతి మత్స్వరుసాగ్రణులున్ మహాయశ
స్సత్వరుఁడైన లక్ష్మణుఁడుఁ దాపసనాథ వరేణ్యు లేనుసం
చత్వరమానురాగమున సన్నుతిసేయఁగ రామభద్రుఁడు
ద్యత్స్వరవైరికార్ముకము నగ్రముఁడై యిగ నెక్కువెట్టఁగన్. 306

క. సవరించివంచుటయు వాఁ, సవనుగ్రగమయినవిల్లు సవమునవిఱిఁగెన్
సవినయామ త్రిణయసుహా, సవరింపఁగ నింక రామచంద్రునకతఁగున్. 307

వ. కావున. 308

శా. తద్వైవాహికముం గనుంగొనఁగ మద్వైభవం బొప్పఁగా
విద్వన్మంత్రిసుహృద్భటార్యసచివాన్వీతుండ వై గమ్ము స
త్పక్షాంతరపూరితామలయశోధావళ్యసంగ్రామశా
మ్యద్వైరిక్రజగంధ పత్త్రిరథ నిత్యస్తూయమానప్రధా. 309

క. అని మద్వచనంబులుగా, జనవిభుఁడగు పత్త్రిరథుని సముఖమునఁ దగ
న్వినిపించి తోడితెండని, తనమంత్రుల ననిచి సమ్మదంబున నంతన్. 310

చ. అనఘులఁ బంకజాప్తకులశాస్త్వయముఖ్యసుజన్మరాయల
త్కృణమునినాథుల న్సుగుణజాలసనాథుల నొక్కమందిరం
బున నివసింపఁజేసి కడుమోద మొనర్చుచుఁ బంధురాజులన్
జనకుఁడు పిల్వఁబంచెను భృశంబుగ జాంఘికసాంఘికంబులన్. 311

క. ముద మొప్ప వెండి విప్రస, ముదయమునం బిల్వ సుభటముఖ్యుల ననిచెం
దదనంతరంబ పౌరులు, దదనుమతిం బడసి వింత దనుకొత్తఁగన్. 312

సీ. కస్తురినీటిచేఁ గలయంపిచల్లించి, ముత్తెముంబులఁ గ్రొత్తముగ్గు పెట్టి
విస్తారముగను రంభాస్తంభములు నిల్పి, విపణిమార్గంబులు విశదపఱచి
గుమగుమకలచు సంకుమదంబు వెదచల్లి, తలుచు గోడలకుఁ జందనముఁ బూసి
గోపురమ్ముల శాతకుంభకుంభము లుంచి, రమణఁ బచ్చఁతోరణములు గట్టి

ప్రద్వీపాంతరపూరితామలయశోధావళ్యసంగ్రామశా
మ్యద్వైరిద్విరదకంధపఙ్క్తిరథ నిత్యస్తూయమానప్రథా. 323

క. అని జనకుఁడాడిన విధ,మని దశరథుతోడ వార లనుటయుఁ దలియు
న్వాని యన్నరపతి యంతిం,తని చెప్పఁగరాని సమ్మదంబున మునిఁగెన్. 324

వ. మఱియును. 325

చ. అమృతముఁ ద్రావునప్పుడు బలారియు నట్యమృతంబుఁ దెచ్చుచో
నమృతమరీచిదీప్తి విహగాధిపుండు న్మదిసంతసించిన
ట్లమృతమయంబులైన సచివావళివాక్యము లాలకించి తా
నమితముదంబు నొందె మహితాత్ముఁడు పఙ్క్తిరథుండుదర్పభృన్. 326

క. మతిహీను లైనతనయుల, మతమునకకరంబునలరు మహిచంద్రుడును స
మ్మతి సుతులభినుతులైనన్, మతి జనకుఁడు సమ్మదాబ్ధిమగ్నుఁడు గాఁడే. 327

వ. తదనంతరంబున. 328

క. కాంతలకు సృణితుండన,కాంతలకున్ ద్రథితచంద్రకాంతోజ్జ్వలకు
ద్ధాంతలకుండచ్ఛభవ్య,త్రాంతం బెత్తిఁగించి గాఢ తరహర్షమునన్. 329

ఉ. తచ్ఛుభవార్త నెంతయు ముదంబునఁ జాటఁగఁ బంచిపట్నము
న్స్వచ్ఛగుళుచ్ఛపుర్గ్గ కలశప్రకరధ్వజసాలభంజికో
ద్యచ్ఛవిమత్పటాసుల భటాలి యలంకరణంబు సేయ నూ
త్నచ్ఛదధూమణాసుల ఘనంబుగఁ దాను నలంకృతాంగుఁడై. 330

సీ. శిష్టచరితులు వసిష్ఠాదిమునివరు,ల్మహిపసుమంతాదిమంత్రివరులు
ప్రకటవైణికవైణవికనికరంబులు, వందిమాగధభటబృందములును
బుణ్యకాంతాజనమ్ములు విబుధోత్తము, లాప్తాశ్రితులు మహాత్ములును
బృథుసైంధవములు గంభీరవేదిసులక్షు,ణాంచితప్రోన్నతహాస్తికములుఁ
గీ. గొడుకులనుఁ దోడరాఁ బెద్దకొడుకు పెండ్లి,కొడుకు గాఁగలఁడనుచు నెక్కుడుకుతూహ
లమున వారాంగనానటనములు సెలఁగ, రుచిరతుంగోల్లసద్రథారూఢుఁడగుచు. 331

క. ఘనఘనపటహాపటహపటు, పనవోద్ధ్వకజఝ్ఝరాంక్యబంధురభేరీ
ధ్వనుల వియత్పథ మవియన్, ఘనుఁడయ్యయ్యుఁడు మందగమనము సేసెన్. 332

ఉ. బాహుజవంశ్యు లెల్లెడలఁ బ్రస్తుతి సేయ నృపాగ్రగణ్యుఁడు
త్సాహత నేగి కాంచె విలసత్పరిణాహవివాహవస్తుసం
దోహవిశేషనిష్కుటమనోహరపుష్పరసప్రవాహని
ర్వ్యూహసువర్ణరత్నభరితోజ్జ్వలగేహ విదేహ నంతటన్. 333

క. కని తత్పురంబుఁ జేరం, జనుదెద వార్త్రించి జనకజననాథుఁ డెదు
రేఁగి నిజతూర్యధ్వను లులియఁగఁ, గొని యాడుచుఁ బురికిఁ దోడికొనిపోయి వెసన్. 334

ఉ. ఉపకంఠంబున మాగధు ల్వొగడఁగా నుత్కంఠ దీపింప న
న్నృపు లిట్టు లిట్లు తెచ్చి మహితోపేంద్రోపచారంబుల
త్యుపకారంబులు సొచరించి మణిపుణ్యాజ్ఞాభిత్రై సూకమా
నుష శాలాంబున నుంచి యుల్లసితచిత్తోత్ఫుల్లనీరేజుఁ డై. 335

తే. బంధుసత్కృణ వినుజగద్బంధువంశ, బంధురం బగునీదుసంబంధ మస్మ
దన్వయాబ్ధికిఁ జంద్రోదయంబు కరణిఁ, బెంపుఁ గావించె జనులు నుతింపుచుండ. 336

ఆ. అని నవంపజనకుఁ డాచరించెదుసప, ర్యావిశేషములకు నాత్మ నలరి
యా పుత్రబాంధవాత్మజోపేతుఁ డిట్లనియెఁ దెలియఁ దశరథాధిపుండు. 337

క. యత్నంబులుఁ భమదప్రతి, యత్నంబులు మాని తిరుగునట్టి తపస్వి
రత్నంబులు మీ చెలిమికి, యత్నము సేయుదురు పొగడ నలవియె మిమ్మున్. 338

తే. అట్టిమీరలు వేడ్క మా యట్టివారి, బాంధవముఁ గొనియాడు టబ్బంబు గాదె
నాకుమారకుపూర్వజన్మసుకృతంబుఁ, బొఁడవశమె హాసస్వయంభువులకైన. 339

వ. అని యిట్లాకరినొకరు చతురవచనంబుల నగ్గించు చున్న సమయంబున. 340

క. రాముని లక్ష్మణుఁ గొనివి, శ్వామిత్రుం డేగుదెంచి వాసవహితుఁ డ
య్యామివిభుఁడు దశరథుఁ డెంతో మోదముతోడ ప్రొక్క దీవన లెసఁగన్. 341

క. నాకానాకులు పొగడఁగ, నాకార్యము నిర్వహించి నాకార్యజనా
నీకస్తుతులు ఘటించి పినాకిశరాసనుశరాసనము విఱిచి తగన్. 342

క. భూతనయన్ భూతనయా న్వితస్వరియుఁ పఁగోరు శీతాంశుముఖు
న్నీతనయు రాము ననుజా న్వితుం, గనుము మహావినీతుం బ్రీతున్. 343

క. అని మునిపలికినపలుకులు, తన చెవులకు నెలమినమృతధారలు వో లెం
దనుకటుయు మొక్కి నిలిచిన, తనయుల దీవించి పులకితశరీరుండై. 344

ఉ. భూమివిభుండు మోహమునఁ బుత్త్రులఁ గౌఁగిటఁ జేర్చి వారిన
మ్మోములు మోమునిల్పి శిరము ల్గడుమూర్కొని చెక్కుటద్దము
ల్ప్రేమ మెసంగ ముద్దుఁ గొని పెద్దయుఁ బొ్రద్దు సుతోపగూహనా
ద్దామసుఖాతిరిక్తుఁ డయి తాపసవర్యునితోడ నిట్లనున్. 345

క. మునుగణహీనులు గుణవం,తునిసంగతి గలిగి సద్గుణులగుదురు గదా
మునుగుణహీనులు వినునా, తనయులు గుణవంతులైరి తగునీకరుణన్. 346

వ. అని మఱియు ననేకవిధంబుల నభినందించి వందనసందర్శనంబునం దనివినొందనిపురం
దరవిభవుండగు దశరథునికడకు జనకనిమంత్రితుండగు నొక్కమంత్రిపుంగవుండు

మఱునా డరుదెంచి మిమ్ము నిజసభాభవనంబునకుఁ దోడ్కొనిరా నన్నుఁ బనిచె నని
చెప్పుటయు నాతఁడును. 347

సీ. పురుషోత్తమునిచతుర్భుజములు నాసుతు, లర్మ్ము సేవింప విద్వన్మతుండు
ఘనుఁడు వసిష్ఠుండు గనుఁగొని తనకును, త్తమములాంగికమంగళములఁ దెలుపఁ
బుణ్యకాంతాజనంబులు సేస లాలుకంగ, బ్రాహ్మణోత్తముల దీవనలు సెలఁగ
స్తుతిపాఠకులు మాగధులు సందడింపఁగ, నాప్తమంత్రులు భటులనుసరింపఁ
గీ. దూర్యములు మ్రోయ నార్యులు స్తుతులు సేయ, గాయకులు వాడ నహితుల గర్వమూడ
సురభిసౌరభవిసరమారుతము విసర, మందగమనంబు గాల నమందలీల. 348

తనగజకుంభంబులఁ గల, ఘనమౌక్తికవితతి వలెఁ గాన్పించెను నా
స్తనములఁ బ్రశస్తవస్త్రో, స్తనములు మెఱయంగ వారసతులు నటింపన్. 349

వ. రాజవిభవంబున రాజమందిరద్వారంబుఁ జేరంజనునప్పుడు. 350

మ. మునుమున్నెన్నడెంచెనో కృపసతి రాము న్ద్విజచూడామణిం
గనుసద్వ్యాంఘఁ గుమారునెత్తికొని వేడ్కన్మించి రామోల్లస
త్తనులీలం గలధౌతభూధరమహాత్సాధాగ్రభాగప్రభ
ద్ఘనితాంతోజ్జ్వలరత్నదీప్తిఁ దనరత్యాకృతి న్వాడంబింనుమున్. 351

ఆ. కాంతయొకతె చంద్రకాంతశిలాస్పృష్ట, వేదిఁ దలఁపుచాటు వెట్టి చూచెఁ
దాపమెడవు మరునితూపులవలనిభ, యంబు నోర్వలేనియదియుఁబోలె. 3 2

క. భూవరుఁ గాంచెనుత్వర గన్, లేవిదుఁ దాల్పకయుఁ గాంచి నిడివనుదెంచెం
భావజుభుఁ గాంచినచో, నీవెసడలునంచు నొక్క నెలఁత మెయిఁ దవన్. 353

ఉ. కాత్రిలాఖ్యలకన్యార్హు రాముఁ గనువేడ్కం గింకిణీధ్వానయై
వాటం జైవకవాటయుగ్మము భుజద్వంద్వంబుపం బూనియే
పీటన్నేఁడు భవాదృశుండనుచు నర్త్యస్వర్గలోకాఖులం
జాటం జిత్రపుఁబత్రయుగ్మమమర స్పందించెనో నాఁ దగన్. 354

క. బాలయొకతె నీలోత్పల, మాలిక యూదంగ సంభ్రమంబునఁ గాంచె
న్నీలతను శతని నతనుని బోలఁ, నటమీఁద లెక్కఁ గొనసనుభంగిన్. 355

వ. తత్సమయంబున. 356

గీ. పార్శ్వములనుండి చూచెడు పౌరబాలి, కావరేక్షణములనాసికలు దనర్చెఁ
బ్రకటనీలోత్పలాబ్జచంపకకుసుమములఁ గలయఁ గ్రుచ్చినవనమాలికల విధమున. 357

వ. అట్టిమహోత్సవాజనకసమయంబునం బురంబునం గలపురంధ్రీజనంబులుదమలోన. 358

క. మనసీత కితఁడు దగునీ, తనికి న్మనసీత మిగులఁ దగుఁ దుల్యవయో
ఘనలావణ్యాదుల నని, కొనియాడిరి గుంపుగూడికొని బహుభంగిన్. 359

చ. అనితనపుత్త్రిరాముఁ గొనియాడెడు పౌరజనాళివాక్యము
ల్విని చతురబ్ధియుద్ధపృథివీతలరాజ్యము దన్నునొందిన
ట్లనుపమసమ్మదంబున మహాత్ముఁడు పఙ్క్తిరథుండు వొంగిత
జ్జనకుసభాప్రదేశముఁ బ్రశస్తవిశేషమణిప్రకాశమున్. 360

వ. కనుంగొని యదంభశాతకుంభకుంభిత భద్రకుంభగంభాస్తంభోజ్జృంభితంబును నవనవ నవరత్నవిరచితోచితవేదికాకవాటసోపానతోరణభద్రాసనకుడ్యచిత్రకంబళ విచిత్రమణిపుత్రికాదీపదీపితంబును బటీరనీరతుషారవారిప్రసిక్తంబును గృత్రిమరూపాలిరిక్తంబును బరిణయాలోకనాగత చాతుర్వర్ణ్యస్థితతదుచితప్రదేశవిశాలంబును సమస్తవస్తుప్రశస్తంబును సకలజననయనాభిరామంబునగు జనకమునిచక్రవర్తి సభామంటపంబు దరియం జొచ్చి నవసరమ్మున. 361

ఆ. ఎదురులేనికడిమి నెసఁగుపఙ్క్తిరథక్షితీంద్రుఁ జనకుఁ డప్పు డెదురుకొనియెఁ
దావులెల్లఁ గ్రోలి తగురీతివలిగాలి, యెలమిమీఱుమున్న యెదురుకొనఁగ. 362

వ. ఇట్లెదిర్కొని. 363

ఉ. వేడుకగారవించి పృథివీవిభుఁ బఙ్క్తిరథు న్మహారథుం
దోడుకవచ్చి రాముని వరూజనకామునిఁ గీర్తికామునిం
జూడఁగ వేఁగుసేయు పరిశుద్ధమనోరమకాయు గేయునా
మాద్రిదధిక్షోపలక్షణు సురప్రతిపక్షభిదావిచక్షణున్. 364

క. నముచిరిపోపశమనసముఁ, జితరూపప్రదీప్తసౌమిత్రిఁ బరా
క్రమనిధుల భరతశత్రుఘ్నమహోత్తరులను బొగడుచుఁ గడువాగ్ష్మునన్. 365

క. అద్రిబలీనుల నతిధైర్యాద్రుల రాఘవుల శాత్రవాద్రిపవులఁ దం
భద్రరత్నభద్రసముచిత, భద్రాసనముల వసింపఁ బంచి ముదమునన్. 366

క. భూవరుఁ డనంతరంబున, ధీవరుఁ డనఁదగు నరుంధతీవరువార్ద్ధే
వీవరతుల్యు వసిష్ఠుని, దేవర్షిప్రణతుఁ బరమధృతిసంయుక్తున్. 367

గీ. తాప్రసవిరహితు సుచరితచిత్తాప్రసనమున, సన్నుతింపుచు నతనినిమ్ముఁ జేసి
నతజనవిధేయు గాంగేయు నతులభక్తి, నిహితమగుచోటఁ దగనుపవిష్టుఁ జేసి. 368

వ. మఱియుం దగినవారి నుచితాసనాసీనులం జేసి తానుం దగినయెడ సుఖోపవిష్టుండై సర్వజనమనఃప్రమోదంబుగా సుప్రసంగంబు సేయుచుండి జనకుండు దశరథున కిట్లనియె. 369

క. జాతానందంబున భూ,జాతత్రాముఁడు దనుజాత న్సుముఖా
బ్జాత న్సుతనుజాతన జాతోపమనేత్ర మదనసాయకగాత్రన్. 370

గీ. లలితపరిమళనామార్హ్మ లక్ష్మణునకు, నొసఁగెదనటంచు మిగుల సొంపెసఁగఁ బలికి
మఱియు నిట్లను దశరథక్ష్మాతలేంద్రుఁ, డగ్గలంబైన సంతోషమతిశయింప. 371

క. అనఘోపఘ్నులకు న్మని జనశత్రుఘ్నులకు భరతశత్రుఘ్నులకున్
ఘనముగ నొసఁగెద హితులవు, వనఁగ మదనుజుని తనయల నలఘుతనయలన్. 372

వ. అని యిట్లు రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు శ్రుతకీర్తులగు భూమిసుతోర్మిళామాం
డవీశ్రుతకీర్తుల నొసంగి వివాహంబులు సేయువాఁడుగా నిశ్చయించి పలికినమ్మహీ
విభుండు మహానందంబునొందెం దక్కిన సభాసీనులును సమ్మతంబునం దేలి యాడుచుం
జనకుం బ్రశంసించి రయ్యవసరంబున. 373

క. పరమమునీశ్వరచేత,స్సరోజవాసి యగు రామచంద్రుని కతనం
గరమొప్పెం దత్సభహిమ కరోదయావసరదుగ్ధకంధి విధమునన్. 374

వ. అంత. 375

క. తనకులజులకు వివాహము, లని రాగము మీఱ సమ్మదాంబునిధి మునిం
గినచందంబున నరుణుం, డనుపమరాగమునఁ బశ్చిమాంబుధి వ్రాలెన్. 376

మ. తనసాంగత్యము వాసి పద్మహితుఁ డంతర్థాన మొందన్ స్వశో
భనజాలాయతహస్తపల్లవక్రియ విభ్రాంతిన్ వ్యాపించెనా
తని రపోకడఁ గ్రోధతామ్రగతి సంధ్యారాగముం దద్విరో
గనిదాఘాంబుకణప్రకారమున నక్షత్రంబులు వ్యాపించెన్. 377

క. ఇనునికరస్పర్శము మా,నిన విరహము నొందు పద్మినీక్రమమున న
య్యినునికరస్పర్శము మా,నిన విరహము నొందు పద్మినీక్రమము మరేన్. 378

చ. అహితుఁ డహీనతేజుఁ డగునప్పుడు డాఁగి యుదంచితప్రభా
రహితుఁడు గా నెఱింగి పరరాష్ట్రము నాక్రమణం బొనర్చున
ట్లహిమకరుండు తేజుఁ డగునప్పుడు డాఁగి యుదంచితప్రభా
రహితుఁడు గా నెఱింగి తిమిరంబులు ముంచె ఘగాంతరాహముల్. 379

వ. ఇవ్విధంబున సూర్యాస్తమయంబగుటయు సద్దశరథుండు. 380

ఉ. పాపవిదూరుఁ డమ్మిథిలభర్త నుతింప నుతుల్ భజింప ఘుం
టాపథ మొప్పఁ జేయుచు ఘనప్రభ రాజగృహంబు చేరె ను
ద్దీపితరత్నదీపకరదీపసహస్రము లుల్లసిల్ల ధా
త్రీపతి యూర్మ్యగావధరీకృతసర్వదిగంతరాళుఁడై. 381

క. ఆర్యులు వసిష్ఠకౌశికు, లార్యాపతిసముఁడు సముచితాత్తశతులు ని
ర్ధార్య లమాత్యశ్రేష్ఠుఁడుఁ, గార్యజ్ఞులు పొడఁగ నుపకార్యం జొచ్చెన్. 382

వ. ఇవ్విధంబున భృత్యామాత్యపుత్త్రమిత్రసమేతుండై విడిదికిం జని యచ్చటి వినోదంబులం దగిలి రోమలం జంద్రమరీచులం జాలకనసేయు ధౌతకలధౌతశకునసౌధాగ్రభాగం బున గగనధునీవీచుల నీచములలితపవనం బొలయ వీణానాదంబు లులియ సుఖని ద్రం జెందియున్నంత. 383

సీ. పద్మిని మదనతాపంబునను గృశించెఁ, బద్మిని సంతోషభరిత యయ్యె
క్షీరతుషారసంసిక్త యై మహి యొప్పె, సరగఁ దుషారసంచయ మడంగెఁ
గువలయంబునకు నెక్కొనె వికాసంబు, గువలయస్మయము సంకుచిత మయ్యెఁ
దళతారకాప్రభాతతి మంద మై తోఁచె, నోలిఁ బ్రభాతవాయువులు వీచెఁ

గీ. దామ్రచూడధ్వను ల్మ్రోసెఁ దద్దఁ దూర్పు, తామ్ర మై యొప్పె నంత భక్తజనవృజిన
కర్తనుం డుదయించె వికర్తనుండు, భవతమోవిభావసుఁడు విభావసుండు 384

గీ. మిహిరకులవర్యుండునను మున్న మేలుకాంచి, కృత్యములు సల్పి దశరథనృపవరుండు
సరగఁ బుత్త్రచతుష్టయసహితుఁడగుచుఁ, గౌశికవసిష్ఠులకుఁ బ్రొక్కి కడుముదమున.

క. కార్తాంతికదత్తేద్ధము,హూర్తంబునఁ దనయులకు మహోత్సవములకుం
ధూర్తాంతకులకు గుఱితని, కార్తాంతికులకును బరిణయము లొనరింపన్. 386

వ. కృతోత్సాహుండై యుండునంత జనకుండు సుతల నలంకృతలం జేయం బుణ్యసతుల
నియోగించుటయు నవ్విధం బరసి. 387

క. అమ్మానిను లిట్లని రో, యమ్మా నిను బోల్తు రూఢుమతిఁ ఘనుఁడు రా
ఘవమూర్తి విద్యుల్లతికా, సమ్మానితదేహ సుగుణసహితస్నేహా. 388

క. అని పలుకుటయు స్లజ్జావనతానన యైన సీత వనజాతనిభా
క్షి వజాతసామ్యఁ గొని మజ్జనశాలకు నేగి యుచితసంభ్రమలీలన్. 389

ఉ. ముద్దులగుమ్మ లందియలమ్రోఁత లెసంగఁగ డాసి గ్రద్దనం
దద్దయువేడ్కఁ రత్నఖచితం బగునొక్కపసిండిగద్దియ
న్నద్దియ నుంచి యాఘనమనోహరలోచన పద్మహస్తతో
నద్దియటుంచు నంతఁ దమయుల్లము లెంతయుఁ బల్లవింపఁగన్. 390

గీ. కమ్మనూనియఁ దలయంటి యొప్పుగులుకఁ, గడిగి యుద్వర్తనమువర్ణకముఁ జేసి
మజ్జనంబు ఘటించిరి మనము లలరఁ, బుష్కరాననలు మనోజ్ఞపుష్పరసముల. 391

వ. ఇవ్విధంబునం బెండ్లిపాటలు పాడుచు మంగళస్నానంబు సమాచరించి. 392

క. ధారాధరములు ఘనము ల,పారిద్యాయములు నయ్యెఁ బ్రతినిధి యగు నే
యారామకురుల కనుచును, నీరాంచె నొక్కసతి వినీలత యొప్పన్. 393

క. అభ్రాళలగ్నమయ్యు విమ,లాభ్రాలక ధైన సీత కానందమున
న్విభ్రాజితముగఁ గట్టెఁ గ, శుభ్రాంశుక కుక్షి యొకతె శుభ్రాంశుకమున్. 394

సీ. నిర్మలస్ఫటికవినిర్మితఫలకభా,స్వన్మధ్య సముదితచ్ఛాయ యనఁగ
నమృతకళాపూరితాంతరితుం డగు, శశిలోన మించులాంఛన మనంగఁ
దుహినవారోదయోత్ఫుల్లమనోహర,పద్మాంతరస్థ భ్రమర మనంగఁ
బ్రకటసమ్మార్జితముకురబింబాంతర,నిహితసుందరహారనీల మనఁగ

గీ. నలకములు వాయఁగాఁ ద్రోచి యలికభాగ,ఫలకమునఁ గస్తురితావులు జిలుక సమ్మ
దంబునను సర్వజనులచిత్తంబు లలరఁ, దిలక మొనరించె నొకసతీతిలక కులుక.

గీ. ప్రకటసౌవర్ణసాలభంజికలలోన, మెలఁగుజవకతనూజాత తెలియరాద
టంచు నొకసతి యానవాలుం జేసెనఁగఁ, జెక్కుటద్దంబునం దొక్కచుక్కఁ బెట్టె.

ఉ. పాటలకన్నతోఁ బ్రియము పాటలగంధి యొనర్చె సీతకు
న్నాటికరభూటి లేదనుచు నాట్టిపచించెద నరము మించుఁ బ
న్నీటఁ గుశేశయంబులను నీటుగుకన్నులు తోమి వాటమౌ
కాటుకఁ బెట్టె నొక్కసతి కాటుకబట్టల ద్రిప్పిసేయఁగన్. 397

క. సారపరిమళితఘనఘన,సారమిళితగంధగంధసారంబున వి
స్తారానందంబున నొక, సారసలోచన యొసంగెఁ జక్కు మహిజకున్. 398

సీ. పువ్వుఁబోణికి మల్లెపువ్వులు దండచేయు, ... నీవాసిక నవ్వుపువ్వు
తావిసంపెఁగపువ్వు తనువు చెక్కిలి ... పువ్వు, మానినీపువ్వు ... పువ్వు
పల్లవాధరకు పువ్వు తెల్లపువ్వులు, పాలుపాయపొక్కిలి పొన్నపువ్వు
మోము తామరపువ్వు మోవి మంకెనపువ్వు, కన్నులు నల్లని కల్వపువ్వు

గీ. తెల నీపువ్వులకవని చేపలొక్క, కాంతకస్తూరికాదాసి ... గాగ
మాలతీచాంపేయజాజీసుమావళుల నొసంగె సీతకుఁ గుసుమాంజలి వెసంగు మండ. 399

వ. ఇవ్విధంబున నాశ్రితు మాండవీ శ్రుతకీర్తులకు నమపమశృంగారంబు లొనరించి
యున్నంత నక్కడ. 400

ఉ. అంగన లంగజన్ముఁడని యంగవిలాసము సన్నుతింపఁ బు
ణ్యాంగనలొప్పఁ బాడుచుఁ బ్రియంబున రాము నభంగమంగళా
భ్యంగన మాచరించి వ్యాకయంగమువాణ్యలలంకరించి రు
చ్యాంగుచు భూరికాంచనవిభూషణము ల్బరితోషణంబునన్. 401

గీ. తనరు కస్తూరిబొట్టు లాంఛనము గాఁగ, మందహాసంబు చంద్రికామహిమ దనర
సరసవాక్యము లమృతరసంబు గాఁగఁ, జంద్రుఁడై వడి శ్రీరామచంద్రుఁ డొప్పె. 402

క. లలిఁ గంతు జయంత వసంత లలితు లన నొప్పు లక్ష్మణ భరత శత్రు
ఘ్నుల శత్రుఘ్నులఁ గామిను, లలంకరించిరి విభూషణాంబరపటలిన్. 403

వ. తదనంతరంబున. 404

క. నయముల స్వవినయులం బరిణయయోగ్యులఁ బద్మపత్రనయనుల ననమా
నయశోధన్యుల నాత్మజ, నయులఁ గని జనకుఁ డతిఘనం బగు వేడ్కన్. 405

చ. వెలఁగి మహాగ్రనిశ్చయముఁ జేసి విదేహమహీధవుం డమా
త్యులఁ బిలిపించి యుద్ధతగణఘుస్నతబంధుసమేతుఁ బంకజా
ప్తకులితవంశ్యుఁ దోడ్కొని ముదమ్మున రం డన వార లమ్మహో
జ్జ్వలుకడ కేగి యట్లని రవాగణ వాక్ప్రసరత్వ మేర్పడన్. 406

మ. అవనీనాథ భవత్తనూజులకుఁ గల్యాణంబుల న్సేయ నీ
దివసం బుత్తమమంచుఁ దెల్పెఁ దని వైదేహుండు మమ్మంపినాఁ
డవనీదేవసమావృతుండ వయి రమ్మాలస్య మింకేల బాం
ధవు లెల్లం గనియాడఁ బుత్రహితభృత్యశ్రేణిలో నొప్పఁగన్. 407

గీ. అనిన ముదమంది యొసఁగె నయ్యంబరమణికులమణి వారలకు ననవద్యభూషణాలు
సముతతాంబూలజాంబూనదాంబరాది, మహితబహుమానములు బహుమానముగను.

వ. ఇట్లొసంగి 409

న. దశరథుఁ డంత బ్రాహ్మణహితాసనమర్చ్యసమాచరించి స
త్వరగతు లైన మానవులు ముదంబునఁ దోనరు దేర శత్రుఘ్ను
గ్వశరథసామజాశ్వభటపఙ్క్తిసమేతముగా నయోధ్యవా
ల్యాశులయి కొల్వఁ బౌరజనవారము సంతసమంది చూడఁగన్.

క. రాజముఖుల సేసలు నీ రాజనములుఁ గొనచు నంచితరాజపథమునన్
రాజవిభవమున నఖిలధ, రాజనులు నుతింప బంధురాజసహితుఁడై. 411

వ. చనునవసరమ్మున. 412

న. తెలియవు కామినీజనుల చీటుగుపాటలు వేణునాదము
తెలియవు కల్లుసేసలును దేవల లాలితోఁ బుష్పవర్షము
తెలియవు పంకజాప్తకరదీధితులు న్మణిభూషణాంశులుం
గలసి వెలుఁగుటం ధరణికాంతుఁడు పెండ్లికిఁ దర్లుచుండఁగన్. 413

క. అమరధునీవిమలాంభః, కమలవనీవిహరణంబు గాంచి మలయభూ
భ్రమరుత్కిశోరమధ్యశ్రమజనితనిదాఘబిందుసంచయ ముడుపన్. 414

వ. దశస్యందనుండు పురందరు చందంబునం బురంబువా రబ్బురంబంద నందనులం బురుషవృషభులం బురస్కరించికొని యమంద మహానందకందకందళితహృదయారవిందుండై మందసుందరగమనంబున వందిమాగధులు సందడింపఁ జిందంబుల రొదలు గ్రందుకొనం దరణికిరణంబులకుం దెఱపియీని గొడుగులం దనివినొందుచుం డెఁదన కలంకుల నందలమ్ముఁ గ్రములం దగురీతి నడువం దలుముగ సుందరమకరందబిందువులు జిందు మందారకుసుమసందోహంబులు బృందారకబృందంబు లందంద గురియింప ధరణీబృందారకు లాశీర్వదింపం గొందఱు సుందరులు గ్రంతలుగొని ముందఱ నటువ నందమ్ములగు సందియ లడుగుందమ్ములం దొడిగి చందనం బలంది యిందిందిరంబులం దెగడు సంక్రందననీలంబులం గ్రిందుపఱచు కురులుం దోవలందిరస్కరించు కన్గవలపొందికలుం, గందుకంబులం ద్రిప్పు కుచద్వంద్వంబులుం, గుందనంబు డంబు డిందుపఱపందగు తనుచ్ఛాయలుం, దలిరాకు మోవులుం, దెలిచెక్కులును, దరస్మితంబులుం, గుందరదనంబులుం గలిగి యువజనంబుల డెందంబులు గొందలంబందఁజేయుచుం దన మోసలం దండలాసకాది వివిధవిధానంబులం దాండవంబు సల్పుచు నందఱేని పదుపుండెఱకలరుగం జందనోదకంబునం దడిసి గందవడి నందంబగు రాజమందిరంబుం దరియం జొచ్చు నవసరమ్మున మహాల్యానందనుండగు శతానందనిభుండు శతానందుండు తోడరా జనకుం డెదుర్కొని తోడ్కొని చ.. 415

క. సముచితముగ నర్ఘ్యముఁ బాద్యము నొసఁగి యనంతరము ముదంబున మణిపీ
ఠములిడి జనకుఁడు పూజించె మహారఘు దశరథునుం బ్రసిద్ధుల మునులన్. 416

వ. ఇట్లు పూజించి సమస్తజన మునిజనకదంబానందజనకంబు లగువచనంబుల దశరథున కిట్లనియె. 417

చ. బుధజనమాన్య పఙ్క్తిరథ భూనుతకీర్తికి రామమూర్తికి
న్నధికవిరోధిలక్ష్మణకుమారునకున్ భరతాభిధానమా
గధతనయాకుమారులకుఁ గావలయుం దగ్గోలోన వివాహము
ల్వృధి శుభస్యశీఘ్ర మను పెద్దలవాక్యము లాలకింపవే. 418

వ. అనుటయు మహానందమగ్నుండగు దశరథుండు. 419

క. తదవసరంబున సుతులకు, సదమలులకు నలువురకుఁ బ్రశస్తంబగున
భ్యుదయార్ఘ్యమధిపుఁ డొసఁగెన్, నొ్మదలన్విప్రులకుఁ బాడిమొదవులఁ బొదలన్.

క. విధివంతంబుగ జనకుఁడు, మిథిలానాయకుఁడు విప్రమిత్రసహితుఁడై
మధుపర్కంబులొసంగెను, మధుపసమానాలకులకు మనువంశ్యులకున్. 421

వ. తదనంతరంబున. 422

క. కలధౌతధౌతసుందర, కలశోదక మాత్మపత్ని గైకొని యొసఁగ
న్వాలుకులితజలజరేఖా, కలితనృపకుమార పదయుగములు గడుగుచున్. 423

క. అన్యములగు దానమ్ములు, కన్యాదానసదృశములు గావని యొసఁగెం
గన్యాదానంబులు జన,మాన్యులమన్వ్యాస దశరథమహీపతులకున్. 424

వ. అంతట. ,25

చ. వెలఁగి యరుంధతీపతి వసిష్ఠుఁడు రాముకరంబుఁ బూని ని
ర్మలనవరత్నగుంభనవిరాజిత దివ్యవివాహవేదికో
జ్జ్వలకనకాసనంబున నివిష్ణునిఁ జేసి సువాసినీజన
మ్ముల నియమించె నింపెనయ భూతనయం దగఁ దోడితేరఁగన్.

క. సీరపథజాతకుఁ బ్రతి, సీరములుఁగు వెట్టి సృష్టుకు శేశయముఖలా
విరుక్తులు సెలఁగ కునా, సీరనిభుఁడు రామచంద్రు చెంతనునిచెన్. 427

క. ఒకరినొకరు చూచెడువేడుకలు కడునోర్మలక లెత్తుడు వధూవరదృ
క్ప్రకరిప్పగ విరినఁదగె యవ,నిక యమునావిమలవాహినీభంగమనన్. 428

వ. అంతట. 429

ఆ. తెలివ లుచితరీతిఁ దెరచలువమరల్ప, జనక భాగ్యరాశి జనకతనయ
తఱుఁగులేని వార్ధి తరగల నుదయించు, సిరివిధమునఁ దేజు సిరి వహించె. 430

గీ. లలితమాలా మనోహర గళయగు చుఁద్యమాలసాలంబు సరసనేలాలత యన
నీలమేఘంబు చెంత శంపాలత యన, బాల తనరారె రామనృపాలు మ్రోల. 431

ఉ. సీతకటాక్షవీక్షణము శ్రీరఘురాము ముఖప్రభాతకం
జాతవిచిత్రచిత్రకిత సారకురంగ మనంబుఁ గా సము
ద్యోతితమయ్యె రాఘవ మహోజ్జ్వలదృష్టికరంబు మా అభూ
జాతకుఁ గజ్జలంబునఁ బొసంగనొనర్చిన చెక్కుచుక్కగన్. 432

వ. తదనంతరంబున. 433

మ. కులకాంతాతిలకావళీవలయిత శ్రీకుమారీ పవి
త్రలసచ్ఛీర్షమున న్మునీంద్రజనమందారుండు రాముండు లోఁ
దలఁ బ్రాల్దోయిటఁ బట్టి వేడుక భుజద్వంద్వంబుపై కెత్తియుం
చె లతాగ్రంబునఁ బుష్పగుచ్ఛమనఁ రంజిలం గులాచారతన్. 434

ఉ. మోముపికాసమంద భుజమూలయుచు, త్ర్వేలుఁగొందఁ గంకణ
స్తోమఝణం ఝణంకృతులు సొంపెసఁగం జిఱునవ్వు నవ్వుచుం
దామరసాక్షు లెంతయు ముదంబునఁ దోశయి హెచ్చరింపఁగా
రామునిశిరంబు మీఁదఁ దలఁబ్రా లునిచెంవ గ భూమిజాతయున్.

ఆ. మఱియు వేడ్కఁ జేత మహిజాత తా శ్వేత, మౌక్తికములు రాము మస్తకమున
నునుపఁబూన హస్తయుగము గడునిక్కెఁ, జూచువారికెల్ల శుక్తి యనఁగ. 436

వ. తన్మహోత్సవ సమయంబున. 432

క. జనములు క్రిక్కిఱిసిరి దివి, చనరామి నెఱింగి యుచితకాలపథములం
జని రాముని పరిణయమున, జనితాజితలీల మెలఁగె శ్వేసనాంబరముల్. 438

క. గళదురుగండశిలాన, స్గళభేరీధ్వనుల రిపులు గలవరపడుదం
గళమున బంగారిపు మం, గళసూత్రము రాఘవుండు గట్టె మహిజకున్. 439

ఉ. భూజనకల్పభూజుఁ, డజపుత్రికినూజుఁడు రాముఁడంచితాం
భోజదళాక్షుఁ డిద్ధవిధి భూమిజఁగూడి మహోత్సవంబునన్
లాజల నాజ్యధారల దళంబులఁ దృప్తిఁగ నొసర్చె న
వ్యాజగురుప్రసాదుని సుతాగమనాముని జాతవేదునిన్. 440

ఆ. సర్వసాక్షి కర్మసాక్షివంశజుఁ డగ్ని, సాక్షికముగ సీత సారసాక్షి
నఖిలలోకసమ్మసాక్షిణలావణ్యఁ, బ్రీతితోడ నిట్లు బెండ్లి యాడి. 441

శా. శోభాగాత్రి కరుంధతీసతికి నక్షుద్రోరుచారిత్రకుం
బ్రాభాతామలపద్మనేత్రకు సతీప్రాతాంచితస్తోత్రకు
న్సౌభాగ్యం బభివృద్ధినొంద రఘువంశస్వామి రాముండు సీ
తాభామాసహితంబుగా నెరఁగె నుత్కంఠం బ్రణమ్రుచ్చఁగన్.

క. జనుల కరుంధతి మఱిఁదలఁ, జిరమాత్రన కల్గు సర్వసిద్ధులుఁ దనా
నినిఁ బ్రత్యక్షముఁ బూజించిన సత్సౌభాగ్యసిద్ధి చేకుఱుటు యదే. 443

వ. మఱియుం బంచమహాశబ్దంబులు బ్రాహ్మణాశీర్వాదనాదంబులు ననూనపుణ్యాంగనాగాననాదంబులు నింగిముట్టం జెలంగుచుండ వసిష్ఠుండు లక్ష్మణ భరత శత్రుఘ్నులకు నూర్మిళామాండవీశ్రుతకీర్తులఁ బాణిగ్రహణంబులు క్రమంబున నడిపిన నిట్లన్నదమ్ములు నలువురు నేక కాలంబునం గృతోద్వాహులయి వధూసహితంబుగా జాతవేదునకు నమస్కరించి వసిష్ఠ విశ్వామిత్ర శతానందప్రముఖ నిఖిల మునిప్రకరంబునకును దశరథజనకభూమాధవులకుం బ్రణమిల్లి స్వస్తివచనంబులు పరిగ్రహించి యున్నంత. 444

క. దానోత్తమమగు భోజన,దానంబున జనులఁ దనిపెఁ దజ్జనకుండుం
దానంబుల నురుభక్తి వి,ధానంబుల ద్విజులఁ దనిపెఁ దజ్జనకుండున్. 445

వ. అంత. 446

గీ. గంధసింధురయవనకంఖాణసుభట,గణ్యధేనుసువర్ణవస్త్రప్రశస్త
దాసదాసీవిశేషశయ్యాసనంబు, లరణము లొసంగె వేర్వేఱ నల్లురకును. 447

క. విశ్వానందప్రదస,ప్తాశ్వకులుల యుచితపరిణయంబులు గనియు
ర్వీశ్వరు దీవింపుచు న,వ్విశ్వామిత్రుం డభీష్టవృత్తిం జనుచున్. 448

ఉ. మాఁతులఁ జేరఁబిల్చి జనకుండు మహాదరణంబు మీఱ వి
ఖ్యాతపతివ్రతాత్వవిహితాంచితశీలను లెల్ల వారికిం
బ్రీతి నుపన్యసించి యలరించి విశేషవిభూషణాంబర
వ్రాతసువర్ణరత్ననికరంబు లొసంగె మనోముదంబుగన్. 449

క. హరి రమను సిరియును మానవ, శరీరులు దాల్చినట్టి చందమున వధూ
వరు లీసీతారాములు, గరిమెప్పొంటుచు జనుల కలకల మెసఁగన్. 450

క. అధికతరానందుఁడు దశ రథ,ధరణీవిభుఁడు దత్పురంబున మహిత
ప్రథఁ గొన్ని దినంబులు జన,కనగాధిప మాన్యుఁడై తగన్వసియించెన్. 451

వ. ఇట్లుండి యొక్కశుభదినంబున జనకునానుమతంబు వడసి యపరిమితపరిచారికావ్రా
తలగు వధూరత్నంబులును మహానందయుతులగు సుతులును సమస్తబంధుమిత్రా
మాత్యులును నుచితవాహనంబు లధిష్ఠించి యనుగమింప రథారూఢుండై పుణ్యకా
మినీజనమ్ములు సేసలు సల్ల సమ్మర్దనిలాపూరంబు వెల్లువడి తన్ను నుపవచ్చు జనకచక్ర
వర్తి నధికధర్మమూర్తి సపరివారంబుగా నెట్టకేలకు మరల్చి యుచితయానంబున
సాకేతాభిముఖుండై 452

క. చారిత్రశాస్త్రవినయుఁడు, దారుఁడు పట్టిగనుఁ జేరు నాటిభయదమున్
ప్రసాంగతమారుతంబులు, నారుణ యుగ వీచె నత్యుదగ్రస్ఫురణన్. 453

గీ. ఇట్టి గత్కృతునంబుల నెట్టనట్టు, వృత్తునో యని కులగురువునకుఁ దెల్పి
తద్విధంబెల్ల నాత్మబోధమునఁ దెలిసి, చూచి ధాతని కిట్లనునంతలోన. 454

సీ. తుత్రుటికారణ్యాగ్నిహోత్రమహోజ్జ్వల,త్కీలకు తాకంబు కేలఁ గ్రాలఁ
గాంచనాచలకటకవిశాలవక్షస్స్థలంబునఁ దెలిజన్నిదంబు మెఱయ
నఖిలమానవనివహాభయంకరము లైన,దృష్టుల నంగారవృష్టి లొలుక
నధికప్రతిభ దెల్పు నరుణకాంతి వహించు, ముఖమునఁ గనుబొమ లుబ్బిడిఁవడంగ

గీ. దశరథుం డిచ్చు పూజావిధానములఁ బ్రతిగ్రహింపక యాగ్రహోదగ్రుఁ డగుచు
నిగ్రహానుగ్రహసమగ్రు నీరజాక్షు, రాముఁ జేరంగఁ జని భృగురాముఁ డలుక. 455

క. విత్రాసస్థిరవిగత,శస్త్రము గావించి తొల్లి కశ్యపునకు ని
ద్ధాత్రిసమస్తము నొసఁగిన, ధాత్రీసురముఖ్యు జామదగ్న్యు నెఱుఁగవే. 456

క. హరుశీర్ణచాప మెక్కిడి, పురుషోత్తముఁడ వనిపొందుఁ బొంగెదు పురఘ
స్మరుచాప మచలమేనర,వరుఁ డని నినుఁ బొగడిరెల్లవార లెఱుఁగమిఁక. 457

క. నాచేతం బూజితమై, నాచేతంబొల్చు పద్మనాభు ధనువొగి
న్నీచేత నధిజ్యమగుదు, నీచేఁతలు చిత్రములని నెఱినమ్మవగుణ. 458

క. ధృతి నాధను వెక్కిడిన, స్మృతి నిను భావింతు సత్త్వమహితునిఁ గాఁ గా
కతిమెచ్చక మేనియు నిం,దితరాజసతామసములు నీకుం గలవే. 459

చ. అని తను జామదగ్న్యుఁ డనయంబులు వల్కఁగఁ గార్ముకమ్ములో
న నతని సత్త్వముంగొని ఘనంబుగ నెక్కిడి రామచంద్రుఁ డా
తని వరపుణ్యలోకసుపథంబులు గూల్చి మదంబడంచి తం
డ్రిని నిజబంధుకోటి నలరించె ననంత భుజాబలాఢ్యుఁడై 460

గీ. రాము గెలగొని భార్గవరాముఁ డల మ,హేంద్ర పర్వతమునకునై యుచ్చ జనియె
రామునటుఁ బుచ్చి దశరథరాముఁ డలమ,హేంద్ర విభవంబుతోఁ దండ్రికెలమి మ్రొక్కె.

క. రాజకులపాళి రాము ప్ర,రాజయమును నిజజయంబు గహి నెఱిఁగింపన్
రాజాననుఁ డగు నగ్రత,నూజు న్సౌందర్యజితమనోజుం బొగడెన్ 462

వ. ఇట్లు పొగడి. 463

క. తనరవసిష్ఠుం డెఱిఁగిం,చినవిధమునఁ దొలఁత భయము జెంది జయముఁ గై
కొనఁ గర్గనుచుఁ దన మన,మున గుహల మేమములోధమునకుం బొంగెన్. 464

వ. మఱియును రామభద్రు ధైర్యావార్యశౌర్యాశార్య గాంభీర్యస్థైర్యాదిగుణంబు
లగ్గించుచుఁ దమ రాకకు నలంకృతంబగు సాకేతంబుఁ గౌతుకంబునం గనుంగొని.

క. పురజనము లెదురుకొన రథ,కరితురగకరధాపణముగు ఘంటాపథముం
దరిసి చనునవసరమ్మున, బురుషులుఁ దెఱవలును రాముఁ జూడఁగని తమలోన్. 465

సీ. జనకునియాజ్ఞ విశ్వామిత్రులో నేగి, తొలుదొల్లఁ దాటకఁ దునుమటయును
నీచుమారీచు మున్నీట ముంచుటయును, బిరప సుబాహునిఁ జదుపుటయును
గౌతమజన్నంబుఁ గాపాడుటయు నొక, గ్రావంబు వంగనఁగా నొనర్చు
టక్కపీట జాటు కార్ముకము ద్రుంచుటయును, భ్రాతృయుక్తముగా వివాహమగుట

గీ. తండ్రిమదిలోని భయమెల్లఁ దలఁగఁ బరచు, రాము మార్గాన యతనిగర్వం బడంచి
చెలఁగి సాకేతమునకు విచ్చేయుటయును, చెప్పికొని చాల సంతసించిరి మఱియును.

చ. పురవరవర్ణను ల్వివిధభూషణభూషిత లై సువర్ణనూ
పురరవము ల్సెలంగఁ గడుఁ బొంగెడు రాగరసంబు చేర్మిఁ గో
పురవరసౌధభాగములఁ బొందుగ నిల్చి నరేంద్రు రాముఁ గో
పురవరు సౌరకామినులపోలికఁ జూచిరి నేస లొల్కుచున్. 467

వ. ఉత్సవమయంబున. 468

సీ. అగణితసౌధ యానిగమాంబురాశికి, రాణించు తనరాక రాక గాఁగ
సమధికభయదరాక్షసచమూపకులకుఁ, దనదర్శనము సుదర్శనము గాఁగ
హితవిద్వేషు లౌ విబుధనాయకులకుఁ, దనచరిత్రములు చిత్రములు గాఁగ
సహితరాజన్యసైన్యములకుఁ దనప్రతాపంబు మిక్కుటపుఁ దాపంబు గాఁగ

గీ. సత్యధర్మక్షమాదయాశౌచరత్న, సమితికిఁ దనగుణములు గుణములు గాఁగఁ
దమ్ములనుగూడి రామచంద్రప్రభుండు, వేడ్క విహరించె నప్పురవీథులందు. 469

వ. ఇట్లఖిలజననయనోత్సవంబుగా విహరించి 470

క. తమ్ములు తరుణీయుతు లుచి, తమ్ముఁగఁ దనుఁ గొలువఁ దాను దైతాయుతుఁ డై
తమ్ముఁగ నువేడ్క నధికము, దమ్మిందుచు నున్న యట్టితల్లుల కేరఁగన్. 471

వ. అంతఃపురమ్మునకుం జను నవసరమ్మున నవసరమ్ము లురమ్ములఁ గరమ్ము మెఱయఁ గరమ్ముల గంకణ నికరమ్ములు మొరయఁ గుచమ్ము లారయఁ జఘనమ్ముగ రశనమ్ములు చెక్కిన పసిండిపళ్ళెరమ్ముల ననురూపమ్ము లగుహిమవాలుకాదీపమ్ముల దీప్తులు తమతలప్రదీప్తులకుం దగ వనిక్రిందుపఱచుట లగవనిన చందమ్మునం గొమ్ములు బాహులతిసమ్ములు సాఁచి యొసంగు నీరాజనమ్ముల రాజిల్లుచు నెడ నెడ వినోదమ్ము లగువీణానాదమ్ములకు ముదమ్ము నొందుచు జనయిత్రులపంపున నెదురొగ్గని పుణ్యకామినీజనమ్ము లొసంగు రక్షాకరణమ్ములకు సమ్మతించుచు నుభయపార్శ్వమ్ములనుండి యుభరాజగమనలు శుభాచారలాజమ్ములు చల్లుచు నాసేచనక మ్మగు నిజమూర్తివిలాసమ్ము నాలోకనమ్ముఁ గావింప మనోహరరత్నగుంభనవిచిత్రభిత్తికాని కాయంబులవలనను లసమానాసమానకాయమానంబులవలనను నిరుపమానమానినీబృందంబులవలనను రమణీయతరపదార్థంబులవలనను గరం బొప్పు మాతృగృహంబుఁ దరియం జని. 472

ఉ. తమ్ములఁగూడి రాఘవుఁడు తల్లులపాదతలమ్ము లాత్మమా
నమ్ములు సోఁక మ్రొక్కిన ముదమ్మున దీవన లిచ్చి ప్రేఁ ప్రే

యెమ్మెనఁ గౌఁగిలించికొని మక్కువ లెక్కువ లై తనర్ప నా
యమ్మలు ముద్దులాడిరి ప్రియమ్మున నిద్దపుఁజెక్కుటద్దముల్. 473

క. చన్నుల దుగ్ధంబులు వా, ల్గన్నుల నానందబాష్పకణములుఁ గలిగం
గన్నులపండువు నగుచు సుతు,ల న్నలువురఁ జూచుతల్లులకుఁ జిత్రముగన్. 474

వ. తదనంతరంబున. 475

సీ. అంబుజంబులమీఁది యళులవిధమ్మున, మోమున నలకలు ముసుఁగువడఁగ
నడుము లున్న నని తెల్పెడుభంగిఁ గాంచికా, కింకిణీక్వాణనము గ్రాలుకొనఁగ
నీలమేఘమ్ముల మేలమ్ములాడువి, ధమ్మునఁ జికురబంధమ్ము లమరఁ
బదతలమ్ముల కెంపు లాదవి సుధాధాత్ర, సోపానము లరుణచ్ఛాయ లొందఁ

గీ. జిఱునగవు లాననములకుఁ జెన్నొసఁగ, వినయములు రూపములు దాల్చు ననువుగాఁగ
గల్లుగల్లన జనుదెంచి యాత్తలకును, మోదమునఁ గ్రొత్తకోడండ్రు మ్రొక్కుటయును.

క. శ్రీవనితావరు రాక్కృతు, లీవనిత లటంచుఁ బ్రీతి నెత్తికొని కడుం
దీవించుచు నెంతయు సం, భావించిరి మానసములు ప్రమదం బందన్. 477

క. శ్రీకరమూర్తులఁ బుత్త్రుల, నాకోడండ్రఁ గని యుబ్బి యాడిరి విమలా
స్తోకచరిత్రలు కౌసల్యాకైకామగధతనయ లానందమునన్. 478

క. వనితాయుతుల న్సుతులం, గని జననీజనకు లమితకౌతుకమతులై
రని చెప్పి తనమనంబున, ననుపమ మగుహర్ష మంతకంతకుఁ బెరుఁగన్. 479

చ. పరమకృపారసానిలయభావితమౌనిసుచిత్తసారసా
నిరుపమసాహసావినుతనీరజగర్భకృపీటరేతసా
గురుతరదేహసారపరిశుంభిత దుష్టనికృష్టరాక్షసా
భరిత మహాప్రసాద హితభక్తజనావన సక్తమానసా. 480

క. శరణాగతజనశరణా, శరనారదకీర్తి సనితసంకాశరణా
స్ఫురణోక్తిమదాశరణా, చరణా వేంకటమహారసాధరశరణా. 481

మాలిని. ప్రణమదఖిలసూరీ భక్తలోకోపకారీ
ప్రణవఘనవిహారీ భాసురానందకారీ
రణవిజితసురారీ బ్రహ్మచంద్రానుకారీ
తృణకలుషవిదారీ సర్వదా నిర్వికారీ. 482

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమస్థైర్య
వినయ రామనార్యతనయ పండితసేవాసమున్నత శ్రోత్రపల్లి
లచ్చయ ప్రణీతం బైన దాశరథివిలాసం బను మహాప్రబం
ధంబునందు ద్వితీయాశ్వాసము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.



## తృతీయాశ్వాసము.


శ్రీమద్వేంకటనామోద్ధామ ధరాధామ సుగుణధామ రవిసుధా
ధామ నయనవశంకితసుత్రామా రిపుభీమ సుందర విజితకామా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబుఁ బ్రచేతసుం డగుప్రాచేతసుం డిట్లని చెప్పం గొడంగె నట్లు సుప్రాప్తమనోరథుం డగుదశరథుం డొక్కనాఁడు నిండుఁగొలువుండి యమాత్యులం గలయం గనుంగొని 2

ఉ. సంతతి లేమి లేదనువిచారము దూరముఁ గాఁగ బుత్త్రులన్
సంతసమందఁ గాంచితి నసాధ్యబలాఢ్యులు వారు వారికిన్
స్వాంతతకీర్తిశాలుర కొసంగఁగ సన్నుతపుణ్యకామినీ
సంతతులైనకన్యలఁ జక్కఁగఁ బెండిలిచేసితీగతిన్. 3

క. నావలము గడువెలింగె, న్నావులసత్కీర్తి యయ్యె నావలమొప్పె
న్నావులకాంతల మతులున, నావలయులుగాఁ దనర్చె నావలకరుణన్. 4

వ. అని పలికి వెండియు. 5

క. బుద్ధివికల మగుదృష్టియు, విద్ధం బగుబలము చెడువివేకం బుడుగు
న్వృద్ధతఁగదిరినజనునకు, సిద్ధం బతఁ డింతయుం బ్రసిద్ధుం డైనన్. 6

ఉ. అర్వజనావనంబు వివిధాహితసైన్యమహాతిశక్తితా
నిర్వరణంబు నంచితమనీషయుఁ గోమవిశేషపోషని
స్వర్వణనంబు రాజులకు సమ్మతధర్మము లౌటఁ గాఁడఁగా
నర్వలు గారు రాజ్యమున కంధులు వృద్ధులు బుద్ధిహీనులున్. 7

వ. అని యిట్లు తనకృతార్థత్వంబును, వృద్ధత్వంబును, రాజ్యపాలనాసమర్థత్వంబును కేటువశం బలికి మఱియును. 8

ఉ. నించెదఁ గీర్తి దిక్కుల ననిందితధాముని రాముని బ్రీతి
న్నించెదఁ బూజ్యరాజ్యమున శిష్టజనానుమతుండనై యను

క. కైక వినుము రాముని లో, కైకవినుతనాము నడవి కనుపు మనుచు నీ
కై కడఁగి యొరుల నెడనుడిఁ, గైకొనఁగాఁ దగునె కూర్మికర్మము గాకే 31

మ. ధనము ల్వేఁడిన వేఁడఁగాఁ దగుసుతుల్ ధాత్రీతలం బేలఁగో
రినఁ గోరందగు నీవు నీకు సవతుల్ ప్రీతి న్మను న్వేయఁగా
చినఁ గోడందగుఁ గాక వారిజముఖీ చిత్తంబు భగ్నంబుగా
మునివృత్తి న్వనవాసిఁ గాఁగ రఘురాము న్వేఁడ నీ కర్హమే. 32

క. మునివృత్తిం గానల రాముని వర్తింపంగఁ బనిచి మునుకొని యిఁక నే
మనియెద తాల్మి నిలిపి యే, మనియెద నేమనియెదను రమణిరో నిన్నున్. 33

వ. అనుటయు నక్కేకయరాజనందన. 34

క. సేర్చిన యక్కాలసల్యముఁ, గూర్చితి వీవనినయట్లు కొంకక యుడఁగా
నోర్చెద వని నమ్మితి నిను, జర్చింపఁగనైతి మును మృషావచనునిగాన్. 35

ఉ. అక్కట కోసలాత్మజుని నాపుడె వైచెదు దుఃఖవార్ధిలోఁ
ద్రొక్కఁదలంచు సాహసివి తోయజమిత్రకులీన లీల్చియు
న్నెక్కడి దప్పఁద్రొక్కు రవనీశ్వర నీవొకరుండ దక్క నీ
వెక్కడ సత్యవాక్య మది యెక్కడ శాంతి మానినీప్రియా. 36

క. అగ్రసుతు రాము విభవసమగ్రుని గావించి బ్రదుక మన పమ్మెయ్య నట
నుగ్రశిలోగ్రమహాత్మ్య ద్యగ్రంథివి నీకు నిక్క మరి యింపగునే. 37

క. అని తనుదూలెడుఁ బలుకులు, తనుఁ బైఁ గూలుటయు వినుచుయుండం బగునిష్ఠు
ల్నినిచినఁ జేడ్పడుగతి నస్మ త్కుజనిభుఁడు భూ... లుడిగి మ్రాన్పడియుండెన్. 38

వ. అంత నక్కడ రామచంద్రుఁ గనుంగొని వసిష్ఠుండు పట్టాభిషేకసమయం బాస
న్నం బయ్యె దశరథుం డేలతడసె నీవరిగి యతని దోడ్కొనిరమ్మనుటయు నతండు.

ఉ. గారవ మొప్పఁ దండ్రి కేఁగఁ దనమున్ బరిగ్రహింపఁ శృం
గారరసంబు దేహమునఁ గాఁ విచిత్రిలసన్నోహా
గారముఁ జేరి యంగొనరఁగా రతనంబులు గూర్చియున్న బం
గారపు ద్దైవెఁ దనువు గాఁచిముచెట్టుగ నందు భూపతిన్. 40

క. కనుఁగొని నుతి కైకం గనుఁ,గొని జనయిత్రి యి దేమి ఘోరపుశోకం
బున భూపతి మునిఁగినవాఁ, డని యడిగినఁ గైక నిర్దయామతి యగుచున్. 41

క. మనమున నించుక రోయనియును, ననుమానము మాని పలికె నవికారుఁడవై
విను తనయా వినుతనయా, వినిచెద నేతద్విధము సవిస్తరఫణితిన్. 42

ఆ. నాఁడు దొల్లి మీ జనకుఁ డిచ్చిన వి రెండు వరములందు భూమిభరము భరతుఁ
బూన్చు టొకటి నీవు పూని చతుర్దశాబ్దంబు లడవిఁ దిరిగివచ్చు టొకటి. 43

క. సమయం బగుడు వరద్వితయము వేఁడిన నితఁడు నృపతి యై యీక్రియ వచ
నముఁ బూనియున్న వాఁ డని, చమత్కృతి యొసంగఁ జెప్పె చయ్యన మఱియున్. 44

క. శ్రీదొరఁగి యొకట వనముల, లోఁ దిరుగుట నీకుఁ దొలఁగలుగుట స్నానము లు
త్త్రాత్రి దివిజులు వొగడఁగఁ బి, తాత్రిదేశము సేయువలయు నవికారుఁడ వై. 45

చ. అనవుడుఁ గైకఁ జూచి పరమాదరణంబున రామచంద్రుఁ డి
ట్లను జననయిత్రి నాకు జనకాజ్ఞ యొనర్చుట మేలు నామతి
మ్మున వసుధాభరంబునకు ముఖ్యునిఁ జేయుట యంతకంటె మే
లనయముఁ గాననాంతరవిహారము మూఁడవమేలు చూడఁగన్. 46

వ. అని జనకుదెసం గనుంగొని. 47

ఉ. ఇతఁడు ప్రతిజ్ఞ దప్పిన మహీశులమెల్ల వశంకదే సరి
త్పతి జల మింకదే గతవిభాస్థితిఁ బ్రొద్దిరాఁ బ్రొద్దు గ్రుంకదే
మతి ననుమాన మించుకయు మాని చతుర్దశవర్షము లవ్వన
క్షితి విహరించి మించి కృతకృత్యుఁడ నయ్యెదఁ బోయివచ్చెదన్. 48

వ. అని యంత నిలువక. 49

ఉ. జనకునిసత్యవాక్యము ప్రసన్నత నయ్యెడ నంచు రత్నభూ
షణవసనస్రగాదికవిసర్జితుఁ డై యజినోత్తరీయము
ల్బనుపడఁ జేసి యంగమున భస్మముఁ బూసి జటావిభాసి యై
ఘనవనవాసివేషము వికారము లేనిమానసంబుతోన్. 50

ఆ. తాల్చి కైకఁ బిల్చి తల్లి యే బ్రహ్మచర్యవ్రతంబు మెయి నరణ్యభూమి
సమయసమము లోపుఁ జరియించి వచ్చెద, ననుచుఁ బలికి వెసఁ దదాజ్ఞ వడసి. 51

క. అంతికమున నంత స్వాంతశ్శాంతికరణుఁ డగు జనకునంతికమునకు
న్నంతసమునఁ జని యమ్మహి, కాంతుని వీడుకొని మ్రొక్కి కదలెను వెడలన్. 52

క. రామునిమునివేషముఁ గని, సౌమిత్రి విశేషరుట్కషాయితముఖుఁ డై
భూమీశుదెసకు నడర, న్రాముఁడు వారించి యనుజునకు నిట్లనియెన్. 53

చ. ఎటు తెగితయ్య లక్ష్మణ యహీనుఁడ వయ్యు విషోక్తు లాడఁగా
నిటుఁ దగునే కదా యనుచు నెంతయు శాంతునిఁ జేసి తమ్ముఁ డా
యిటువిఁ బిత్రాపదిష్టసమయార్థములం ద్రుటికాలమట్లు నె
క్కటి విహరించవచ్చెద నకంపిత నావుడుఁ గంపితాత్ముఁ డై. 54

క. అన్నా నాయనుగమనం,బు న్నీవొందఁబడక,రాకు పొమ్మన్న విషం
బున్నమలి విడుతుఁ బ్రాణము, లన్న నతఁడు హృదయమాదరార్ద్రం బగుడున్. 55
గీ. రామచంద్రుండు సౌమిత్రిరాక కట్టు,కేల కొందఁబడి యాతనికేలు గేలఁ
గీలుకొల్పి భయంబు నీకేల నిశ్చ,బాసి చరియింపనేర్తు నే భరితవినయ. 56
వ. అని యాయిద్దఱు బలికిన నతంకు సంతసిల్లె నయ్యవసరంబునఁ దద్వృత్తాంతం బంతయు
వినుటంజేసి. 57

చ. నడుమసియాడ వేఁలి ఘనంబయి వీపునఁ దూలియాడ మో
ముదుపతి మేలమాడ నధరోష్ఠము బింబముఁ బంతమాడ మె
చ్చెడుగతిఁ గన్గొనారుచివిశేషము చెక్కులఁ గెంపులాడఁ జే
రడకువ వచ్చెఁ జిత్రమురియాడఁగనీక మహీజ చెచ్చెరన్. 58
వ. ఇట్లు వచ్చిన ప్రేయసిం గటాక్షించి. 59
క. పితృశాసన మెల్లింపఁగ, నతివా విను పతియానాల్గబ్దంబులు స
మ్మతి వనవాసముఁ దగ సల్పి తిరిగి యేతెంచెద విలపింపకు మబలా. 60
చ. అనుటయు సీత నీకుఁ బితృశాసనసేతయు నాకు భర్తృసే
వదలినసేవయుం బరమధర్మము లిట్లనరాదు నీవు నా
యనుగమనం బొడంబడని యప్పుడ మృత్యువు నొందినదైన నీ
యనుగమనంబుఁ దప్ప విశ్వలాదిక భూతగణంబు సాక్షిగన్. 61
క. నాయనుగతి కొడఁబడుము వి,ధేయను గోపంబుఁ దక్కు తెలియుము తను
చ్ఛాయను బోలిన జాయను, బాయను ధర్మంబె నీకుఁ బరమవివేకా. 62
క. అని వెచ్చనూర్చి మంచుకఁడిన నెంతయుఁ దేజమేది డిందుపడినప
ద్మనిభం బగుమోమును వాడిన,మోవియుఁ గన్గొ తల్లడించుచు నుండెన్. 63
క. మగనికడ మెలఁగుమగువకు, నగపడ విల నెంతలేసియాపద లైనన్.
మగనిం బాసినమగువకుఁ, దగుసౌఖ్యము లెన్నియును వృథాగతి నుండున్. 64
వ. ఇవ్విధంబున. 65

ఉ. కన్నుల శోకవేగమునఁ గాలువగట్టెడుబాష్పధారలం
జన్నులకుంకుమం దడపుజానకిఁ గన్గొని మానవేంద్రుఁ డో
యన్నులమిన్న నిన్ను విడనాడఁగనాడుట కాదు కాన నా
పన్నత నొందఁజాల వనిపల్కుల నింతులు వంత కోర్తురే. 66
క. అని కలికి సీతరాకకు, ననుకూలత దోఁపఁ బలికె యరిగి సుమిత్రా
తనయజనకతనయాయుతుఁ, డనఘుఁడు శ్రీరాఘవుఁడు నిజాంబవలనికిన్. 67

ఉ. క్షత్రియమిత్రగోత్రుఁడు ప్రశస్తచరిత్రుఁడు రామమూర్తి సౌ
మిత్రియు ధాత్రిపుత్త్రియును మేకొని రాఁ జని కాంచె నత్యుర
స్సూత్రకఁ బ్రాణవాయుకృతశుద్ధయశోమగధావనీశస
త్పుత్త్రికఁ జేతనాత్తమణిపుత్త్రికఁ గోసలరాజపుత్త్రికన్. 68

వ. కనుంగొని నమస్కరించి. 69

చ. కరములు మోడ్చి తల్లి విను కైకయిఁ దొల్లి కరంబు నెయ్యుఁడై
వరములు రెం డొసంగె జనవల్లభుఁ డాయమ యిప్డు వేఁడె రా
జ్యరమ దొరంగి యే నడవిచక్కటి వర్తిల భూతధాత్రికిన్
దొర యనఁగాఁ బ్రభూతభరతుం భరతు న్నియమించునట్లుగన్. 70

క. వేఁడిన నమ్మాటలు చెవి, చూఁడినయ ట్లయిన నృపుఁడు సుడివడియెడు నా
తేఁ డాడినమాటకు నీ, రేడేఁడులు వనిఁ దిరిగి తిరిగి యే తెంతున్. 71

క. అమ్మా నెమ్మది నించుక, యుమ్మలికము మాని ధైర్య మూఁదు మనుఁడు వా
లమ్ము లగుమ నవ్వాడ్కిం చ, యమ్ములు నాటుటయు వివశ యై యిట్లనియెన్. 72

ఉ. యోగ్యము గాఁగ నీవు మహిమోజ్జ్వలలీలఁ గృతాభిషేకసౌ
భాగ్యము నొందఁగాంచుటకు భాగ్యము గల్గెనటంచు నున్నచో
యోగ్యనుకూలవర్తనకు నోర్చి విశేషసుఖంబు లెల్ల వై
రాగ్యము పెర్మి వీడి నగరం బిటు వెల్వడఁ జూడఁ గల్గెనే. 73

క. సమ్మతిఁ బాప మ్మడిపి క్రమ్ముల లాలించి సత్సరణి మెలఁగిన దో
షమ్మెలుఁగఁ దనుచు నెమ్మది, నమ్మంగారాదు రాజనామమువారిన్. 74

వ. అని పలికి కరంబులు విదుర్చుచు నట్టూర్పు నిగిడించి కైక నుద్దేశించి. 75

కమలవిలసితవృత్తము.

అధిపతి తనవశుఁ డని తగునే ని, న్నధికభయద మగునడవికి నంపం
బ్రథితయశముఁ జెఱుపఁ దలఁచెనే దు,ర్వ్యధివిలసిత మెటు వృథ యగుఁ బుత్త్రీ. 76

సీ. ధర్మనాశముఁ గూర్చిరకర్మం బటంచుఁ గొంకక నెట్లు వరములు గైకొ వేఁడె
నాలిమాటలకు లోనై నీవు కానకుఁ, బోనంగ నెట్లోర్చె భూవిభుండు
అడవికి నిను బంపు టన్యాయ మనియొత్తి, చెప్పంగ లేఁడ వసిష్ఠమౌని
సకలసౌఖ్యముల కాస్పద మైనలక్ష్మి విసర్జింప నీకేల సాహసంబు

గీ. అనుచు వెచ్చనూర్పు హా యని పలవించు, దైవమా యటంచుఁ దల్లడించుఁ
గరముఁ గోపగించుఁ గౌసల్య పుత్త్రవి,యోగశోకమునకు నోర్వలేక. 77

వ. మఱియుం బ్రేమాతిరేకంబునం గుమారుం గనుంగొని. 78

క. రమ్యాత్మ చేరం బోఁడఁగ, నిమ్మౌ నెమ్మోము కైక కిదిద్రోసమగుఁజో
సామ్యా నమ్మఁగ నయ్యెడఁ, బొమ్మనియెనె నిన్ను భూవిభుండు కుమారా. 79

ఉ. హారము లాత్రి కందు భవదంగము లిప్పుడు నిద్ర లేక నా
హారము మాని కాననవిహార మొనర్చిన నెట్టులోర్చు నా
హా రమణీమణీగణమహారమణీయవిలాస కైర్యసం
హారముఁ గోరి పోయెద వహర్పతితేజుఁడ వేమిసేయుదున్. 80

వ. అని ప్రలాపించుచు. 81

క. మ్రొక్కిన లక్ష్మణుఁ గనుఁగొని, యక్కునఁ గదియించి తమ్ముఁ డాయదవులయం
దొక్కరుఁడు మెలఁగలేఁ డని, నిక్కము మాయన్నతోఁడ నీవు నరిగెదే. 82

క. లక్ష్మివంతుఁడు రాముఁడు, లక్ష్మిం బెడఁబాసి కానలకు నేగడువో
సూక్ష్మమతి నీవు నేగుట, లక్ష్మణ యిది భ్రాతృవత్సలత్వము గాదే. 83

చ. అనునెడ సీత మ్రొక్కి వినయంబు నయంబు భయంబు మీఱ నే
నును బతితోడ నేగెద ననుజ్ఞ యొసంగు మటంచు వేఁడ నీ
జనకుఁడు గూఁతు రామునకు సమ్మతిఁ బెండిలిఁ జేసినాఁడ నే
నని ముదమందు మీరు మునుపై యిటుఁబోవు టెఱుంగఁజేకదా. 84

ఉ. వహ్నిశిఖాసదృక్ప్రథుగభస్తిచయాన్వితుఁడై నిదాఘమ
ధ్యాహ్నములం బ్రతాపము సహార్పతి చూపఁగఁ జక్రవర్తినీ
చిహ్నము లింత లేక దృఢఁ జేడ్పడి కంటకచక్రవర్తినీ
చిహ్నిత మైనమేనుఁ గృశించెదె నీపతి నిన్నుఁ జూడఁగన్. 85

వ. అని మఱియు ననేకవిధంబులం దల్లడించుకౌసల్యం గనుంగొని యుచితవచనంబుల మనస్తాపోపశమనంబు గావించి. 86

క. తల్లడ మేల విధికృతికిఁ, దల్లిలలిఁ జిత్రములు ముదంబులు ననుచుం
దల్లి నిటు వీడుకొని పిన్నతల్లిం గులకామినీమతల్లిం గనియెన్. 87

వ. ఇవ్విధంబునం బ్రియానుజప్రియాసహితుఁడై చని కాంచి నమస్కరించి రాజాజ్ఞ యొడంగించి కరకమలంబులు ముకుళించి వెండియు. 88

ఉ. మ్రొక్కినరామచంద్రుఁ గని మోదము దక్కి సుమిత్రపుత్రి నీ
విక్కడఁ బాసి కారడవి కేగిన మాఁగినమూర్ఛఁ దల్లి నీ
దిక్కున నైనశోకమునఁ దీనత నొంది కృశింపకున్నె యే
దిక్కును లేక దానపరదిగ్విదితేందుసమంచితాననా. 89

వ. అని మఱియును. 90

సీ. కువలయంబున శాత్రిఁ గూర్చుచు నిను విరోధునిఁగ భావింప రాజునకుఁ దగునె
యాడుమాటలఁ గంప మందె మహీభృద్వర్యుఁ డిలఁ గడుచుల్కఁదనము దగునె
ప్రజలలో నగ్రసంభవు ముఖ్యునిఁగ నెఱుంగకయున్న దాతకుఁ గలదె కీర్తి
దానవారుల మించు దానకళాత్మకత్వము వహించుట సార్వభౌమునకును
గీ. దగునె యీదుర్విచారంబుఁ దలఁగఁ జేని, యీసుమంత్రు సుమంత్రుఁ డనఁగఁ దగునె
యీవు గుణరహితునియట్లు నీసుమాలి, యీకరణి నిల్లువెడలుట నీకుఁ దగునె. 91
వ. అనిపలికి యనంతరంబున లక్ష్మణుం గనుంగొని గాఢాలింగనపూర్వకంబుగా నాశీర్వదించుచు. 92

క. జనకసుత న్ననుఁగా మీ, జనకునిగా రామభద్రు సాకేతముగా
వనమునుఁ దలంపు మేగుము, మనమున నొకసంశయంబు మానుము పుత్రా! 93
శా. క్షుద్రాభీలమృగారవాన్వితము రక్షోభీకృతం బాకుభు
క్షుద్రాకీర్ణముఁ జీర్ణపర్ణబలిభుక్పూర్ణం బరణ్యంబున
న్నిద్రాహారవిసర్జితుండ వగుచు న్నీ వెల్లపొద్దు న్మహో
న్నిద్రారాభవతత్పరుండ వగుమీ నీయన్న హర్షింపఁగన్. 94
వ అని బోధించి కోడలిం గుసుమకోమలిం గనుంగొని. 95
క. దానవసంకులములు గజ, దానవమధుపంకిలములు దద్దహనము లం
ద్యానవనంబుల నులికెదు, దాన వెటుల సంచరించుదానవు సాధ్వీ. 96
క. విను మొకితతి వసుహీనతఁ, గనఁబడినను గువలయంబుఁ గారించువిక
ర్తనుఁడై తాపము నొందించినదైవము గాఁగ నిను భజింపఁగవలయున్. 97
వ. అని యుపదేశించి కాననగమనోచ్చణు లగుసీతారామలక్ష్మణులం గనుంగొని. 98
క. ఇం పగు రాజ్యసుఖంబులు, సంపదలును విడిచి యడవిఁ జని యం దిపుడు
ద్దుంపలుఁ గాయలు నాకులుఁ, దెంపితినుం డనుచు నొసఁగిరి న్నెల వకటా. 99
వ. ఇట్లు సెలవొసంగి తెచ్చనూర్చుజనయిత్రి సుమిత్రపీడ్కొని చిత్రచరిత్ర యగుధాత్రీ
పుత్రియుం సౌమిత్రియుం దోడగా నమిత్రగోత్రలతాలవిత్రుండును, మిత్రగోత్రపవి
త్రుండును, గోత్రామరసుత్రామాద్యమరసంస్తోత్రపాత్రుండును నగు దశరథు నగ్ర
పుత్రుండు సుమంత్రసారథికం బగురథం బధిష్ఠించి పత్రాసంబుగ నరణ్యయాత్ర
గావింప నుద్యోగించు నవసరమ్మున నుపమ్మునఁ గల సమస్తజనమ్ములు గొట్టన
నొక్కవెట్ట నతనిం జుట్టుముట్టి పెట్టినసొమ్ములుం గట్టినపుట్టమ్ములు నెఱుంగక
బిట్టుమూర్ఛిల్లుచు, హాహా యింతవుట్టునే యనువారును, దైవ రట్టడి కట్టాడిఁ గట్టునే
యనువారును, రాజున కించుకయేని నక్కటికంబు వలదే యనువారును, నింతవింత

గలదే యనువారును, రాముం డింతసాహసుం డగునే యనువారును, వారింపక గురుం డుపేక్షింపఁ దగునే యనువారును, మోమోడకువాఁడు గాఁడు లక్ష్మణుఁ డిట్లు పోవచ్చునే యనువారును, భరతుం డెఱుంగఁ డెఱింగిన నింత రానిచ్చునే యనువారును, దైవంబుగూడి తెర వెఱుంగని యడవుల నిడుమలంబడుట యెంతయు మోసం బనువారును, మహానుభావుం డితనికి వనవాసం బనాయాసం బనువారును, జానకీసాధుచరితం బింతయొప్పునే యనువారును, దైవకృతంబు దప్పునే యనువారును, వీరలం గనుంగొన్నం బగవారికైన వగలు మిగులదున్నే యనువారును, సుమంత్రుం డీమర్మంత్రంబు వారింపమి చన్నే యనువారును, దెలియ దీతనియభిప్రాయం బనువారును, యశంబు శాశ్వతంబు ప్రాణంబు తృణప్రాయం బనువారును, ధరణిం బడి పొరలువారును, ధరణీశ్వరుం గెరలువారును నై యేము నీతోడివార మిదె నిన్నుంగూడ నేతెంతుము గా కిప్పురంబున నుండ నేర్తుమే యని యందఱు నేక నిశ్చయంబున దాశరథి వెంబడించి రయ్యవసరంబున. 100

చ. దశదిశలన్ యశంబు విశదం బయి పర్వ వనంబునం జతు
ర్దశసమముల్ వసింపఁ బ్రియదారసహోదరసంయుతుండు గా
దశరథసూనుఁ డెంతయు ముదంబు ఘటిల్లఁగఁ బోయె నెల్ల దు
ర్దశదురటిల్ల నిట్లు పురరాజము ఖిన్న నిర్గమించుచున్. 101

వ. దశరథుం డధర్మనిర్భీకం బైకం గనుంగొని. 102

ఉ. పాపము గట్టికొంటివి నృపాలశిఖామణి రాము నిక్కడం
బాపఁగ నావచేసితివి భాగ్యవి మృగ్యవు నీవు నాకు నీ
పాపఁడు గాఁడె యాశుఁడు కృపాపరతంత్రుఁడు భక్తియుక్తుఁడుం
బాపవిదూరుఁ డింక నగపాటు శరంబు భరంబు మానినీ. 103

క. సమచిరపుత్రుల్యు రాము వ్యసనమునకు నిచ్చితివి యాడినము మొదలుఁగ మో
సముఁ జేసిన నీదునివాసము చెంతకు రాను నే ననముచిరచరితా. 104

మ. అని శిగ్గేనాము సగ్గిలగ్న మగుగేహంబు న్విసర్జించుభీ
రునిచందంబునఁ బాసి హా సుత మహాక్రోశంబునం జేసి శా
వనివాసంబుగఁ జేసి నష్టధికచింతాసాగరాంతర్నిమ
గ్నునిఁ గాఁ జేసితె నీసిరేద్ధశోకముం గుప్పించితే దిక్కులన్. 105

వ. అని మఱియు ననేకంబు లగువిధంబులం బలవించు. 106

ఉ. దశరథుఁ డప్డు రాముని రథస్థునిఁ గన్గొని పుత్ర కామినీ
శశుఁ డితఁ డెంచు నన్న నలువఁదగునైనను ప్రాణధారణా

వశలఁ గృశించుతండ్రిఁ బితృరత్నల కానఁగ రాఁగదయ్యె యా
ర్యా శమదమాదిసద్గుణగరిష్ఠత నీసరిగారు మానులున్. 107

కం. భీకర మమితవినష్టప్రాకటము గరీంద్రహస్తశీకర మురుద
ర్వీకరము గానవము ప్రాత్రికరము మృగాకరము భరము చరియింపన్. 108

వ. మఱియును. 109

లయగ్రాహి.

ఘూకము సముచ్ఛ్రితమధూకము భయాకరశమీకము మహాద్రుమదనేకము జలన్ని
ర్మోకము సమావృతవనాకము ప్రభూతరుతకాకము ద్విపివ్రజసమీకము గరీంద్రో
ద్రేకము మహాద్విపదనీకము భుజంగయుతలోకముఁ ప్రచంక్రమణకోకము విరక్త్యా
లోకము రుకాననము నోకముగఁ జేసి యిటు శోకముల ముంచి జనలోకము గృశింపన్.

సీ. కటకటా కంటకోత్కటకుటోత్కరములు, పాదలు మవ్వంపుఁబూఁబోదలె నీకు
నుష్ణకరోష్ణకరోచ్ఛాదితాశ్మము, లబ్జమైన పలుపులే పట్టె నీకు
ననవొంద మంగళహారతు లొసఁగెడు, గోతులే కోఁతులు గుత్తె నీకు
దుష్టచేష్టప్రతిక్రియాశరుల కోడిఁగములు నిద్దపుటానిగములె నీకుఁ

గీ. బాయుఁడు తోలంగుఁ డని బగాబయలు సేయు, బంట్లై కసుదుండగ పుట్టెల్లుబంట్లు నీకు
దంబుమీఱిన మణిఖచితంబు లైన, గృహములే నిఁడితపుగొండగుహలు నీకు. 111

కం. వినుతగుణ నీకుఁ దశవే, శ్మనివాసముఁ గూర్చెఁ గడు ననాథ్యము గలతే
వినుశర్కర మెసఁగిననోటను చేదు భుజింపఁజేయు టక్కట! విధికిన్. 112

సీ. ఘనశివాలాపము ల్విని సంతసిలు నీవు, ఘనశివాలాపము ల్వినియె దింక
మావుల నెక్కి క్రుమ్మరు నీవు పండ్లకై, మావుల నెక్కి క్రుమ్మరెదు వింక
గోపురంబులనీడఁ గూడియుండెడి నీవు, గోపురంబులనీడఁ గూడె దింక
స్వర్ణోటజంబులఁ జరియింపఁదగు నీవు, పర్ణోటజముల పాల్పడియె దింక

గీ. నాకుల మొకించుకయు లేక నాకుమారు, కలిమి సేవింపఁ బెంపు వహించు నీవు
నాకు లొగిరాల భరదప్ప నాకువార, మలమికొనఁ గంపము వహింతు వనఘ యింక

ఉ. నీముఖచంద్రమండలవినిర్గతసుస్మితకాముదీ వి
స్తోమము నీవృధాక్షిపరిశుద్ధతయున్ భవదంగకస్ఫుర
చ్ఛామలరుం ద్వదీయజలజాతవిలోచనసౌష్ఠవంబు శ్రీ
రామ గుణంబు గొన్న మునిరాజియు మోహము నొందకుండునే. 114

కం. వాత్సల్యమహిత నిను సాంవత్సరికులు దొల్లి చక్రవర్తి వగుదువటం
చత్సమునివై చతుర్దశవత్సరములు నడవిఁ దిరుగవలసెను నీకున్. 115

క. అన్న సుమిత్రాసుత మా,యన్న ధరిత్రీసుతాసహాయత వనమం
దున్నయపు డేమఱక కొలు,వన్నీ కరిగెదవు ధైర్యవంతుఁడ వగుటన్. 116

వ. అనపలికి కౌఁగిలిం జేర్కొని. 117

క. రాలచ్చి విడచి యేడుకు,తాలవశీయుండు గ్రాల తాలమునిప్పు
డ్రాలను విహరింపను జవ,రాలా నీ వేమి పేదగాలవె చెప్పుమా. 118

వ. అని మఱియుం బరిభ్రమితాంతరంగుం డగుచమ్మహీకాంతుండు. 119

ఉ. వేగము గాఁగ నేగురఘువీరుని రే రగపాటు లేమిఁ జిం
తాగితాంతరంగుఁడై దశరథ కేతనవీథిఁ గాంచుఁ ద
ద్రచ్చి గనరాని చేవను జెంది తదుద్ధతధూళిఁ గన్గొను
ద్రాగముమీఁదఁ దద్రథపరాగము గానక వంతఁ జెద్పడున్. 120

గీ. మఱియుఁ జెక్కుగుగరుల నమ్మనుజనాథుఁ, డగ్రభార్యావరసతీసహాయుఁ డగుచుఁ
జిత్తమున నుత్తలము గదుఁ గ్రొత్తసేయ, నుల్ల ముడుకఁ బ్రలాపించుచుండునంత.

మ. ఈమకుం జేత్రికిఁ జాయలార వనవాసోద్యోగమంచుం గడు
స్సాదువ వాక్యక వైఁబడింపఁగ సుమంత్రుం డెంతయు న్వంతఁ జెం
పడరం జయ్యనఁ దేర డోల రఘువంశ్యస్వామి శ్రీరాముఁ డ
ప్పు డరణ్యంబున కేగ సానుజుఁడు భూపుత్రీసమేతంబుగన్. 122

చ. చనచనఁ జోగభంబు వెదచల్లఁగఁ జల్లనిగాలి తెమ్మెరల్
రొక్కఁ గొనలేనివాగ్నమునకు న్నిలయం బగుదాని మీనహా
కనిబిడపుండరీకజలకాకబలాకసమీకచంచరీ
కనినదకోకకోకనదకమ్రతరంగం బగుదాని నెంతయున్. 123

ఉ. పావనచారుజీవనశుభం బగుదాని సమస్తజంతుసం
జీవన మైనదాని మునిసేవిత మైనతటంబుదాని రా
జీవనటన్మధువ్రతవిశేషరుతాకలితోల్లసద్ద్రుమీ
ఠీవృత మైనదాని సురసీమణి నత్తమసాతరంగిణిన్. 124

వ. కనుంగొని తత్తీరలతాకుంజపుంజంబు లరసి జనకుం జూపుచు రాముండు వెండియు.

సీ. అవలోకనము సేయు కువలయానందంబు, లీవనతమసానదీవనములు
చూడు ప్రవాళసంశోభితంబులు దగు, నీవనతమసానదీవనములు
గనుఁగొను మెంతయుఁ గమలావనోక్షము, లీవనతమసానదీవనములు
నుదతి వీక్షింపుము సుస్వాదుఫలదంబు, లీవనతమసానదీవనములు

గీ. కుసుమమృదుగాత్రి విపులసారసహితములు, తెలియ మీవనతమసానదీవనమ్ము
లనుచుఁ గాంతకుఁ దెల్పుచు నచట విశ్రమించెఁ బౌరసుమంత్రసౌమిత్రు లలర.

వ. అంత.

ఆ. కాంతతోడ భయదకాంతారమున నిశా,న్వయుఁడు తిరుగఁ జూడ వచ్చునెట్టు
లని యక్కృత్యుఁ డయ్యె నవఁ గ్రుంకెఁ బద్మినీ,కాంతుఁ డంశుమాలి కాంతిమాలి.

క. అట్టియెడఁ దమమనంబుల, ముట్టినశోకాంధకారమునకు మెఱుంగు
ల్వెట్టి రవ మడఁగఁ జీఁకటి,చెట్టులక్రియఁ దోఁచెఁ దరువిశేషములెల్లన్. 129

వ. ఇట్లు నిశాసమయం బగుటయుం గృత్యంబులు దీర్చి తత్తరంగిణీపయఃపానంబునం బరమానందంబు నొందుచు లక్ష్మణసంకల్పితం బగుపర్ణపర్యంకంబున రాముండు ప్రియాసహితుండై సుఖనిద్రితుం డయ్యె సుమంత్రుండును దక్కిన పౌరలోకంబును దృణపాషాణపర్ణనిజబాహుదండంబులు శయనోపధానంబులుగా శయనించియున్నంత నంతరాత్రంబున నరేంద్రుండు మేల్కని సీతాలక్ష్మణసుమంత్రులం బ్రబోధించి వారలతో రహస్యవచనంబుల నిట్లనియె. 130

చ. మనము సమస్తపౌరజనమాన్యుల మై యడవి న్వసించిన
న్మనమున నొందు గాఁగ ననుమానము నొందెదుఁ దైక గాన ని
వ్వనమున వీరి డించి వెనువంచన నేఁగుద మొండుచోటు కీ
జనులు నయోధ్య కేఁగుదురు సత్వరులై మనచొప్పెఱుంగమిన్. 131

వ. అని తనమనోనిశ్చయంబు వారల కెఱింగించి యప్పుడు. 132

క. రథ్యాదూరులు పౌరులు, గాఢతరసుషుప్తి నున్నకాలమున రథా
రూఢుం డయి రాఘవుండు ని,గూఢస్థితి నేఁగ నంతఁ గొంతత్రిలోకన్. 133

చ. తొగరగుతేఁడు దమ్ములకుఁ దోడు నివంబులఁ దోలువాఁడుఁ గెం
దొగలకు సూడు చక్కవలదోయికి సెంతయయింతసెయ్యపుం
బగ లొనరించువాఁడు గడుఁ బచ్చనితేజులవాఁడు వేడుకం
బగ లొనరించువాఁడుఁ గనుపట్టెను తూరుపుమెట్టపట్టునన్. 134

చ. పురజను లంత మేలుకని భూతనయాపతి లక్ష్మణాగ్రజుం
డరిదములో సుమంత్రయుతుఁడై తము వంచనఁ బాసిపోవుటం
బురపురఁ బొక్కి పంక్తిరథపుత్రుఁ డయోధ్యకుఁ బోయెనంచు వేఁ
బురమున కేఁగుదెంచిరి ప్రభూతఘనార్తరవంబు లిచ్చుచున్. 135

క. విపరీతస్థితి మెలఁగక, నపగతరోషుఁ డయి ప్రజల నందఱఁ బ్రజలం
గృపఁ బ్రోచినక్రియఁ గాచిన,నృపతిం బాయంగనేర్తు రెట్లు జనంబుల్. 136

ఆ. ఇట్లు వచ్చి మిహిరహీనాంబరమువోలె, రామరహిత మగుపురంబు సొచ్చి
యేమిసేయువా రింక నెవ్వరు మనకని, క్రాలుచు వగచుచుండి రంత నచట. 137

మ. నిజమాయాపిహితాంతరంగు లగుచు న్నిద్రాసమాసక్తిఁ బౌ
రజనంబు ల్శయనించియున్న తఱి శ్రీరాముండు గోత్రాసుతా
నుజసంయుక్తముగా రథస్థుఁ డయి మాన్యుం డాసుమంత్రుండు వా
యుజవస్ఫూర్తి హయంబులం దఱుమ నయ్యుగ్రాటవిం బోవుచున్ 138

ఉ. అంతట నంశుమంతుఁ డుదయంబున సంతమసం బదృశ్యమై
సంతస మావహింప నృపచంద్రుఁడు రాముఁడు చారుసౌరభా
త్యంతలతాంతకాంతగహనాంతరఝంకరితాళిపాళికా
క్రాంతసరస్సరోజనికరంబులు చూచుచు నేగి ముందటన్. 139

మ. అవలోకంబులకుం బ్రియం బెసఁగు గోష్ఠాభీరపల్లీస్ఫుర
స్సదవల్లీగిరిపక్కణంబులు నరణ్యంబు ల్గనుంగొంచు సీ
త విలోకింపుము నీవటంచు విలసత్కుంజాతసంజాతమో
దవతి న్వేదవతిం గనుంగొనియె నుత్కంఠం బఱంతంబుగన్. 140

క. కని తత్సరిత్తటి సత్తీరనిరూఢలతాలతాంతరమణీయతను
న్మనమునఁ బొంగుచు నటఁ గడచని సరయూవు దాఁటి రామచంద్రుం డవలన్.

వ. అభంగరంగత్తరంగాధారం బగుగంగాతీరంబున విఖండితమృష్టమృగాస్పృక్కణం
బగు నొక్కపక్కణంబు గనుంగొని తత్సమీపంబునకుం జని. 142

క. బహునియమాయాసవహు, న్మృదుహృద్గతముదశ్రుముక్తానివహుం
గుహుఁ గని రచ్చోచ్చక్రమ,గుహు సద్గుణగణగుహు రఘుప్రవరు లాగిన్. 143

వ. ఇట్లు కనుంగొని యయ్యవసరంబున. 144

చ. రభసముతో నిషాదపతి రాము నెదుర్కొని సద్వినీతిభ
క్తిభరితమానసుం డగుచు దివ్యనిమాటల నాదరించి త్వ
చ్ఛుభతరదర్శనంబున విశుద్ధమనస్కుఁడ నైతి నంచు నీ
తభయుఁడు డెసంగ నర్ఘ్యసహితం బగుపాద్య మొసంగి వేడుకన్. 145

క. నీపదశౌచజలమునను, నాపదలం బాపుహరజటాంతరపదసం
దీపితవరసరి యైనను,రాపగకును వేఱు గలదె యని లజ్జలమున్. 146

వ. తీరంబునం జల్లికొని వెండియు. 147

చ. గుహుఁడు నమస్కరించి నృపకుంజర కుంజరకుంజరవ్య మీ
గహనమునం బ్రియానుజులఁ గైకొని యిట్లు చరింపఁగా మహా

మహాత్ముఁడవు నీకుఁ జన్నె గుణమంతయు నాపుకు వానికి బ్రహ్మా
ద్యుహుఁడు నిజప్రవృత్తి విదితంబుగఁ దెల్పి సంతసించె ముదమున్. 148

తే. రామచంద్రుని కాఁడా రాత్రి మధుర, వివిధ ఫలమూలఫలముల విందొనర్చి
భరతమూర్ధరుఁ డగుమ సోదరుఁడు గొలువ, నధికకృప సీతతో నట నధివసించి 149

క. గుహుఁడును సుమంత్రుఁడును దను, బహువిధములఁ గొలువఁ బర్ణపర్యంకమున
బ్రహ్మి నిదుర జెందె రాముఁడు, మిహిరోదయమున నున్న మేల్కాని సరగన్. 150

వ. సముచితసమయవిహితకృత్యంబులు నిర్వర్తించి నిజసేవాపరతంత్రుఁ సుమంత్రుం గనుంగొని.

క. సముచితము గాదు రథయానము మాకిటమీఁదఁ గావున సకల సాకే
తమునకుఁ గొని చనుమీ యరదము నీ తడవు యేల నతండు ద ప్తహృదయుఁడై.

చ. అటువిని మిన్నుముట్టి ఘరి కారడి సూర్యరథంబుతోడ నే
నెటువలెఁ బోవువాఁడ సుతు తే కని పత్త్రిరథుండు సాకరో
త్కటహృదయంబుతో నడుగఁగ దల్పతి కేమని తెల్పువాఁడ నీ
కిటుగలెనాడె ధర్మమగునే విడనాడకు మింద యూండెదన్. 153

చ. అనపుడు రాఘవుండు భరతాగ్రజుకుండు సతీసహోదరు
లైనఁ గొలువంగ నెంతయు ముదంబున నిప్పుడు బోలెఁ గానసం
బున నొకయింతవింత యును బొందని డెందముతోడ నున్న వాఁ
డని వినిపించి మజ్జనకునార్తి హరింపఁగ నీవు పోవవా. 154

గీ. అనిన నేమియు ననుటకు నగపడేమి, నామనుమంత్రుఁడు శ్రీరాము నపుడు వీడు
కొని యయోధ్యకు నేగ నెన్నేనిచింత, రథములోడ విపలమనోరథములోడ.

వ. తదనంతరంబున. 156

మ. విలసద్వేషులు వీతదోషులు జగద్విద్వేషవిద్వేషు ల
జ్వలసంతోషవిశేషభూషితమనీషాశ్లేషు లానందభా
షులు నిర్దోషులు ముఖ్యసత్త్వగుణమంజూషు ల్జిగీషు ల్విహా
షులు సత్పోషులు రామలక్ష్మణులు సంస్తుత్యాభిలాషు ల్గదన్. 157

వ. చని చని 158

మ. ఘనసౌగంధికగంధవాహచలితక్ష్మాభృల్లతావాలము
న్వనితాభంగతరంగశీకరసమావిర్భూతశైత్యోల్లస
న్మునిసంకల్పితపర్ణవేశ్మసవిధామోదైణశార్దూలముం
గని రుత్సాహవిశాలము న్మహితగంగాప్రాదినీకూలమున్. 159

పరిశోధించుచు కుసుమితానేకాశోకానోకహషండంబు దవదహనసమావృతస్థలంబు గా
శంకించుచు మొట్టమొదలులం బుట్టలు దిట్టలుగ దొట్టివం బట్టుపుట్టంబులు చుట్టు
గట్టికొన్నట్టు గన్పట్టు ఁటఁ జెట్టులలిట్టలకడ నిలువక దుస్తరంబు లగుకంటకప్రస్త
రంబులవలనను ఛాయసౌభలతాంతలతావితావితానంబులవలనను భయంకర పుండ
రీక భల్లూక సమీకంబులవలనను సారకృష్ణసారశోరవాంభసలసలవిసంబులవల
నను మనోభిరామమధిమంబగుగహనకదధ్వగమనపరిశ్రాంత యగునిజకాంత నుద్దే
శించి లక్ష్మణుం గనుంగొని. 166

చ. అడవి భయంకరోరగసమావృత మెంతయు సంకటంబు న
య్యెడ విహరింపఁజాలవు చుమీ వలదంచుఁ గడు న్వచించునా
నుడి విన కిందు వచ్చి యతన శ్రమపాల్పడి కంది కుంది వె
న్నడిపిథి యేఁచ నీరికయునం దల మే దలఁగందలంపఁగన్. 167

క. నడికెకుఁ జిత్తములో నెన్నఁ డెఱుంగనియట్టి యడవినడుమం ద్వరతో
నడుచంజాలదు జానకి, నడు మల్లపు గచభరం బనల్పం బగుటన్. 168

క. ఫుల్లాబ్జనేత్రపదముల, నల్లికొనినతీవ లొప్పె నతివమృదుతనూ
వల్లికి నోడి కడుం బ్రణ, మిల్లి పదద్వయముపట్టి మిడికెకు కరణిన్. 169

వ. అని పలుకు మతియు నమ్మహారణ్యమార్గంబునం జనునవసరంబున. 170

సీ. క్రోడవిదారితక్షోణితలములఁ గనుఁగొన్న నిషాదులు దున్నిరనుచు
శల్యకప్రఖనితస్థలములు గనుఁగొన్న, మునులు దుంపలు ద్రవ్వికొనిరటంచు
ద్విరదనిపాతితోర్వీజము ల్గనుఁగొన్న, నురుఫలభారత నొరగెననుచుఁ
బొదలనిద్రించుబెబ్బులులశరీరంబు, లరసిన బర్హిబర్హంబులనుచుఁ

గీ. గలభములఁ గన్నఁ బెనుగండశిలలటంచు, గుహలు గనుఁగొనఁ దపసులగృహములనుచు
నెఱుఁగకుండఁ వచించుఁ దా నెఱిఁగెనేని, సీత భయమంను ననియొ సుచింతకతన.

వ. తదనంతరంబున నయ్యన్నదమ్ములు. 172

క. ఘనకలుషపిశాచసువ్యగ్రవము సుదర్శన మనం బ్రశస్తమగు సుద
ర్శనతీర్థముఁ గని యచ్చట, ననఘులు నివసన మొనర్చి రారేయిఁ దగన్. 173

వ. మఱునాఁ డరుణోదయంబునం గృతకాల్యకరణీయులై సీతాసమేతంబుగా వత్స్య
సహోయకూరులు ధనుర్బాణంబులు సహాయంబులుగా నాఁడు మూఁడుయోజనంబు
లరిగి. 174

క. పటువిమవస్థఁ భయదా, నటను ఖపురసాలతాలవటుమకుతయుసుం
కటుమగు నటవిం జని యట, త్కుటము నల ప్రయాగవటముఁ గని దాశరథుల్. 175

ఉ. భూజనవంద్యుఁ దాపసవిభుం జతురాననసన్నిభుం భర
ద్వాజుని సంశ్రితాంగిజనవిశ్రుతకల్పమహీజు నిందిత
వ్యాజుని ధిక్కృతేంద్రియమహారిసమాజుని భాస్కరోల్లస
త్తేజునిఁ గాంచి చేరఁ జనుదెంచి నుతించి నమస్కరించినన్. 176

శా. వారిన్ సాదరబుద్ధిమై నతఁడు భరద్వాజుండు మన్నించి త
ద్ఘోరారణ్యపటుప్రవర్తనకు హేతుత్వంబు నిత్యాత్మబో
ధారమ్యుండు దనంతటం గని సమాధానార్ఘ్యపాద్యాదిస
త్కారంబు లుపచరించి మూలఫలశాకంబుల్ సమర్పించుడున్. 177

క. అవియన్నియు నవితాన్వయు, లవిరళసంతోషు లగుచు నందికొని మనో
జ్ఞవచోరచనలఁ గను నవ్యయవనీసుతవర్యుఁ బొగడి యమ్మాత్మప్రతతిన్. 178

క. తలగడలు గాఁగఁ దమకరతలములు గావించి యొండుతలపు లుడిగి పెం
దలముగు దలకృతశేషస్యశలముల నిదురించి రొక్కతలమున వొగడన్. 179

వ. అంత. 180

క. మిహిరానికాయ నుడుపుచు, మిహిరోదయ ముదయశిఖరి మెఱయఁగ మునిస్వా
మిహితాదేశంబున నమ్మహితాత్ములు నరిగి యరిగి మార్గములోనన్. 181

చ. కని రలచిత్రకూటము నగాధరఘోభయపార్శ్వరోధరా
ఘనిబిడవల్లరీపటునటన్మధులిణ్మృదుగానభాసమా
నవనలతావితాన లలనాకృతిచాయతరోపగూహనో
జ్జ్వసితనిరంతరప్రమదసద్విటసవ్రజచిత్రకూటమున్. 182

గీ. కాంచి యట పర్ణశాల నిర్మించి చిత్రకూటకూటమహోత్కటపటునికటగు
హాగ్రహాపహారకిన్నరీహారితరసు, గానని స్వానసమ్యగాకర్ణు లగుచు. 183

చ. కలసినకందమూలరసకాఫలప్రసవరసత్ప్రవాళము
ల్పొలుపుగ సంగ్రహించి మహిపుత్రి కొసంగుచు దుష్టదంష్ట్రిలం
బులులను దుర్వృకంబులను బొబ్బమెకంబులఁ బింగదృష్టులం
బులఁగులఁ దోలుచు న్ముదముఁ బొందుచు నందు వసించియున్నెడన్. 184

క. రహితనయుఁ డొక్కదనుజుఁడు, మహితనయానయముఁ గాంచి మోకలివపువు
న్వహియించి నిజనిశాతనఖహతిఁ గుచాంతరముఁ జీరెఁ గాముకవృత్తిన్. 185

గీ. జీవితేశ్వరి నటు చిరిజేసి నేయు, చండకఁబులు రావవిభుఁడు చూచి
కనలి యస్త్రంబుఁ జేసి యొయిషీకంబు వైవ, నది భయంకరతరశర మగుచు నిగిడె. 186

శా. మింటన్ మండుచు విస్ఫులింగములు వోడ్కం దిక్కులంబంబు తె
స్సొంటం గాంటు శరణ్యశూన్య మగుచు న్విభ్రాంతవ్యగ్రింధ రై
మింటం బర్వులువాఱుమం గహనవల్మీకంబులం డాగుచు
న్నంటం జేరుచు నొచ్చె నిట్లు క్రకచగ్రమ్మం గాకి యేకాకి యై. 187

క. దిక్కులు పదియును బ్రుమ్మరి, దిక్కెవ్వరు లేక రామదేవుని పదము
ల్దిక్కనుచుఁ దలఁచి యాతఁ, డెక్కుడుకుం బరుచు నేకదృష్టి మరలుచున్. 188

క. ప్రేమను నిట్లు లలంచిన, వాయసముం గాంచి దీనవరదుఁడు రాముం
డాయెడఁ ద్వన్న యనము మృత్యాయకమున కొసఁగు మిది ప్రశాంత మగునన్.

సీ. నెమ్మనమ్మున హాస్యమ్ము గ్రమ్మికొన ఘనమ్ముగానమ్మునకు నయనమ్ము సంగి
యాత్యరిష్టంబు నొందుచు వరిగెనయ్యరిష్ట మప్పుడరిష్టంబు రిష్టముగను 190

వ. తదనంతరంబున. 191

క. చతుర్కృవకారుణమా,గృతుహానవిపత్కుయుతకుగత్శోగణాచు
గృప్తతశరవృతుబుతుత,రతుతుభిత మగునయ్యరణ్యతశోణిన్. 192

వ. సీతారామలక్ష్మణులు నివసించి రంత నక్కడ. 193

ఉ. దైన్యరసాశ్రయాననుఁ డధైర్యుఁడు నైననుమంత్రుఁ డింతయున్
శూన్యరథంబుఁ గొంచుఁ బురికేఁగిన వచ్చినవాఁడు లోకస
న్మాన్యుఁడు రామచంద్రుఁ డని నాగరికు ల్గనుఁ జుట్టుముట్టి రా
జన్యుని లేమిఁ గాంచి సవిషాదము నొందుచుఁ దన్ను దూఱుచున్.

క. తగవున రాముని వార్తలు, డిగినం బ్రత్యుత్తరము లుడిగి లేచు తడిం
డిగి చెక్కులు గన్నీటను, డిగి పొరలెను రాజుఁ గని కడిందియులంతన్. 195

చ. దశరథమేదినీరమణ తావకపుత్త్రిలు రామలక్ష్మణు
ల్విశదమనస్కులై విపినవీధి ధరాతనుజాసహాయులై
కుశలత నున్నవారు నృపకుంజర వారు వనంబునం జతు
ర్దశసమయాబ్దముల్ త్రుటివిధంబునఁ బుచ్చురు వత్తు రొప్పుగన్. 196

వ. వారిం దలంచి విషాదంబు నొందం బనిలేదు. సుఖంబున నున్నవారని పల్కి వెండియు.

క. అవనీశ వినుము వదిన్యాల్గడి రైనరోటికడపల స్నేజముగ ని
న్నకలోకించెద మనుమున్, భవవీయాలినూజా లనినపల్కులు వింటే. 198

చ. అనవుడు గుండె జల్లుమన నన్నరనాయకుఁ డగ్రపుత్త్రుఁ డే
డొక్కని తలఁచీసశోకరుఁ గూడి వసఁలు మనంబునన్ ఘనం

వనితలఁబాసి తండ్రి మృతుఁ డయ్యెడు నాదెసనైన శోకవే
దనవని చింతసేయవుగదా తగదా దయ దాసవాంఛితా. 199

క. విను తనయ మునివినుతనయా, నినుఁ గనుభాగ్యంబ కాని నిరతము నుదగ
న్నినుఁ గనుభాగ్యము నోచను, మునుఁ గను పాతకము దుఃఖమున మునుఁగంగన్.

చ. నను విడనాడ నీకుఁ దగునా తగు నాదగునా ధరిత్రిపా నే
యునకుపున్నైన విన్ముతనయా తనయా తనయాత్మజన్ముచే
త నణఁచుచంద్రి సేయుప సరాపసరాపసదాసకోటుల
న్వనిగనబోదు తివ్పు. సుమనస్సుమనస్సుమనస్త్రనాళికై. 201

ఉ. అని మతిలోన ననేకవిధంబులం బలవించి పెండియు రామలక్ష్మణులం దలంచి

చ. నిముసము తాళఁజాలఁగల నేకలనేనియుఁ గానరాదు దై
న్యమున వనిం జరింపనవునా నవునా ను లౌచుఁ గన్నదో
యియుద మొనర్పకున్న మెయి నేమెయి నేభరియింతుఁ బ్రాణమో
కమలదళాక్షులార మిము కన్గొనుటందయరాదు మీమదిన్. 203

క. పాపాత్ముఁడు నిష్ఠురుఁడును, గాపురుషుఁడు ననుచు నగుమొగంబులు నాకుం
జూపరచూపుల చూపక, తాపదలఁచ నోర్చి యడవి కరుగం జనునే. 204

వ. అదనంతరంబునం గోడలిఁ దలఁచి. 206

క. తరుణీకరత్త పమగుకన్యధరణి న్నడుకంగ లేక తాపము మిగులం
దరుణి తరునీడలఁ గా,తరునింతయుఁబోలె మెలఁగదవె విధిచెయిదిన్. 206

వ. అని పలవించి పెండియు. 207

ఉ. డాయుమురా తిడేమిచెప్పుడా యనుఁ గానమె కాలు మీకుఁ దో
డా యను నొంప్లు మీకుఁ బురుడా యను నావెతఁ దీర్చువాఁడు లేఁ
డా యను రామ నీకయిన నక్రుత్రికం బొకయింత లేదు నా
డా యనుఁ దమ్ముఁ డాయను మహాటవి కేగితె పుత్రుఁడా యటన్. 208

వ. అని మతిరూఁ బెక్కుభంగులఁ, దనయులఁ గోడలిఁ దలంచి దశరథుఁ డతిశో
కనిమగ్నుఁ డైనఁ గనుఁగొని, యనియుం గౌసల్య శోకసామగ్రమునన్. 209

ఉ. నీకు విచారము(లు) ధరణీవర మేలతలంచినాఁడవ
త్యాకపుసంబు నొచ్చు మముఁ గన్గొన నీవపు డెందు వచ్చుట
న్నీకు విచార మీకరణి నీయఁగఁ జేసెఁ గులంబు నెల్ల నా
హా! తరుణంబు దక్కి భరద గ్రసుతుం బెదరాయు టగ్రహో. 210

వ. ఇట్లరిగి విచిత్రకూటంబగు చిత్రకూటంబు సమీపంబునకుం జనునవసరమున 340

ఉ. ఎప్పుడు రామచంద్రముఖ మేర్పడఁ జూతుము కన్నులార ని
న్నెప్పుడు రామభాషణము లింపుగ విందుము వీనులారఁ దా
నెప్పు డయోధ్యకు న్మనల నేలఁగ వచ్చును మిత్త్రులార యం
చప్పుడు వేడ్కఁ బౌరజను లారని రావము లుప్పతిల్లఁగన్ 341

క. పలికెడు పలుకులు తురగ,మ్ముల హేషలు మత్తనాగముల బృంహితము
ల్లలసి బలిసి యుక్కొనఁ, గఁ శకునంబులకు భీతి గలిగించుటయున్. 342

క. తద్రవముం బతిమ్మృగో,పద్రవము న్లక్ష్మణుండు పరికించి యెద
గ్ద్రుమము నెక్కి కనియెన్, భద్రంబుగ వచ్చుచున్న భరతుని సేనన్. 343

వ. కని ససంభ్రముండై రాముం గనుంగొని 344

క. రామ వినుభరతుఁ డేవిటి, కో మనకడ కిపుడు వచ్చుచున్నాఁ డనిన
స్స్వామిత్రి మనలఁ దోడ్కొని, పో మనమునఁ దలఁచి రాక బుద్ధి నెఱుఁగుమీ. 345

వ. అనిపలికి నత్యవసరక్షణంబున. 346

చ. సరభసవృత్తి మోముల పిచారము వేడ్కయుఁ దోఁప నేగి య
బ్భరతుఁడుఁ దత్సహోదరుఁడు బ్రాఁతిగఁ గాంచిరి మానవేంద్రుని
న్నిరతశమాశ్రితైణఫణినిర్వ్యథగ్రీమహాఖగేంద్రునిం
బరమపవిత్రతాపసకృపాగసనాగ్రుని రామచంద్రునిన్. 347

వ. ఇవ్విధంబున సందర్శించి. 348

క. పోరఁబోరఁ బులకాంకురములు, శరీరమునఁ గ్రమ్మ నేగ సరిమ్రొక్కిరి స
త్కరచరణలలాటంబు లు,దరములు భుజములును భూమితలమునఁ బొరయన్. 349

మ. అటు తన్మ్రొక్కినముద్దుతమ్ములను సమ్యగ్భక్తి చిత్తమ్ములం
బటుమార్గంబున రామచంద్రుఁ డవనీపశ్రేష్ఠుఁ డాసక్తిఁ గౌఁ
గిట నాశీర్వచనాళిపూర్వకముగాఁ గీలించియుం జేర్చి యు
త్కట మోదమ్మునఁ దదీయమస్తకము లాఘ్రాణించి భావించియున్. 350

క. తనకరములఁ దమ్ములమృదు,తనువులు నిమిరియు నతం డతనుమోదమునం
దనియఁడు రాముఁడు ఘనవ,దనచర్చలు గావె సహజదర్శనము లిలన్. 351

వ. అత్యవసరంబున. 352

క. భూమ్యాత్మజకును ఫణిపతి,సామ్యం డగులక్ష్మణునకు సముచితముగ స
త్ప్రావృతి మ్రొక్కెను రామ,స్వామ్యనఘుఁడు లక్ష్మణానుజన్మసహితుఁడై. 353

ఉ. భూతలనాథనాథ రఘుపుంగవ క్రోధము దక్కి నన్ను నీ
చేతలదృష్టిఁ జూచుచు వచించెద రాజ్యభరంబు సర్వము
న్నాతలఁ బెట్టఁ జూచెదవు నాతలఁ బట్టుట గాదు నీవు ధా
త్రీతల మేలఁ గావలదె జగమెల్ల సుఖింపుచుండఁగన్. 372

క. ఇనవంశ్యులయందుఁ జక్రికాయము రాజు కరుణఁగని యువరాజుం
జనకుని పోలుపొందం జ్యేష్ఠుని రాజ్యము సేయుపొంటే నరుదె యనఘా. 373

గీ. కేకయాత్మజ నడపిన కృత్రిమంబు, నించుకయు నెంచకుము భవద్భ్రాతయందు
సత్యసంగ్రహమూర్తి వీ వఖిలభూభృదగ్రగణ్యుఁడ వహియింపు రమ్ము వరమునమ్ము. 374

క. శస్త్రాస్త్రాభ్యాసములు, శస్త్రార్థవిధర్మములును శమసమదములున్
గ్రస్తసువర్ణము లట్లుగు, నస్త్రజ్ఞుఁడ వగు రాజు లేని వసుమతిలోనన్. 375

ఉ. కావున నాదు ప్రార్థనముఁ గైకొని నీవు జగజ్జనంబులం
గావు నరాళిసత్కరుణఁ గాచినధర్మువు కో సమానముల్
గావు నరేంద్రధర్మములు కారుణికత్వమునీవ సేవనా
గా వనభూమి నీకుఁ దగుగంతకు నే నదియుండ నీకిఁకన్. 376

శా. క్షోణీభారము నిర్వహింప నహితక్షోభంబుఁ గావింప న
క్షీణానందము భూజనాళి కొసఁగ క్రొత్తగాదు రమ్మవన
క్షోణి న్నిల్చెద రాము పొమ్మనుచు నాకు న్నీవు దెల్పంగ మ
త్ప్రాణంబుల్ విడనాడఁ బూనితి సుమీ ప్రాయోపవేశంబునన్. 377

క. చాల న్వగపున వనమున, నేల నివాసంబు నేల నేల వరి మ్రొక్కఁ
జాల భూపాలకుఁడు నీ, పాలన వసియింతు వర్ణపాలకమౌళీ. 378

వ. అనుటయు రాముండు నుందస్మితుండై దశరథనాందనున కిట్లనియె. 379

ఉ. తమ్ముఁడ వెఱ్ఱివాఁడవు గదా తెలిసెన్ భవదీయధైర్య మే
నిమ్మెయి రాజ్యపాలనకు నిత్యజనంబకుఁ దండ్రిపంపు భా
రమ్మున నిల్చి కానల నవశ్యము క్రిమ్మఱి వత్తు నీవు హా
ర్దమ్మున నాచరింపుము ప్రజాపరిపాలన మప్రమాదివై. 380

క. మనలో నీ వార జనకుని, పనుపున వర్తింపకునికి పాడియె గుణమం
దన నీ వాఁగవె ధర్మువు, నను గావింపకుము రాజనందన యింకన్. 381

క. పితృభక్తి నేమమున దైవతపూజాపరుఁడ వగుచు వసుమతిజనులన్
ధృతిమంతుఁడవై వత్సర, చతుర్దశము ప్రోవుమా ప్రజలఁ బ్రజలకిరవౌన్. 382

స్త్రీణము దుర్విషాణము పరాజితశోణము సత్కృపాలయా
ఘ్రాణము ఘోరఖాణ మఘకర్మధురీణముఁ గైతవైణముల్. 282

వ. అచ్చర, బుర్రంబు నాటుటయు. 283

చ. స్మయరహితుండు నిర్గళితసత్త్వుఁడునై తనతొంటిరూపు వి
స్మయముగఁ దాల్చి రాక్షసుఁడు చచ్చెనెడన్వెస లక్ష్మణా హతో
స్మి యనుచుఁ జేరఁబిల్చుంగున దిచి చిముఖంబున నెత్తుకొల్లఁ న
వ్యయముఁ దగురామబాణహతి నాతఁడు ప్రాణము వీడె ధన్యుఁడై. 284

క. ఇవ్విధమున మారీచుని, గ్రొవ్వణచి యల్లఁచును రఘుప్రవరుఁడు పెం
దవ్వరుదెంచెద నని వెస, నవ్వనము చొచ్చి వచ్చె నంతత్రిలోకా౯. 285

మ. అనుజా లక్ష్మణ చేరరావె యనుదీనాలాప మారాముఁడా
డిన చందంబునఁ దానుకాత్మజుఁడు నూటించఁబల్కుటాలించి హా
యని ధాత్రీసుత వెచ్చనూర్చి పెనదైన్యంబు వాకృతిం దాల్చెనో
యన సౌమిత్రిముఖంబుఁ గాంచి యిటులేరమ్మా యటంచు భీతాత్మయై 286

క. ఓయన్న సుమిత్రాసుత, మీయన్న వనంబులోన మిగిలినవాఁ డా
వో యన్నఁ బలుకవేమిటి, కో యన్న యెడ లేనిభీతిఁ గూడె మనంబు౯. 287

గీ. అసురవరులను సురలఁ దన్నాఁగి రెవరి, భయముఁ జెందనివారుఁ దెప్పగదెఁ దమ్ముఁ
డా యనుచుఁ జేఁబిల్చెను డాయఁబోఁగ, దయ్య లెడవేలనయ్య ఘణ్యాయుగదయ్య

ఉ. అంజలిసేయు రామని రయంబున నిప్పుడె కూడఁబోయి నా
నంజలి దీర్చుమంచు ధరణీసుత వేఁడిన లక్ష్మణుండు బ
ద్ధాంజలియై తదీయచరణంబుల మస్తము మోపి యేల భీ
తిం జలనంబునొందెదఁగ సతిమఖుండుమనూల్లసత్ప్రదా. 289

క. లలన పదునాల్గుభువన, మ్ముల భారము మీఁదఁబడిన మోయఁదలంచె త
ద్బల మీవు నెఱుంగవె, చలింపవల దింక రామచంద్రునికొఱకున్. 290

క. క్రించుఁదనంబు రాముని, వంచింపం బెట్టఁగి దనుజవంశాధము లూ
హించి వెడమాయలను ప్రపంచించి చెడుదు రగ్గరడి క్రియులవడువునన్. 291

వ. అనిపలికి మఱియును పతద్గ్రహుండు హరిణపరిగ్రహార్థం బరుగునవసరంబున. 292

క. కవలక భక్తిమాయి నిత్య, కడినెను గాచికొనియుండు వాతాయువుఁ బ
ట్టైక ననియరిగెం జెప్పుచుఁ, దదీయవచనంబు లెల్లు దాఁటుదుఁ జెప్రమా. 293

చ. అనవుడు రామచంద్రుఁడు మహాపద నొందె సహోదరా రమ
మ్మనఁ జనుదమ్మటంచుఁ గడుఁ బొక్కుచుఁ జేరిన సంధుఁబోక న

న్నను చిత్రమృగ్గకర్తఁ దయాపరిహీనమనస్కుఁ గాచియు
న్నను ఫలమేమి యన్నను వెసం గఁబోవఁగదన్న క్రమ్మఱన్. 294

క. అనుటయు నధోముఖుండగు, ఘన చింతాక్రాంతుఁడును బిగళితాశ్రుఁడు ద
త్తనయు త్తరయుండు నగు నా, తనిఁ గన్గొని సీత క్రోధతామ్రముఖయై. 295

మ. ఇదె మీ యన్న మహార్తుఁడై పిలిచెఁ బోవేమి యన్నఁ బోవేమి నీ
మదినూహింపఁ దో కాక కాన నొగుల న్మాతోడ నేతేరఁ బూ
న్గదయామూర్తివె యంచు నిష్ఠురము లన్యాయంబుగా లక్ష్మణు
న్ననతిరత్నము దూఱినాఁడ సదసన్మార్గజ్ఞ నా గర్భితోన్ 296

వ. ఇట్లాడి దుఃఖాతిరేకంబున. 297

క. నా చిత్తము నిను బోట్లకు, గోచరమే యన్న చావుఁ గోరి నను మది
న్వేచితి యాగు టెఱుఁగుదె కిత, నీచ సుమిత్రానుత దురాత్మ నిహతవివేకా. 298

క. వాటంబగునన్న యుటుల, వాటము కడ నిలువ నీకు వల దన్నదను -
మ్మాటలు తన్నన్నయము న, కీఁటెలపోటులయి నాటె నిట్లని పలికెన్. 299

ఉ. ఆ రఘురాముఁ డార్తివశుఁ డక్కట యింక ముకుందగాత్రుని
క్రూరము నిన్ను బాసి చనఁగూడదు నా కని యొత్తి చెప్పని
ష్ఠూరత ఘోరకష్టుల ఘుంబని మాడ పల్కి దిట్టు నీ
వాంఛితమన్న వత్సన్నాగమాస్తి గామిఁ దెల్పంగనుండునే 300

క. అని పలికి రామచంద్రుఁడు, చనిన పథంబుఁ బట్టి చనియె సౌమిత్రియు నా
వ్వనితాసదనంబు రావణుఁ, డనుకూలంబై సమయ మని ముదమొదవఁగన్. 301

క. అన్యాయుఁడు ఖలుఁడు విఫలితాన్యాయుఁడు ఘోరరూపుఁ డంతట మాయా
సన్న్యాసి యయ్యె నాత్మజనన్యాసితతిఁ బట్టు దురితాచారము లోఁదగన్. 302

సీ. ఇట్లు కన్యాంగియై తను విల్లబూది, పూఁతఁ దండాక నొక జలపూర్ణకలశ
మమర ధరియించి హరహరా యనుచు వచ్చి, పర్ణశాలకుఁ గడుసమీపమున నిలిచి.

ఆ. దేహి భిక్షాం దేహి దేహి భరితవినయఁ గాంచి దేవి భిక్షాం
దేహి యనుచు నూనకిసఁ దేహింపక యెనుయువోయి భృతిదవ్రోత్రన్. 304

వ. అర్ఘ్యపాద్యంబు లొసంగి నిభృతమై యిట్లనియె. 305

ఉ. ఇంక యిక విశ్రమింపుము యతీశ్వర మా పతి వచ్చి మిమ్ముఁ బూ
జించు నతండు పొన్నడలి జింక కొటాలున నింపు వచ్చి నా
ర్తించి దాని బట్టికొని తెమ్మని వేఁడుకొమాఱ నేను ప్రా
ర్థించినఁ దన్నిమిత్తమున దివ్యధనుర్ధరుఁడై సహోదరున్, 306

ఉ. పాంథమనోభవాపహృతిఁ బ్రాభవుఁ డైనను వాఁడు చెప్పు పు
ష్పంధయశింజినీకలితసారబలం బగుచుండు వెంట ద
ర్పాంధత సూనమార్గణచయంబుల నొదక గ్రుచ్చి నాదుహృ
ద్గ్రంథి నలంచె గావున సుకంధరద్వచనామృతంబులన్. 426

వ. అని వగచి. 427

క. క్రమ్మఱ నిట్లను బృథుశోకమ్మున హా జనకతనయ కడునడి నన్నుం
గ్రమ్మినతాపము దీఱునె, కమ్మనికెమ్మోవిపానక మ్మీకున్నన్. 428

వ. అని పలికి యలుక వొడమ నమ్మహీసుతాప్రియుండు 429

క. సాధుచరిత్ర యొందగు, మైథిలి నొప్పింపకున్న మహి నిప్పుడ సం
బాధింతు నస్మదీయక్రోధోద్రేకంబు వెలయఁ గ్రూరాస్త్రములన్. 430

క. నను రాజమాత్రుఁగాఁ దలఁచి సుగంధర్వయక్షసిద్ధాదులఁ గ్రుం
చినఁ గాని తీఱ దిదె కన్గొను మనరామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 431

గీ. అంబుజాసననిర్మితం బైన కరంబుఁ, బోలుపు నొందుజరాచరభూతకోటి
నీవు గాపాడువాఁడవు నీవు సేయు, టుగ్రకర్మము తలపోయ ముదుకుదక్క. 432

గీ. ఏల తాలిమిఁ దూల సీతాలతాంగి, నిచ్చోట నచ్చోట వెదకుద మెట్టులైన
నేను గానివత్తు సంశయ మి తవలవ, దగ్గిలోనున్న నబ్ధిమధ్యము నున్న. 433

వ. అని పలుకుచుండ రామచంద్రుం డుపశమితపరితాపుండై క్రోధమాత్రంబు ధరణీ
కుమారిక నరయుచుం జని మార్గమధ్యంబున. 434

ఉ. ఖండితపక్షుఁడై మిగులఁ గాఱునసృక్ప్రవిషిక్తక్షతుఁడై
తుండము ధాత్రి నూఁదికొని తోరపుమూర్ఛ మునింగి జీవముం
గొండవిధంబునం ధరణిఁ గూలినపక్షివరేణ్యుఁ గాంచి మా
ర్తాండవరాన్వవాయకలశాంబుధిసోముఁడు రాముఁ డుగ్రుఁడై. 435

వ. రాక్షసుం డనుతలంపున. 436

క. నీవమఱి సీత నొకజగచరుఁడు గ్రసించి యిట్లు నిష్కపటుక్రౌం
చాచితె లక్ష్మణ మలం, జూచి తెరవుంగోవ నిట్టి క్రుస్కృతముఁ బడితివె.

క. కావునఁ గడుఘోరం బగు, నీవనమున సంచరించు నిక్కపటాత్ముం
జీవనము గొనెద వెస వి,ల్లీవన యముగంటలోన నిట్లనె తఁడున్. 438

సీ. ఘనులార రామలక్ష్మణులార కేను రాక్షసుఁడను గాను మీజనకుఁ డగుద
శరథభూమీధవసఖుఁడ జటాయువ, న్వాఁడె రావణుఁడు దానవవిభుండు

గీ. వారలకుఁ దనవృత్తి సర్వంబుఁ దెలియఁగఁ, జెప్పి చేదోయి యంత మోడ్చి వినయమున
నాకబంధుఁడు దాను దివ్యపురుషుండు, గాఁ దనతొంటిరూపంబుఁ గలుగ నిలిచి.

క. భూపవరులార యిదె మ,చ్ఛాపవిమోక్షంబుఁ బూర్వజన్మకృతమహా
పాపవినాశము నయ్యెన్, మీపదదర్శనముకతన మిగుల వెలిఁగితిన్. 448

చ. అని వినుతించి వారు జనకాత్మజ యున్నెడ వేఁడిన మహీ
జనవరులార మీరలు వెసం జని మంత్రులఁగూడి ఋశ్యమూ
కనగనగంబులం దిరుగుచు న్జహితాత్మతనూజు వాలియ
న్వచరనాథుసోదరు వశ్యముఁ జూడఁగఁబొండు ధీయుతులై. 449

క. ఆసుగ్రీవునితో సఖ్య,వాసము గావింపుఁ డతఁడు వనచరుల మహో
ల్లాసముఁ బిలువఁ బంపి ధ,రాసుత వెదకింపఁజాలు రభసత ననుచున్. 450

క. ఈవిధమున దనునామం, బావిలమతి దెలుపఁగఁ జెప్పి యరిగెన్ హరివి
శ్వావిద్భల్లూకహరిణ,భావనభాగమందు నరుగుచు నెమరన్. 451

ఉ. ఆశ్రమము న్లతాంతసులతాంతముఁ గూజితకోకపైకభృం
గాశ్రయము న్రసాలవకుళార్జునదుకసింధువారస
మ్మిశ్రమము న్ద్రపేతభయమేదురగుల్మయూథంబులు నొక్కప్రపు
ణ్యాశ్రమముం గనుంగొని రహర్పతితేజులు రామలక్ష్మణుల్. 452

వ. కనుంగొని. 453

క. చెనఁ జొచ్చి యందుఁ గన్గొని, రసమానవ్రతసమాగతాయాసభరి
న్నుసరిత్ప్రపన్న పికరం, గసటాపటలప్రకలితకబరిన్ శబరిన్. 454

క. కని తచ్ఛబరాంగన భ,క్తిని వే నర్ఘ్యాదివిహితకృత్యము లొనరిం
చిన సంతసించి నరవరు, లనవద్యులు ఘనులు దశరథాంగతనూజుల్. 455

వ. పరమపవిత్రకుశాస్తరణంబుల సుఖాసీను లైరంత. 456

చ. పొసఁగి భక్తిఁ దచ్ఛబరి భూసుతకీర్తికి రామమూర్తి క
ప్పొసఁగి నిజవనమూలమధురోత్తమఫలంబులు తృప్తి పెంపఁగా
మెసఁగి రేళ్వరుండు హితమేదురవాక్ప్రకరంబు దానితో
నెసఁగ రచించుచు న్నిగుల హృత్కుముదం బొప్ప వసించె నయ్యెడన్. 457

చ. తనదుహితప్రవృత్తి విదితంబుగ రామునకు న్వచించి యా
తని వినుతించి రాఘవుపదంబుల నొందల మోపి మ్రొక్కి వే

చ. వనమున రాక్షసాపహృతభార్యుఁడనై తగ నొందు సన్నుఁగ
న్గాని తనయింతి దానవులు కోరి హరించెద రంచు భీతిచే
ననిశముఁ బెట్టిఁ బాయదుర ధాంగము చూచితివే వనాంతర
మ్ముగ గజపర్ణశాల సనుఁబోలునభావ్యులు లేరు చూడఁగన్. 469

క. మరుఁ డైదవశరముఁ గ న్నురవడిఁ నేసెటిని గాక యున్న స్వనసీ
వరతీరంబుఁ గాను, స్మరదశమావస్థ నిట్లు కులుఁగఁగ నేలా. 470

మ. తగ నిన్నుద్యదకస్మరత్కుముదపద్మస్తోమగంధంబుఁ దీ
రగ తాశోకరసాలకుందకుముసౌరభ్యంబునుం గ్రోలి యా
శుగ మత్రత్యము దాల్చి నాదు హృదయక్షోభంబు పెంచె న్నరా
శుగపంచాహతి వోలె లక్ష్మణ బుధస్తుత్యోల్లసల్లక్షణా. 471

ఆ. తాపహారియున్న దీపవంబు సం,తాపకారి యయ్యెఁ దరుణిఁ బాసి
యున్నవాఁడ నగుట నురుభుజ నాదు సీ,తాపహారిఁ జూపు మే పడఁ తు. 472

వ. అని శోకావేశుండై పలుకుచుండ సహోదరుండు సాంత్వనవచనంబుల ననునయిం
చెనంత. 473

ఉ. శోకముఁ దక్కి రాముఁడు విశుద్ధమతిం జని కాంచెఁ బుష్పితా
శోకముఖద్రుమాగ్రపరిశోభితబర్హిశిఖం డినీకులా
స్తోకముఁ గూటకోటిపరిశుద్ధనిశాపతికాంతవేదికా
నేకము సానుసంచరదహీనచమూకము ఋశ్యమూకమున్. 474

వ. అని తదుపాంతకాంతారాంతరంబున ననుజసహితుండై రాముండు ధనుర్బాణతూ
ణంబులు సహాయంబులుగా నుండె నని చెప్పి మహానందంబున. 475

ఆశ్వాసాంతము.

ఉ. మిత్రామిత్రవిభేదశూన్య బుధసన్మిత్రాఖిలామిత్రభి
క్షత్రాసైకపరాయణా నిరతవృత్రఘ్నార్చితాంఘ్రిద్వయా
సత్రేత్యధ్యక్షువాహాదయా సుహృదయాబ్జా వేంకటాద్యోల్లస
ద్గోత్రాభృన్నిలయా సురాహిమలయా త్రాతోగ్రయామ్యాలయా. 476

క. ఆధివ్యాధిహరణ భక్తాధీనాంతఃకరణ కరుణాచరణా
సాధుజనావనచణ భవపాథోనిధ్యుత్తరణ కృపాత్రాభరణా. 477

కవిరాజవిరాజితము.

సరసిరుహోదర సన్నుతపాదరజఃపరిపూతరసాతలయా
పరమకృపాకర పామరభీకర భానుసుధాకరనేత్రవిభా
తరుణశుభాంగ మహీహృదయంగమతాగ్న్యయురంగమ ధీఃదయా
హరి మధుసూదన ప్రణుతసుధోదన భవ్యవినోద నరాదహరీ. 473

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ ఘూమహైత్య
వినయ రామశాస్త్రి-య పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి
లచ్చయ ప్రణీతం బైన దాశరథివిలాసం బను మహా
ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



వ. అని ప్రశంసించి. 43

క. హృష్టమతిం బుధపార్థ్యచ,తుష్టయు మనఁదగుసచివచతుష్టయు మొప్పం
దుష్టాయు భువనపూర్ణో,త్కృష్టయశు రాముఁ జూడఁ జనిరి కపివరులోన్. 44

క. నిటలతటసుఘటితాంజలి,పుటుఁడై మర్కటవిభుండు పులకపటలము
ల్పటుగతి మేనఁ గలుగఁగొన, నటు చని రాము న్మహాత్ము ననుజాన్వితునన్. 45

సీ. కని వేదవేద్యుఁ గని చందంబున, నత్యంతసంతోషి యై తదీయ
చరణారవిందసంస్పర్శితనిజఫాల, భాగుఁడై యానందబాష్పసలిల
పూరితాక్షుం డగుచు పారి సమీక్షించి, రాముండు కరుణాభిరాముఁ డగుచు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనియె నంతరంబున సుమిత్రానందనునకు మ్రొక్కి
గీ. యగనిమన్నన వడసె నయ్యవసరమున, రాముఁ డనుజన్ముఁ గూడి తోరముగ నొక్క
చోట నాసీనుఁ డయ్యె నటుఁ దొక్క, వలనఁ గూర్చుండెఁ దనసచివవరు లలర.

క. తగ నెల్లవారుఁ దమఁ గొలు,వఁగఁ గొలు వలరించు రామవల్లభుఁ డపు
డయ్యాగచరులు గొలువ నగమున, వగఫువ్వఁ గూర్చుండె దైవవంచన సకటా. 47

వ. అట్లున్న యవసరంబున సామీరి నుద్దేశించి రాముండు సౌరి కిట్లనియె.

క. ఈతనికతమున భవదీ,యాతనవర్గము నెల్ల మయ్యెను మాకుం
బూతాస్మచ్చరిత బునఁ, పీతాఘుం డితనివలన వింటివి నీవున్. 49

వ. కావున. 50

గీ. విప్రసత్పుత్రఖండితామిత్ర నీకు,మైత్రి యనియె ఘనమానపాత్రమునను
నిశ్చయంబుగ విపదంబునిధిఁ దరింపఁ, గోరినారము దగ నిశ్చయకొనుము దీని. 51

చ. అనవుడు సంతసించి తగ నట్లు ప్రసీదయున మీరు నేను న
ఖ్యానిరతి నున్నవారము ప్రియంబుఁ బొందఁ దొడఁగూడుదేనిఁ జ
క్కఁగ నట సమస్తకార్యములుఁ గంజహితాన్వయులార వేఱ వే
యనఁ బని యేల రాల నుదకాగ్రముల న్నిలుపంగఁ జాలమే. 52

వ. అని పలికి మహానందుం డై రామచంద్రుం గనుంగొని. 53

క. తన జాతబుద్ధిమై ధా,తన దాలిహరించి మూర్ఖతను జరగించు
ద్దుమజాతరజస్సైన్యా,శనుజాత మడంచి మహిసుతి న్వెసఁ దెత్తున్.

క. అని సుగ్రీవుఁడు పలికిన, విని సుగ్రీవునకు రామవిభుఁ డప్పుడ యా
తనిచేఁ దనచే నిధ నా,తనిచేఁ దనచే నిడె న్మధ్వం బలరారన్. 55

క. నయ మొక్కింతయుఁ దలఁపక, నయమునం బాధింప రామనరవర యిచ్చో
నయమునం జెడి తిరిగెద వే, నయమునం జూడంగ వాలి ననుపుము శక్తిన్. 68

వ. అని పలికి యుత్త నిలువక. 69

శా. నిష్కారుణ్యుఁ డగారిదారకుఁ డురన్నిశ్శేషశుష్కగ్రహో
ఒష్కుండ వసం దర్చి వెస భస్మీభూతుఁ గావించి ధా
నుష్కాగ్రేసర పుష్కరాక్షులను సన్నం బ్రీతి వీక్షించినం
గిష్కింధాధిపతిత్వము దెదఁ గదుం గిశుల్ప్రశంసింపఁగన్. 70

క. తఃయాలి విడుచు తఁడుం, దనయాలి న్విడుచునఁటఁడు దశకంధరభూభృ
త్తనయా లేశ బును వే, తఁ యాటక డుంచుచుర గదా తలపోయన్. 71

వ. అని పలికి పతియును నవ్వాలి ధైర్యస్థైర్యాదిగుణంబు లగ్గింపం దలంచి యిట్లనియె 72

స్రగ్ధరావృత్తము
మాయావిం దన్ని నా తా క్రవనతఁ బ్రబలోన్మాదుఁడై తన్నుఁ జీర
న్సాత్రయావి దుందుభి న్నామమడఁచి పడిపె న్నాకసన్నన్న నిత్య
మాత్రయానిత్య భరాభృద్వ్యసననిరతుఁ గా హా క్రియుం దోల త్రిరా
మా యూవీరాధిపీయ క్షుభసుతుని సామర్థ్యమెన్న న్వశంబే. 73

వ. పతియు నచ్చలాధిపుఁడు. 74

క. గుంగుభి డచి దివి సుర,దుందుభులు సెలంగ శక్తితో ప్పాడ త
న్ముందరనిభకుణపంబు న, మందరభసుఁ డగుచు వీచె మహి మాధిపుఁ డై. 75

వ. ఇట్లు ఋశ్యమూకాచలాగ్రంబునకు. 76

క. జోటుజోటు నెత్తు రుదుల వీ,ముటరూం దప మాఁహరి చుచుఁ జట్రిలుఁ జోకఁ డ
చ్చోటునుండి కటను లదరఁ, బటపటు పికటుగతిఁ ద తపటలి గొలుసుచున్. 77

ఉ. క్రొవ్వున నిన్నగాగ్రము కుం గుణపం బిటు పట్టవైచె నేఁ
డెవ్వఁ డతండు శారిజభవేశ్వరు డైనఁ జచ్చుఁ బో
యివ్విపులాధరాగ్రమున కెక్కినయుఁ బస యంచు శాపమీ
నవ్విపులోగ్రవాక్యనిచయంబులు వింటిమి నేను వాలియున్. 78

వ. ఇవ్విధంబున మతంగమహాముని ప్రుండు శపి చుటం జేసి యిన్నగంబునను నన్ను
మాయన్న వెన్నడిప వెఱచి యున్నవాఁ డని పలికి యుపనికిం దనకుం గలపూర్వ
వైరకారణంబు సవిస్తరంబుగా నెఱిఁగించి విషాదవేదనాదోదూయమానమానసుం
డగు భానుసూను ననునయించి మేఘగర్జితసంకాశంబులగు భాషణంబులఁ బావ
కులభూషణుం డిట్లనియె. 79

ష్టానము గాఁగ నెంతయుఁ బ్రయత్నముఁ స్మరించి తెచ్చి ప
న్నాగ్రమతో డ నుంచె కుసుమాలిక నెలకక భయాలికన్. 117

వ. అంత. 118

క. కంధరధృతమాలికు ఘనకంధరనిభదేహు రవిజుఁ గని రాముఁడు స
ద్బాంధవు భవదగ్రజన్ము సుగ్రాంధతపతిపుత్త్రి విల్వు మాహవమునకున్. 119

చ. అనవుడు సంతసంబు హృదయంబునఁ దోఁప నటంచికొంచు వే
చని విలుఫేంద్రనందనుని సాహస మొప్పఁగఁ జీరెఁ బేరెలుం
గున సమరంబు సేయ నిదిగోఁ జనుదెంచినవాఁడ నంచు న
ధ్వని విని వాలి పంకజహితప్రభవు న్నడియించ నుగ్రుఁడై 12)

వ. చనుదెంచుచు నెడ నెడ సొచ్చి నఖాంజితతార యగు తార యిట్లనియె. 121

క. ఇను బలవంతుని నెమ్మొగ్రుబ్బ వచ్చినవాఁడు తపనపుత్త్రుఁడు కాదు
న్నను బోరి పాతి మరల్, జనుదెంచు నె కలని కిది విచారించు మెదన్. 122

క. హృదయేశ నామదిం గడు, భెదరొందెను దరియఁ గాక ప్రియ మడిదెస నా
కదరుచున్నది పోఁగూడ దనుడుఁ దద్వచనములు వెడచెవులఁ బెట్టెన్. 123

వ. ఇట్లనాదరించి హితోపదేశిని యగుననన్ము తత్ కాశిని గనుంగొని. 124

క. తరుణి నను జయింపఁగ న, త్తరణిసుతుండే కాఁడు నిశ్చితంబుగ విను మి
ద్ధరణిఁ బ్రయత్నంబున నన్, తరణము నొందఁగ వలదె దైవం బైనన్. 125

క. బోటీ నీమాటలు నా, బోఁటి మహావీరులఁ బొసఁగ వనుమఁ గో
పాటోపమానసుండు న, నాటవిభుం దెగుటను చె నర్కజుఁ డాఁకన్. 126

వ. ఇట్లు వచ్చి. 127

క. కోపరసం బొడ లూనెనొ, కో పరికింపఁగ ననఁగ కుసుమదివ్యజతో
నోపండ మద్భుజాహతి, నోపం దర నాని తలఁగు మాటను వచ్చున్. 128

చ. అని వెస వాడి పోరి నొకహా స్యమునం గుదియించి యొంక కే
ల నతని మస్తకంబునఁ బలం బెసలారఁగ గ్రుద్దెం గడు
దలకెను బా వెతింగి తనతమ్ముని గాఁగిటఁ జేర్చి స్వాధికా
రనిఖిలభార మాతనిశిరంబుగఁ బెట్టె నొకొకయానం బయల్. 129

వ. ఇవ్విధంబున. 130

క. గ్రుద్దిన నీడంబోవక, ప్రొద్దునిసువు వాలియురముఁ బొడువ నిరువురుం
దద్దయు నద్దవిడిం బెన్నద్దు లగుచు బ్రేటు లాడుచున్నట్టితఱిన్. 131

క. సుగ్రీవుఁడు మాలాస్యగ్రీవుం డగుట వాలి సఖుఁడు దెలిసి భూ
పాగ్రణి సమగ్రదోఃప్రబలోగ్రుఁ డగుచు వాలిఁ దునుమ నూహించె మదిన్. 132

ఉ. రాముఁడు ధార్మికుం డురుశరంబు గుణంబునఁ గూర్చి భానుజుం
డీమొనరించి యారణి దడిం గొనివచ్చినయట్టివాలి శా
ఖామృగశాలి పేరురముఁ గాఁడఁగ నేసెఁ గలంబమున దను
స్తోమముచాటున న్నిలిచి నూట్రిదలిర్వఁగఁ గాలవేడితన్. 133

వ. ఇట్లు దృష్టిముష్టిసౌష్ఠవంబు వెలయుం దేవా పుటయు. 134

ఉ. తాళము లేమఁ గూల్చి వసుధాధరముం జెకలించి మించి పా
తాళముఁ జొచ్చి వచ్చినకదంబము వాలి యురంబు దూసిపోఁ
జాలక నిల్చె నంతయును జానెసఁగ న్వెస వానిప్రాణవా
యూలము దీల్చుచున్న దనఁ దోయజమిత్రతనూజుఁ డార్వఁగన్ 135

వ అంత. 136

చ సరభసవృత్తి రామునిపృషత్కము రంబున గాఁడినం దిపీ
శ్వరతనయుండు హా యని దివాకరనందను వీడి ధాత్రిణీ
ధర మురుభీకరస్వనమహాతం బయి కూలినభంగి వాలి గం
పారిదిగఁ గ్రుంగ గ్రాలి తదనంతర మాన్పృపుఁ గాంచి దీనుఁడై 137

ఉ. తార హితంబుఁ జెల్ప నతిధార్మికుఁ డారఘురామమూర్తి వి
స్ఫారణ మేల నాపయిఁ బృషత్కము నేయ నటించుఁ దన్నవ
స్సారము నీకు చేసి పరువక్రియ వచ్చి ప్రవీణుకైతవ
స్ఫారత నిట్లు పాలయితఁ జావఁగ నీ కిది పౌరుషం బొకో. 138

క. మించిన ధార్మికుఁడవు కడు వంచన గావించి వృక్షవాటము నుండుం
బొంచి నను గూలిచితి వే, వంచి నమం గల్గ నచ్చరించితి వగచే. 139

వ. అది యట్లుండనిమ్ము. 140

సీ. ననుఁ జేరఁబిల్చి తమ్ముని రాజ్యమున కేఁ, బాపితినాఁడ వటంచుఁ బల్కవైతి
వతనికి నీకుఁ బోరి తెట్టు లయ్యెను, యన్ని తెలియుంగ నన్నడుగవైతి
వతని కీహరిరాజ్య మంతయు నొసఁగిపో, మ్మనలి కీ వనుమన న్నాడవైతి
వనజూనితో వైర మేల నీ కని యన్న, యింప సఖ్యము సంఘటింపవైతి

గీ విలిరియొట్టికి నన్నెదిరించి పోరఁ, గ్రూరనారాచమునఁ బడఁగూల్పవైతి
వకట రాఘవ సమగ్రుఁడ వయ్యుఁ బొంచి, క్రుంగఁజేసితి విప్పు డేమందు నిన్ను. 141

వ. అని మఱియు నతని సాహసాదిగుణం బులఁ దలంచి విలపించుచు. 156

క. ధరణిం బడి పొంతెరు తరు,చరవరుశిర మంకపీఠి సంధించి తదీ
యారమణి నిజాశ్రుకణసం,భరితాననఁ జేసి మిగులఁ బరితాపమునన్. 157

చ. నను గనువిచ్చి చూడ్పలుకవా ధర కేమనంగాను మేను దార బా
రను ననుఁ జూడ నీకు మదిరాదు వి ష్టసుభాగ్య నాట నీ
తనయుఁ న..గదర్పితజితస్ఫురదంగవిలాసు శ్రుత్యై
స్యనికరథ గను స్మణిమయాంగదు నంగదుఁ జూడు మర్మిలిన్ 158

క. కను విచ్చి ననుఁ గనుంగొను, మని యఱచుచు నంగదుఁడు పరాంతికభూమి
స్వామి పొరలుట యుకరాజ్యం,బు కొ ననుం బూన్పు మనుమ గ్రమొక్కుటయెనఁటీ.

క. ఇనజాఁడు సుగ్రీవుఁడు నా,ఙనజాఁడ క యతని వైభవాహృతి సేయు
న్మమతానిచేఁ జాకవలసెఁ, జనునే యొక్వరికి సహజశత్రుత్వ బులన్. 160

వ. అని ధర్మంబుఁదోఁప నాడి. 161

గీ. మఱియు శోకాంబురాశినిర్మగ్న యగుచు, హస్తయుగ్మకమున నిజమస్తకంబు
మోఁదికొనుచునుదఁతోడమీఁది నున్న, ధవునిఁదల డించి తార రాఘవునిఁ గాంచి

క. ఒకతోఁ జోరతు నా కరు, నురుతరవుండంబులోన నొదిఁగి యొనిఁగి సం
గరధర్మకోవిదుండవు, ధరణిం బడఁగూల్చితివి విధాత్సనిచె యదిన్. 163

సీ. నీసతి సీత నెత్తికొని నింగిఁ జెలఁగుచు నేగ రావణుం
డానురక్తి నాసురగణారి వధింపక నీవు నాపభుం
జేసితి కాలగోచరుగఁ జెప్పెడి దేమి యొకండు నేమి
జేసి వతు చేటొకనిఁ జేసితి సామ్యము చెప్పెట్టుగన్. 164

క. మిత్రతనూజున్ ఘనుఁ డగు, మిత్రునిఁగా నెంచికొని యమిత్రత్వంబుం
గోత్రరిపుసుతునిపై నో,ధాత్రీశ్వర చూపు టధిపధర్మముగాదే. 165

వ. అని పలికి యంత నిలుకక. 166

క. పాలనుసరిత నోభూ,పాలక భార్యాసుతులకుఁ బాపితి విపుడీ
వాలినిఁ జెప్పెడి దేమీ, వాలిని బిడ్డలను గూడి యుసురుదె కుక్షిని. 167

వ. అని పలికి కొండియు ననేకవిధంబులం బలవించుచుండె నయ్యవసరంబున. 168

చ. అదరుచు వాలి యాలిఁ బ్రతగాచలి మేదిని వ్రాలి యున్న యం
గదుని మనోహరాంగదుని గన్గొని దేవసపేర్మి గాఢగ
ద్గదిక నెలుంగు రాలుపడఁగా ననియె న్వనుఁ డేల చాలనం
గదదురపిల్ల నెల్లరకుఁ గాలముమూఁడినఁ జేటు తప్పునే. 169

చ. అతిబలు లుగ్రవేగులు మహాశనికర్కశదీర్ఘబాహు లు
ద్ధతులను లన్యసైన్యవిపినశ్వసనాకృతు లిద్ధకేసరీ
శతబలులైన వృత్తచగసైనికు లెంతయుఁ దమ్ముఁ గొల్వఁగా
శతబలి వచ్చెఁ బద్మహితసంభవు పంపిన పంపునర్వఁగన్. 304

క. నల్లని మేనులు సెంతయుఁ, దెల్లని మోరలును గల్గి తెల్లను భీ
షిల్లఁగ బొబ్బలు వెట్టెడు, భల్లూకములతోడ జాంబవంతుఁడు దోఁచెన్. 305

క. మానవనాయక భాస్కరసూనులకు స్వాంతసంబు సొంపువహింపం
గా నేగుదెంచెఁ దరుచరసేనలు దనుఁ జుట్టిరా సుషేణుఁడు కడిమిన్. 306

క. అద్రులఁ గనకాద్రి సురల, రుద్రుఁడు తారకల హిమకరుండును బోలెన్
క్షుద్రం బగు కపిభటసముద్రంబునఁ బవనసుతుఁడు ముఖ్యుం డయ్యెన్. 307

క. శతవర్షబిందుతారాగతికిం బరమాణుసైకతలవంబులకు
న్మితి వెట్టుఁగాక సర్వజ్ఞపివితతి నెక్కింప విధి యైనఁ బడునన్నే. 308

వ. ఇట్లు ఘనంబుగ నట్టాయితంబగు వనచరచమూసమూహంబు సముద్రజలంబులం బుడి
సిలింపను, బ్రహ్మాండభాండంబు వగులింపను గులాచలంబులు విసరివేయను జాలి
కయ్యంబునకుఁ గాలుద్రవ్వుచుండె నంతియును. 309

క. అనుపమతర వారిసేనాఘననిధి ఘననీలగజగవయశరభనలా
ద్య,ఖురక కేసరివేష్టనమునఁ బనసనుతరప్రశస్తిఁ బొలిచెన్. 310

వ. భుజబలాంగదుం డగు నంగదుఁడును విపులకపిసేనాసమేతుండై సేనాముఖంబునకుఁ
గడచి నిలిచె నట్టియెడ. 311

ఉ. అక్షులకుం బ్రియం బొదవునట్టి ప్లవంగమసేనఁ గాంచి రా
మక్షితినాథుఁ డాదరసమగ్రుఁడు భాస్కరపుత్త్రుఁ గాంచి ప్రా
గ్దక్షిణపశ్చిమోత్తరపథంబుల జానకిఁ రోయ నెంతయుం
దక్షుల బుద్ధివారిధులఁ దప్పక యిప్పుడ పంపు మింపుగన్. 312

క. అనవుడు మహాప్రసాదం, బనఘ యటులు చేయువాఁడ ననికపిసేనం
గని పోఁగి జనకజాన్వేష,యునకు నెరచి తత్ప్రతి నర్హులఁ దలఁచెన్. 313

క. వినతాసుత సమానజవ,విను తగ నని నీవు నూఱువేల ప్లవగులం
గొని నైరృతిఁ దూర్పుం, జని జనకజ వెదకి రమ్ము దయ్యన నెలకున్. 314

మ. అని తద్దిక్పతిభూభృద్దరగోత్రార మహత్రీగుహా
ఘనగంభీరసరిత్ప్రవాహములు శోధింపం దెటతెల్లంబుగా

క. మూఁడవ నెలయును నవ్వల,మాసముతోఁ బోఁగడి రామమహీనాథుఁడు ప్ర
జ్ఞానిధి జనకజకుం బ్రజ్ఞానార్థం బంగుళీయకం బొసఁగుటయున్. 326

వ. స్వామికార్యధురంధరుం డగు గంధవహనందనుండు గంధగజంబు తరుణకిసలయం బుఁ బట్టఁ గ్రహించు చందంబున నయ్యంగుళీయకంబుఁ గరంబు రాగంబుమీఱం దత్త ఱంబ దక్షిణకరంబు సాఁచి. 327

క. కొని వారివాక్యముల నూఁకొని వానరసమితిఁ గూడికొని వారల వీ
డ్కొని దక్షిణపథమున కై కొని యేగ నొక్కవ మలమికొని హెచ్చింపన్. 328

వ. ఇట్లనిలనందనుం డనంతసత్త్వసంపన్నులగు నల నీల గజ గవయ గవాక్ష గంధమాదన దధిముఖాంగదజాంబవదాదిమహావీరపరివృతుం డై యెల్లవిధంబులం బుడమిపట్టిం గనిపట్టి వచ్చుపట్టి ప్రతిన వట్టి చనియె నంత. 329

ఉ. ఆదట నున్న యున్నతమహామహిభృత్సరసీవనంబు ల
త్యాదర మొప్పఁ దెల్లముగ నాతనికి న్వివరించి భీమసం
పాదిప్లవంగసైన్యము నపారముఁ దోడ్కొని యంపె నాప్రతీ
చీదిశ సీతఁ జూడఁగ సుషేణుని వైరివనీకృశానునిన్. 330

క. అతనికి నొకమాసంబు, న్మితి వెట్టి యనంతరమున మిహిరసుతుఁడు ద
గ్గఱపర్వతగవానాదులు, వితతమతిం దెలిపి రామవిభుఁడు నుతింపన్. 331

క. ఒక్కొకఁడ చాలి నాలుగు,దిక్కులు వెదకంగఁ గాలు ధీరులఁ గపులం
దెక్కులఁ ద్రోడుచేసియు, దక్కుభంబునను వాతశబలిఁ బుచ్చెన్. 332

వ. ఆతండు నొక్క మాసంబునం జనకతనయాన్వేషణంబుఁ గావించి మరలువాఁ డై
చనియె నిట్లు. 333

క. శాస్త్రామ్రతమునఁ జతుశ్శాస్త్రవిచయనసమగ్రగతులు కపివరుల్
శ్శాస్త్రావాంకృతు తెనఁగ గ్రిస్త్రాత్ములు చనిరి గహ్వరీసుత నరయన్. 334

వ. ఇట్లరిగి. 335

క. తిరుచరవర్యులు మునుముగఁ, దరుణిం ధరణీతనూజఁ దడవిరి మిగులన్
దరుల న్నదీనదంబుల, దరులం దిమిరప్రగాఢతరులం జరులన్. 336

సర్వలఘుసీసము.

మఱియుఁ దరుచరులు మసలక యవనిజ వెదకఁగఁ దొడఁగిరి వివిధగతుల
బుఱుఁగులు మెకములు మొలఁగడు నెఱవులు బులుఁగులరుతములఁ బొదలుపొదల
నుతువులఁ బొరువులు మడులను శిలలను బొలములఁ గొలఁకులఁ బులినములను
బురములు నుపవనములు నటుకటములు నహులవివరములు గహనములను

శాఖలని ప్రేరణంబునఁ దగ స్మరణోచ్చ లహించి యున్న శ్రీ
శాలిఁ గ్రసింప దీనిపని నా మనకెల్ల మనోరథ బులున్. 364

క. అని మనల ప్రిష్యగుచు బ్రాహ్మని నిర్ధ్వితాత్మ్య లగుచు నఖిలకపులుఁ వా
నిన చూచుచుండఁ జేరం,జనుదెంచి విషాదమెసఁగ సంపాతి యనున్. 365

క. ఎక్కడి జటాయు వతఁడే, చక్కటి సమరంబు సేసి సమసె బిడప మీ
రక్కరణి నెఱ్ఱంగితిరి, రక్కటు చెప్పఁడే యవాని యుగ్రజుఁడఁ జూఁడీ. 366

క. వానికిఁ గోపంబున నె,వ్వారలతో రణ మొనర్చె వానికిఁ బోరం
గారణము మీ దురాత్మకుఁ, గారణముం జెప్పుఁ డీవు గారవ మెసఁగన్. 367

వ. అని యడిగి చింతాపరిక్రాంతుండై. 368

క. కలకులనోత్రంబుఁ బొ,క్కల గాలి విరిచ్చి చేయుఁగలఁడు కృపణుఁడై
కలనఁ బనవలసె మనము వి,కలమయ్యె జెప్పుఁడ తత్సకలకృత్తంబున్. 369

వ. అనిన నప్పవంగపుంగవుఁ గాప్లవంగపుంగవు లిట్లనిరి. 370

సీ. దశరథసుతుఁడు సీతానాథుఁ డనుజన్మసహితుఁడై పితృవాక్య సద్వ్రతంబుఁ
బూని పంచవటంబుపొంతఁ బర్ణకుటీర మొనరించి నియతి నుండఁగ బత్త్రి
కంఠుండు రామలక్ష్మణులను వంచించి జానకిఁ గొనిపోవు సమయమున జ
టాయువు రావణునాఁగి మహాహవం బొనరించి యొనరించి యుక్కడక్క

గీ. దనుజచంద్రహాసదళితపక్షుఁడై, ధరణిఁ బడఁ గొంచు దైత్యనాథుఁ
డెక్కడేనిఁ జనియె నక్కడ రాఘవు, లవనిజను లేమి నలమటించి. 371

వ. తదన్వేషణార్థం బఖిలదిక్కులుం బరిభ్రమించుచు వారిచరం బగ్నితోపమానుండై పడి
యున్న జటాయువువలన నత్తవృత్తాంతంబు విని యనంతరంబున ప్రాణపక్షి
ణుండగు నప్పక్షివరేణ్యు దశరథక్షితినాథునకుఁ బోలె దహించి తిలోదకంబు లొసం
గి శబర్యాశ్రమంబును బంపాతీరంబును గడచి ఋశ్యమూకంబున వనచరేశ్వరుం
డగు సుగ్రీవునితోడ సఖ్యసంబద్ధుఁడై సద్ధింబుగా వాలి దునిమి తత్పదంబొసంగినం
గాని పనుపునం గల ప్లవగపుంగవుల రావించి సీతాన్వేషణనిమిత్తంబుగా నెల్ల
దిక్కులకుం బుచ్చిన నే మిద్దక్షిణంబునకుం జనుదెంచి యెందునుం జనకనందన
సందర్శింపనేరక యూరకపోఁ దీక ప్రాయోపవేశంబునం బ్రాణంబులు విడువ
నున్నవార మని చెప్పి యప్పులుఁగు తేనికి వెండి యు నిట్లనిరి. 372

క. పక్షివర నీవు నీగతిఁ, బక్షవిహీనం బగుట విపక్షకృతమొ శా
పాక్షరసంకలితమొ మా, కీక్షణమునఁ దెలుపుఁ బల్కుమీ నీవనుఁగున్. 373

ఉ. అక్కట వాఁడు నత్తఱిని యొక్కపుఁ డుబ్రభవించె సత్త్వమిం
పెక్కుపతివ్రతామణి మహీసుత వీఁపునఁ బెట్టి లంకలో
నిక్కడఁ దెత్తునో యిడు నహీనజవాఢ్యు మదీయపుత్త్రకుం
జక్కఁగఁ దోడ్తెరన్ బ్రకట సద్గుణాస్పదులార చెప్పరే. 381

చ. అనవుడు సంతసించి ఖగనాథప జానకియుండె లంకలో
నని తెలియంగఁ జెప్పితి సహాయము గాదొకొ నీవు నీసుతుం
డును జనఁ జిట్టచెర్తనఁ గడుంబటువైన సముద్ర మెవ్విధం
బున నయినం దరించి మహిపుత్త్రిఁ గనుంగొన నేము చాలము. 382

క. అని పులఁగు తేనిఁ బోవఁ,బనిచి కపిప్రభులు నెఱఁగు బంటిదొరలు ను
ల్బణ నాదముచుఁ బాడుచుఁ జని, చని దక్షిణవార్ధితీరశైలోత్తమమున్. 383

చ. మలయగిరిం బ్రదక్షిణనమస్కృతు లొప్పఁగ నెక్కి వానరా
వలి గనియె న్సముద్రము నభంగతరంగరవాతిరౌద్రము
న్గలితనిజోరుఫేనరుచిలజ్జితనిర్మలతత్త్వశుభ్రము
న్జలచరభద్రము న్మహితసారప్రవాళలతావినద్రమున్. 384

క. కని తత్తరంగశీకర,జనితపరమశైత్యముం బ్రసన్నతలీలం
గొని మలయసమీర మెదు,రొక్కని తమమార్గశ్రమంబు గొంచెపఱుపఁగన్. 385

క. ననుఁ బ్లవగు లెట్లు కడచెద. రని నవ్వోనుభంగి ఫేన మడరం బోని
త్తునె వీరల నాఁగక నను, ననువున భంగంబు లంతకంతకుఁ బెరుఁగన్. 386

వ. ఘూర్ణిల్లుచున్న వారాకరంబుఁ గనుంగొని భయభ్రాంతు లగువారును మూర్ఛాపరవశ
త్వంబు నొందువారును మహానందంబు నొందువారును తరుగుల్మలతాగ్రంబులనుండి
వీక్షించువారును విస్మితులగువారును, సరకుసేయక తత్తరంగంబుల నోలలాడువారు
నై రంగత్సంగదుండు తమవారిదెసఁ గలయం గనుంగొని. 387

క. ఎవ రెన్నియోజనంబులు, జవమున జలరాశి దాటఁ జాలుదు రనిన
న్నవదశయోజనములదాఁక రచించిరి ప్లవగభల్లుకప్రభుముఖ్యుల్. 388

గీ. ఇట్లు తమతమకొలఁదుల నేర్పఱించి, యఖిలవనచరులును జెల్ప వాలినంది
యింద్రనందనందనుం డిట్టు లనియె, వారి నెల్లను సంతోషమునఁ దేల. 389

చ. అసదృశవేగి వాలి కన యానధికుండనుఁ గాని తక్కుఁ గాఁ
దసమున నీతఁ డించుఁ గపులందఱు సంస్తుతి సేయ వారిరా
శి సరభసంబునం గడచి సీతఁ గనుంగొని లంక నగ్రతన్
శిసలిపి మీమనంబు లమలీనసవృత్తిఁ దలిర్ప వచ్చెదన్. 390

వ. అదియునుంగాక. 402

చ. ఒకనిముసంబునం బహుళయోజనముల్లను శ్రీఘ్రరీతితో
నొకనిముసమ్ముఁ బాయక తదున్నము నొర్చి నభఃప్రచారివై
సకలకళావిభూతి రవిసత్కృప నేర్చినయట్టి నీకుఁ జా
టుకఁ దలి దాఁటు టేపని కటా యిటు లొప్పరికించి చూచెదే 403

వ. అని మఱియుం బెక్కుభంగులం బ్రార్థించి యగ్గించుచుండ వానరేశ్వరుండు వారి
దైన్యదైన్యంబులు వాయం బొంగుచు నిట్లనియె. 404

మ. రయతం బిచ్చుకగుట్టఁ గేసరికిశోరం బెట్టులంఘించు నా
క్రియఁ బాథోధిఁ గడాచి యందుఁ జని శత్రుగ్రీవు లంకాపురీ
తతసౌధోపవనోపకంఠముల నాత్మస్ఫూర్తి నీక్షించి యా
రయ యనస్మద్రిక నిత్తుఁ దెత్తు ముదమారం బ్రత్యభిజ్ఞానముల్. 405

క. అని పలికి వారలెల్ల, దనమోమునఁ జూచ్కు లునిచి తద్దయుమోదం
బుఁ గామముండఁ దనపుతు పృథుజాండొప్పారె హైమవతసింహాసనం. 406

వ. మఱియును.

చ. అతులితపర్వతాగ్రమున నాహనుమంతుఁడు వొల్చెఁ బూర్వప
ర్వతశిఖరోదితోజ్జ్వలదివాకరబింబసదృక్షుఁడై సమా
వృతకపివక్త్రపద్మములు విస్ఫురితంబులు గా నిశానచో
ద్ధితరుచిభాను లొప్పఁగ మహీచరఖేచరకోటి యుబ్బఁగన్. 407

క. ఇప్పగిది నొప్పి యెల్లరుఁ, దప్పక దీవింప నిజపదద్వంద్వంబుం
గుప్పించి యుప్పగంబున, కప్పుడెగసెఁ బర్వతాగ్ర మవని సమముగాన్. 408

వ. ఇట్లు లీలావాలోచ్చాలనంబుఁ గావించి నిఖిలవానరమనోనయనానందకరుండును
రామకార్యపరాయత్తచిత్తుండును నప్పవనప్రియనందనుండు దక్షిణాభిముఖుండై
సముద్రలంఘనంబు గావించి. 409

క. గిరిచాపవినిర్గతమై, యురుజవమున నరుగు శరమొకో యన లంకా
పురదహనార్థ మడరెఁ, నంబరచరులకు విస్మయంబు మల్లడిగొనఁగన్. 410

వ. వెండియు నత్తరుచరసత్తముండు 411

క. ఖేటకమురీతి వాలముఁ, బాటవముఁ ద్రిప్పికొనుచుఁ బటురభసమునన్
ఖేటములఁ బట్టికొన నా, ఖేటమునకుఁ జనినయట్లు కీర్తిగఁ దయ్యెన్. 412

వ. అంత. 413

మకరందబిందు సమార్ద్రిత మేదినీ భాగంబులైన యుపవనములను
రత్నకంబళ మహారజతసింహాసన స్థానంబులైన యాస్థానములను
సీ. జవలనంటి తెలింగడు సౌధములను, నతిపవిత్రతరమహోత్సవాలయములఁ
గామరూపధరుండగు కపివరుండు, వెదకి జానకిఁ గానక విహ్వలించి. 437
సీ. మతియును వర్తనశాలలు మందురలును, నాయుధాగారములుఁ గృత్రిమాచలములుఁ
బ్రాకటశిరోగృహంబులుఁ బ్రబలు ప్రపలు, నంతిపురములు నరసి యనంతరమున.
ఆ. అనిలసుతుఁడు రావణాంతఃపురంబున, నవనితనయ నరయ నరుగువాఁడు
లంక బిఁకమింక లంకిణి నిక్కంకఁ, బిలుకుమార్చెఁ గడిఁది బీకమెుప్ప. 439
ఉ. వంచనఁ దర్పురంబుఁ జొరవచ్చిన వారి నెతింగిపట్టి బా
ధించు నిశాటి తన్ను నరథీరణ సేయుచు దవ్వి చంపనూ
హించిన నవ్విధంబున మహింబడ మెట్టువఁ దాఁచుడున్వెలా
బ్రించుచుఁ గూలె లంక యాబ్బ్రాదముచే పమునంచుఁ దెల్పుచున్. 440
క. లంకాస్వరూపయగునా, లంకిణి గూలుటయు నిమ్ముళింబుఁడు నిశా
తంకుండు గుచుమణిప, ల్యంకము నరపేత్రశాలిలసితం బగుమన్ 441
వ. అనేకవిధాలంకరణ శోభితంబగు లంకాభ్యత్రు శుద్ధాంతంబున శుద్ధాంతఃకరణుం
డగు భృత్యుచరాభ్యత్రుండు మానవాభ్యక్షు శుద్ధాంతంబు నరయుచుం జని చని కాం
త విధుకాంత శిలాస్థగిత గిశాలరమణీయతరంబగు నొక్క ప్రదేశంబు. 442
సీ. మణిమద్యపుత్రికా మహిత నిజప్రతిబింబభేదముఁ జలసంబుకతన
పిశాచిరాత్రిత న్యవాక్ర్యకర విభాగము దగు దాళమానము కలియున
రమణీయ దీపికా రత్నదీప ప్రభాస్యము దమునొందు నాష్ణము కలయున
చంద్రికాపాండురసౌధదీప్తి స్ఫారాంతరము చకోరమోదంబు కలఁ
గీ. దగనెతి గి యుహార్ని కాతారతమ్య, మళనవిద్రా విహారభోగాదికములఁ
దెలిసి భాగకంబుఁ జాపులన తెలిసి, సకల కార్యాంబులకు నవసరము దెలిసి 443
క. స్వస్త్రీ సమానలగు గ, తుస్త్రీ నివహంబులు పరిచర్యలొనర్పన్
వస్త్రాభరణంబులఁ గుసు, మాస్త్రశరప్రతిమ దేహయష్టి వెలుంగన్. 444
క. ఈమేనిమద్దిగాఁ దగ, దామేలిక దాని దీని కనుమానము లే
దేమేనిఁ బసింశికిఁగల, దేమేలగు తాని యువనుతికిఁ బాగ్రత్తై. 445
వ. ఒప్పు మెఱయుచున్న 446
సీ. కాంచనామోద దేహముక్తాఫలప్ర, వాళరదన రదచ్ఛద వారణపతి
యా లసమానయసమాన మానగుణభ, రితఁ గృశోదరి మందోదరీసమాఖ్య. 447

క. దల్పాటునఁగని జనకజ, నల్పాఁగఁగంటి నని మహోజ్జ్వలుఁ డిదలో
నల్పా కీడు దలంచితి, నల్పలిక వేడ్క నల్పు నాయిట్ఠంగిన్ 448

క. పతిఁబాసిన కతమున స, మ్మతిలేమిం దాల్మిఁ దూలి మగుడ రఘువరు
స్మృతిఁదలఁచుచు మేనున్ గను, మతీరజము వ్రాయ వగల మఱుఁగక యున్నె. 449

వ. అని తెల్పరలంపుచేసి మతియును రావణవిహారస్థానంబు లగు నయ్యాయి ప్రదేశంబులఁ బరమపవిత్రచరిత్ర యగు జనకపుత్రీసమన్వేషణపరుం డై యెందునుఁ గా దనూపమున్న హనుమంతుండు నిజాంతర్గతంబున 450

సీ. కడుఁ బ్రయత్నమున లంకాపురి శోధించి, కాంతామణికను గందునొక్కొ
కని రామచంద్రుఁ డిచ్చిన యభిజ్ఞానమె, వ్వడు వేడ్క సీతచే నిడుదునొక్కొ
యిడి ప్రత్యభిజ్ఞాన మెలమిఁ గైకొని కపు, ల్గ్రొప వనధి లంఘింతునొక్కొ
లంఘించి శ్రీరామలక్ష్మణ సుగ్రీవులకు శుభవార్తఁ దెల్పఁగలనొక్కొ

గీ. తెల్పి జలరాశిదాఁటి పృథ్వీవధూటి, పుత్రిఁగని కపులుబ్బ నబ్బోటిపాటి
మగలరాఘవులకుఁ దెల్పు మారుతియును, పొగడుకఁ బాత్రభూతుఁడనగుదునొక్కొ

క. అని తలఁచి యనిలతనయుం, డనిలజవుం డంత నొక్క హర్మ్యము నెమరం
గనుఁగొని తదగ్రమున కొ, య్యన గమున కెగయు హరిశ్రేయుం డాటితగన్. 452

క. రామరమణియగు సీతా, రామామణి నరయును తరహీనచ్చింత
బ్రామాద్రవపూగబహుళా, రామ మొకటఁ గాంచె నంతరంగము వొంగన్. 453

చ. ఫలదళబంధురప్రసవబంధనచారుశలాటుమంజరీ
లలితలతామహీరుహవిలక్షితనిష్కుటమట్లు గాంచి య
వ్వలనికిఁ జేరఁబోయి హరివర్యుఁడు గ్రమ్మహితాంతరంబు ం
గలయఁ జరించి భాగ్యమునఁ గామినినొక్కతె రాక్షసీవృతన్. 454

సీ. మంచుబొట్టులఁ బసమించని తమ్మికైవడి మోము కన్నీట వాడుదోఁపఁ
దామరతూండ్లు బెండడి డిందువడు మాడ్కిఁ బుజములు దుఃఖవ బ్రుంగుడుపడ
సొందచే నొగిలిన యివురు నా వేఁడి నిట్టూర్పుచే వాతెఱ యొప్పుఁదప్పఁ
బొగచుట్టికొనదివ్వె జిగివట్టిన గతి మాపుడుఁ బుట్టుమ మేని పొలుపుతూలఁ

గీ. దడి మకిలవొందినట్టి యద్దముల కరణిఁ, జెక్కులఁ గమ్మ చెమటచేఁ జెన్నుదొరఁగ
మానినియలంత నొక పెనుమ్రానినీడ, నుల్లముడుకఁ బ్రలాపించుచున్న దాని. 455

సీ. అపయశంబునకుఁ జోటైతి నా హాయని, విన్ననిమోములో నున్న దాని
బతిభక్తి సతుల కాపద్దారయని రాము, నడుగకఁ దలఁచుచు నున్న దాని
మనుజాదులు గ్రసింతురని భీతి సంగంబు, చెన్నఱ వడఁకుచు నున్న దాని
నాథుఁ బాడంగల్గునా యనుతలపోత, నుల్లంబు వఱుగుచు నున్న దాని

సీ. కరిఘటాకుంభము లప్పుడవలపోలిక బహువిధంబులుగాఁగఁ బగులునెడలఁ
బృథుహయరింఛోళి పిచ్ఛచందంబునఁ దళముగానందందుఁ దొరుగునెడల
నసురకరంబులు హస్తంబులట్టులు పటుసాంద్రగతిఁ దెగిపడినయెడల
ఘనరథాంగములు చక్రమ్ములరీతిగా మొనసిరక్తనదుల మునుఁగునెడల
నతినిశితకంకపత్రమ్ము లాకులట్లు, వాలవాతూలవినిహతిఁ దూలునెడల
నయ్యెఁ దపనసుతాదు లహంకరించి, మించుచేతుకఁ బోరొనరించునెడల. 371

క. సంగరదార్ఢ్యమున మహా, సంగర మొనరించుకపుల సమయించుచుఁ రా
శిం గరవాలముఁ బూని తె, సంగరములు ద్రిప్పుచు న్నిశాచరులలరన్. 372

వ. మహానాదుండు భుజబలాంగదు నంగదుం దలపడుటయు నతండు.

క. కరవాలమూడిపడ ధీ, కరవాలము ద్రిప్పివైచి క్రవ్యాదనభా
సురసాలంకృతదేహము, సుసాలంచేసి దాని చూర్ణముచేసెన్.

క. అనుజుమహానాదుం జం, పినవాలిసుమారుకోపభీషణుఁడగుచు
న్ఘనసి మహాకాయుం డా, తనిపై నిగిడిచె సుతీక్ష్ణశరసాయకముల్. 373

చ. నినిచినవర్షధారల వినిశ్చలతం దనరారు నద్రిచా
ద్పునను దదుగ్రశాతశరముల్ విపినాటుఁడు లెక్కసేయ కా
తనిపయిఁ గింశుకంబులఁ గదంబములు న్నిగిడింప నాతఁడుం
దునుకలు సేసి లోన పటిలోమరము ల్దారగించి యార్చుచున్. 374

క. పటిలోమరములు లీలా, స్పదుఁడై తను దాఁకకుండఁ బట్టి విరిచి యం
గదుఁడు గదావినిహతికిం, గదలక శిలవైచి సూతుకంధరముఁ దునిమెన్. 375

శా. సూతుం గంధరము ద్రుంచి యాతుణమరక్షోధ్యక్షు నీక్షించి ఖ
ద్యోతుం డుగ్రముగాఁగఁ బిట్టుడరి ఖద్యోతంబుఁ బట్టం బ్రభా
తీతుండై చనునట్లు వానిపయి నుద్వృత్తిన్వడిన్ దాఁటి వి
ఖ్యాతుం డంగదుఁ డాహవోద్ధతు మహాకాయు న్మహాకాయునిన్. 376

క. పట్టుకొని యట్టునట్టు, న్నొట్టిపడఁగ నీకఁ గాలమెట్టిపుడమిపై
బెట్టువిసరి కడురుధిరం, బుట్టిపడ న్నొట్టిచంపె నుద్ధతిమెఱయన్. 377

మ. ఇలు మ స్వక్రుఁడు చంపుచుందమున నప్పాపాత్ము నారూఢని
శ్చలుఁ డాకీర్తి కదించి రథ్యముల నాశ్చర్యంబుగాఁ గూల్చి ది
క్కులు భేదిల్లెడు సింహనాద మసురక్షోభంబు గావింప ను
జ్జ్వలుఁడై తేరటికాఁ హిమాలయము స్వేచ్ఛన్ దిగ్గసింహాకృతిన్.

నుత్తమాశ్వంబుల కొల్లెడు కన్నీరులురుకణంబున శ్రమనొందకుండ
మొనసి ప్రత్యాసారములను రక్తాసారములు గల్గు మేఘముల్లులువకుండ
బూకరించుచు నెదిరి వాపోవుచుండఁ, జెలఁగి వంచకములు భీతిఁ జెందకుండ
సైన్యమునకుబ్బయిం బఱగ సంచరించు, మృత్యువెవ్వారలును దన్ను నెఱుఁగకుండ.

క. అట్టిమహోత్పాతంబులు, పుట్టిన దానవులు వెఱపుఁబొందక చలమున్
బట్టి కఱతెంచుటయుఁ గని పెట్టికపులు సమరోద్భీమణులగుచున్. 388

వ. వృక్షపాషాణపాణులై సమరసన్నాహసముత్సాహంబునం బొలిచినిలిచి రట్టియెడ న పూర్వసముద్రంబుల చందంబున నుభయబలంబులు నొండొంటిం దలపడి ఘోరంబు గాఁబోరం దొడంగుటయు. 389

క. పడువారలు మిగులం జే, డ్పడువారలు హితుల నడ్డపడువారలు ప్రా
స్పడువారలు నసమునఁ దల, పడువారలునగుచు దురము భయదం బయ్యెన్.

సీ. తఱచుగా నెగసిన ధరణీపరాగంబు కడుచిత్రమగు మేలుకట్టు గాఁగఁ
గడునడి నుడుగక వెడలెడు కీలాల మతిమోద్యమగు కలయంపి గాఁగఁ
గాళులు దెగిపడఁ గదలనేకయున్న వార లెల్లను దలవరులు గాఁగఁ
బలుపురోక్కఁ నిఁ జలపట్టివధింపుట తులువలశిక్షించు చెలువు గాఁగ
స్యందనంబులు ఫలమహీజములు గాఁగఁ, దగినవారలు వినోదపాత్రములు గాఁగ
నొప్పగాం జేసమిద్భాగమున్ స్వేచ్ఛ, భాతిభాసితమగు సమిద్భాగ మనఁగ. 391

వ. అట్టి దారుణవ్యవసాయంబునఁ గింశారుసంగరం బగు దానవసేనాసస్యంబు రక్తజలాభిషేకంబునఁ బెచ్చు నెఱిఁగి వానరవాలవాతూలంబునం బడల్పడం జొచ్చెనంత. 392

ఉ. అంతకదండహస్తుఁడు ప్రహస్తుఁడు చాపము నెక్కువెట్టి తా
లాంతకరాశి క్రమహ విహార వినోదనిబద్ధచిత్తకా
లాంతకశూలసన్నిభమహాశరజాల పిసద్ధదిఙ్ముఖా
త్యంతకుతూహలుండు ప్లవగావలి నుద్ధతిఁ జుట్టుముట్టెన్. 393

చ. పులిఁ గనఁ గొన్నతేళ్ళగమి పోల్కిఁ బ్లవంగము లార్తనాదులై
నలుగడఁ బాఱఁ జొచ్చిన దనాట శిఖామణి నీలుఁ డేచి యేఁ
గలుగఁ దలంకనేల యని క్రమ్మఱ సైన్యముఁ గ్రమ్మతించి ని
శ్చలధృతి వానిరథ్యరథసారథులం బడనేసె నంతటన్ 394

మ. ఒహలశాస్త్రాగ్నుల జంటు మంటలు కడుం బర్వ స్వాజృంభించి గుం
భహనం దద్దాడిం బెంగుటయు నప్పాపాత్ము నాభీలతై

క. మద్భుతకర యుద్ధ ద్వ్యా,క్పద్ధతి వినవచ్చుఁ గీడు వాటిలు నైనన్
యుద్ధము గలదని యిట్లు వి,రుద్ధపుబుద్ధు లిపుడేల రోషము పెరుఁగన్. 420

క. జయ మొసఁగన్ రిపుఁ బరా,జయమును గావింప రాక్షసప్రవరునకుం
బ్రియ నీవాక్యములు మనః,ప్రియములు గా వెల్లభంగిఁ బ్రభులాడి యగున్. 421

క. అతివాద మేల నగరక, మతివా యంతఃపురమున కతిశాయిపుర
స్కృత్యత్తై చను మనఃటయు మయు, సుత మందోదరియుఁ జనియె శోకముగదురన్.

వ. అంత రావణుండు. 423

క. లయకాలకరాళయమా,లయసన్నిభ ఛద్దగ్రలపనము లలరన్
రయమునహితపిశాచాసన, హయములఁ బూంచిన రథంబు నధిరోహించెన్. 424

వ. అనేకవిధబాణబాణాసనవర్మకలితంబును జయధ్వజవిరాజితంబును గోత్రిద్వయఘంటాఘోషప్రకాశితంబును నగు రథంబున. 425

శా. శింజారింక మొకింతలేక యసురోత్సాహంబు మీఱన్ ధను
ష్టంకారంబు విహాయసంబు నిండ జంద్రహాసంబు వీ
రాంకంబై తనరారఁ జేక్కొనెను పటుశౌర్యస్ఫూర్తి రత్నకలా
లంకారుండగు రావణుండు వెడలెన్ లంకోత్తరద్వారమున్. 426

వ. ఇవ్విధంబున యమకింకరసదృశనిశాచరధ్వజినీపరివృతుండై వెడలుటయుం గనుంగొని.

క. చాపకళానిపుణుఁ డసమ,చాపుఁడు ఘోరప్రతాపసంయుతుఁడు సుహా
సోపాయనిరతాత్ముండై, యూపాక్షుఁడు వెడలె రణజయోన్నతి వెలయున్. 428

క. కుంభినుతాపరివృతుఁడై, కుంభిరి గ్రక్కదల శౌర్యసంభృతుఁ డగుచున్
జంభాంతకభయదుఁ డగు ని,కుంభుఁడు కుంభీనసోగ్రకోపుఁడు వెడలెన్. 429

సీ. నరసురఖచరకిన్నరయక్షతతులకు నెత్తిపిడుగు శక్రజిత్తుఁ డొకఁడు
బూరువరక్త సంపూరితోగ్రపిపాసఁ దగు దేవాంతకుం డొకండు
సకలజంతుగ్రసనాసక్తవృత్తభీకరుఁ డగు మహోదరుఁ డొకండు
బరిపంథిచిత్త నిర్బంధకృత్ప్రదరనికాయుఁ డౌ నతికాయుఁ డొకఁడు
మఱియుఁ ద్రిశిరాదిసుతులు లురుమత్తమతులు, వెడలి యొక్కుమ్మడి దనతోడ నడువ నడరి
దశముఖుతాళను జైనడి దశముఖుండు, కవిసె వానరవాహినీకాననంబు. 430

క. దుర్భరసమములకు వెలవక, దుర్భలుఁడు రావణుండు దొడిఁబడఁ గపుల
న్నిర్భరత నిట్టు గవిసి ధ,నుర్భుజశాఖి నొకవెట్ట నుగ్గునూచము సేసెన్. 431

క. ఈవిధమునఁ గపివాహిని, చేవసెడ మహారణంబు చేసెడువానిన్
రావణుఁ డశా విభీషణు,చే' ని రాఘవుఁడు విండ్రు చేఁబూని వెసన్. 432

వాట్లుచీగింపు నంచు భయదప్రదరంబుల నీలుమేను జెం
దూట్లొనరించి దేరతలు లొట్ట్రుపడ న్స్వపనార్చి నార్చెఁగన్. 443

ఉ. అక్రమ మప్పులాకు నవలాంశభవుం డగు నీలుఁ డగ్నిభూ
ర్విక్రమఁ దద్రులం దరుల వ్రేసి మదించిన భూరిపుంగరో
పక్రమఁ దద్దశాస్యుఁడు కృపాపరిహీనమనస్కుఁ డంతఁ జ
క్రక్రకచోగ్రశూలపరిఘాప్రతతు ల్విగిడించె నయ్యెడన్. 444

క. తనకన్న మున్న తెలివొంది తపనజుఁ గూడి యుగుగు దెంచి యానుబ్రథం
ఘనతురుఁడు రణాధిజ్ఞతఁ, జనఁ దద్దు రావణుఁడు సంభ్రమఁ దగుమన్. 445

క. అంతటఁ దన నంతఃప్రహా, స్త్రాంగుడుఁ దరదంబుఁ జేర నరుగ నతఁడు నీ
గంటు లుడిగింతు ననుచుం, బంతంబున నగ్గిచిలువుఁ బైనిగిడించెన్. 446

ఉ. అయ్యనలాస్త్ర మొర్వియు విహాయసము న్విజదీప్తి పర్వఁగాఁ
జయ్యనవచ్చె నీలుఁ డదె చచ్చెను జచ్చె నటంచు వానరుల్
కుయ్యిడఁ జుట్టుముట్టి కపికుంజరుఁ గుంజరవైరివిక్రమున్
దియ్య నొనర్చె శత్రులు వడంక నిశాచరు లుబ్బి యాడఁగన్. 447

క. రావణుఁడు శిఖివిశిఖమునఁ, బావని నీలుఁ గని కడువిచారించుచు దు
ర్భారమున నద్రిచరసే, నాపింపం బస్త్రధార నతఁ డెడు నెడలన్. 448

క. సౌమిత్రి ససంభ్రముఁడై, రామునితోఁ బోసు మిట్లు రావణుఁడు కపి
స్తోమము నలఁచెడు నీతని, తామారగ్ని వీని దుర్మదం దలఁకింతున్. 449

వ. అని పలికి యన్నకు నమస్కరించి తదాజ్ఞా ప్రకారంబున. 450

శా. సింహాధ్యాసనాగ్రతంకృత ద్వీపత్సేనాతి భీమంబుగా
రంహఃప్రక్రియ నేగుదెంచి సమరారంభంబు మీఱన్ జగ
త్సంహారంబొనరించు రుద్రుఁ డనఁ బ్రత్యర్థిప్రశిఖాకారియై
యుహాదూషితయంచు లక్ష్మణుఁడు సాహంకారఘోషంబుగన్. 451

క. మర్మవిభేదకములు ఘు, మర్మచ్ఛేదకము లైన వాలమ్ముల న
ద్దుర్మతిపైఁ బోరఁగించెఁ బ్రముఖముఖ్యాసురులు నుతులు సేయంగన్. 452

వ. ఇట్లు పోరఁగిని యద్దురాత్ము నుద్దేశించి. 453

చ. కపటము వన్ని జానకిఁ గలిమ్ముఁ దెచ్చినయట్లు గాదు మ
ద్విపులశరాగ్ని సంజ్వలిత వేదన కోర్చుట యంచుఁ బైపయిం
గుపితమనస్కుఁడై విశిఖపుంఖశరంబులు నింప రాక్షసా
ధిపతి దశాననుండు జగతీపకంపనము గాంచి నవ్వుచున్. 454

క. అన్నపయిం గలమన్నన, నన్నము విడనాడి కాయ లాకులుఁ దిని యి
ట్లున్న సహింపక నిను మీ, యన్న ననుం జెనకఁ బంపెనా చాలంగన్. 455

క. అన్నం బలిచితిఁ దమ్ముని, దన్ని విభీషణుని వెడలఁ దఱిమితి శరణం
బన్న రక్షించితి సాధుల, నన్నెఱుఁగక యెదుర వచ్చినాఁడవు కుమతీ. 456

ఉ. కోఁతులఁ గొండముచ్చులను గూర్చి పయోధిఁ దరించినంతనే
పోతర మెత్తెనే చనక పోటరి వై నిలు మంచు మించుకో
పాతిశయంబునన్ దశరథాత్మజు లక్ష్మణు సప్తమూర్ధనా
ఘాతునిఁ జేసి యార్చె దశకంఠుఁ డనుఁ గిరిలీల నార్చుడున్. 457

గీ. పంక్తికంధరుశిరములు పదిశరముల, నొవ్వనేసి సుమిత్రాతనూజుఁ డాతఁ
డెన్ని శిరములు నిగిడించె నన్ని శిరము, లుగ్రవృత్తి నేసి మరలించుచున్న వేళ. 458

ఉ. పావని ముఖ్యు లద్దనుజునై వెడలింపఁ దొలంగుఁ డంచుధా
త్రీవరుఁ డెంతయుం బ్రణవిధిజ్ఞుఁడు పోరొనరించె నీసుమి
త్రావరపుత్రబాణహతి రావణుఁ డోపక కాందిశీకుఁ డై
పోవక నిల్చునే యనుచు బోరన దివ్యులు దమ్ము మెచ్చఁగన్. 459

శా. యూపాక్షుండు మహోదరుండు నతికాయుం డా నికుంభుండు సా
టోపుం డైన నరాంతకుండు దరఁ దోడ్తో వారి నెల్ల బ్రణ
వ్యాపాదుం డగు లక్ష్మణుండు కఠినవ్యాహారఘోరుండు ర
క్తాపోస్నాతులఁ జేసి యార్చె నిజయూథాంకారదుర్వారుఁ డై. 460

క. కోపమునఁ బంక్తికంధరు, చాపముఁ దునుమాడి యొండుచాపముఁ గొనఁ ద
చ్చాపమును దునిమి రథ్య,వ్యాపార మడంపఁ దలఁచు నంతటిలోనన్. 461

క. శక్తి మిగుల నసురేంద్రుఁడు, శక్తి నెగువ మంట లాకసము నిండ నుర
స్సక్త మగుచు నురునిద్రా, సక్తిక్రియ మూర్ఛ వడియె సౌమిత్రి వడిన్. 462

వ. ఇట్లు మహాశక్తి ప్రయోగంబున సమ్మూర్ఛితుం డగు లక్ష్మణుం గనుంగొని యద్దు
రాత్ముండు రథావతరణంబు గావించి. 463

క. నెట్టుకొని నిజరథంబునఁ, బెట్టుకొని వనాటబలము బెదరఁగఁ బుఱికిం
బట్టుకొనిపోవఁ దత్తను, విట్టట్టుఁ గదలింపలేక యొంతయు నెత్తెన్. 464

చ. ఇరవది చేతులం బెనచి యెత్తఁగఁజాలక మేరుధన్వితాఁ
పుర మగు కొండకొండ సరిపోవునె లక్ష్మణు దేహయష్టి క
చ్చెరు విది యంచు విస్మయముఁ జెందెను రావణుఁ డ్రోఁచి తత్కృతి
బరము గ్రహించి మారుతి కృపాళువు పాలికిఁ బోయె నంతటన్. 465

చ. అరుదుగ నప్డు శక్తి సరయంబుగ రావణుఁ జేర లజ్జచే
నరదము గ్రమ్మఱంగ విబుధాహితుఁ డేడ్తెఱ మీఱ నెక్కి వా
నరకరవాల పత్త్రచరణంబులు ఘోరరణంబులోన భీ
కరకరవాలపత్త్రతతి ఖండములై పడ నేయుచుండఁగన్. 466

చ. పొదలెడుకిన్కఁ జాపరవము న్నిగిడించుచుఁ గన్నుదోయిఁ గెం
పొదవ లయాంతకాకృతి కరోగ్రగదాకృతి నూఁగఁబిచ్చుకం
బొదువుఖగేంద్రుమాడ్కి నృపపుంగవుఁ డేడ్తెఱ రాక్షసేశ్వరుం
బొదివిన సంతసించిరి కపుల్ముదమందిరి మింట నాకపుల్. 467

వ. అరఘుకులశిఖామణి నిజవిశిఖశిఖిశిఖాకలాపంబుల నీకరణిం బొదివిన. 468

మ. మహిజాన్యాపహరు న్సహింపక రణోన్మాదంబు మీఱ ప్రమూ
ఢ్యహుఁ డప్పౌరుషశాతరాస్త్రనిహతిం దగ్ధాత్మమారుత్కసం
పిహితంబు న్నిఖిలం బొనర్చి యహితా ఖిలాట్టహాసంబుతో
విహరింపంగని దానవుండును సమిద్విన్యూహ్రి దీపింపఁగన్. 469

మ. పటువింద్లక్కిడి చాపఠంకృతి నభోభాగంబు భేదింప ను
న్నదుఁ డుద్వృత్తుఁగ రాఘవేశ్వరు పయి న్మార్కొంటయు త్యద్భుతా
స్పద మయ్యెన్ ఖచరాళి కప్పుడు సభాపాత్రంబు రాము ప్రతా
భ్యుదయం బేరి నికేత నిట్లనియె హర్షోత్కర్ష చిత్తాబ్జుఁడై. 470

క. సుగుణుం డగు రావణు భూ, మిగతుఁడవై మాఱుకొంట మేల్గాదు నరే
శ్వరవర కరుణామతివై, పరగున నెక్కుమిదె మద్భుజస్యందనమున్. 471

వ. అని మహానందంబునం బలుకుచున్న నమ్మహాబలనందనునందలి మన్ననంజేసి లాంగూలధ్వజవిరాజితంబును మనోవేగంబును మహోత్తుంగంబును గామగమనంబును నగు కపిరథం బధిష్ఠించి యుదయశిఖరి శిఖరస్థితుండగు తరుణారుణ మయూఖుండునుం బోలె శిలీముఖమయూఖప్రసారంబున శత్రునేత్రకుముదంబులకుఁ గుముదం బొనరింప దశముఖున కభిముఖుండై. 472

క. శరణార్థి నగుచు నించుక, శరణార్థివి గాక తొలఁగి చనకున్న నినున్
శరణాభవుఁడో యిటుడ, శరప్రణాశిఁ జేసి యిట్టు చంపుదు నాజిన్. 473

వ. అదియునుంగాక. 474

చ. అవికలశక్య్వెందు శరణార్థి వధించుట కుత్సహింప రీ
యవనిఁ బుద్ధిసాధ్వి వసుధాత్మభవం గొని తెచ్చి యిచ్చి దా

నచరులమున్ హరింపకు మనం గరుణించెదఁ గాక బంటవై
బవరము సేయు నుద్దవిడి భస్మముసేయక యూరకుండునే. 476

వ. అని పలికి తోడన. 476

క. సాలుగ విసరెడి విశిఖజ్వాలలు వరుణాస్త్రనిహతిఁ జల్లార్చి మహీ
పాలు నురంబును వనచరు, ఫాలంబును నొవ్వనేసి పంక్తిముఖుఁ డనుక్. 477

క. వినుమాలిమీఁది యాసం, జనుదెంచితి గాక నీకు శౌర్యము గలదే
మనుజునొకనిశరణము చొత్తునె వెఱతురు నాకు దిక్పతులు మార్కొనఁగన్.

క. వనచరసమాశ్రితుండవు, మనుజుండవు వశమె నీకు మార్కొన మనుజా
దననాథుఁ బంక్తికంధరు, ననుచు వెసం గవియుటయు మహోగ్రహుఁ డగుచున్.

సీ. నారవు ల్వాచ్చు దర్వీకరంబులభంగిఁ దూపులు వీఁపునఁ దూఱనేసి
కులమహీభృత్కూటకోటిపైఁ బిడుగులు పడుభంగిఁ దలల రోపములు నినిచి
యటవిపై దావాగ్ని యలమికొన్నవిధాన నవయవంబుల విశిఖాగ్నిఁ జొనిపి
ఘనవారిదమ్ముపై గాలివీచినమాడ్కి నరదంబు నాశుగాహతి విరిచ్చి
వెగడుపడిచెఁ బాలివోని విక్రమంబు, మెఱయ దశకంధరుఁడు పరికఱుటమ్ము
లేయఁ గనలుచు నవ్వాహులేయసదృశుఁ, డాయతాంబకముల బాహులేయుటయును

ఉ. అక్కజ మందుదైత్యుఁ గని యక్కటికం బొకయింతలేక వి
ల్లుక్కఱలు చేసి తోడన యమోఘశిలీముఖవృష్టి ముంచి యే
దిక్కునఁ దానయై పటుగతి న్విహరించినఁ బంక్తికంఠుఁ డ
మ్ముక్కఱ నరుండుగాఁ డితఁ డహర్పతితేజుఁడు రాముఁ డారయన్. 481

చ. అని తలపోయు రాక్షసముఖాంబుజము ల్చనఁగ న్శిలీముఖ
ప్రణిహతి నొవ్వనేసి ప్రసభంబున వెండియుఁ జండకాండము
ల్చనిచినఁ గాలుఁ జేయిఁ గదలింప సమర్థుఁడు గాక భీతుఁడై
మనము గలంగ వానరసమాజము నవ్వఁ జూచుచుండఁగన్. 482

వ. సంగరపరాఙ్ముఖుండై. 483

క. రౌద్రోద్రేకన్పపశరో, పద్రవమున కోర్వలేక ప్రాణాపేక్షన్
విద్రావితత్రిపుండు భయద్రుతుఁడై లంకఁ జొచ్చె నసురులు దలఁకన్. 484

ఉ. ప్రల్లద మేది యిట్లసురపాలుఁడు లంకకుఁ బాఱె మేదినీ
వల్లభమూర్తి వెన్దగిలి వచ్చెనచందము దోఁప నెంతయుం
దల్లడ మందుచున్న వసుధావిబుధాహితుఁ గాంచి బాంధవుల్
చల్లని యిష్టవాక్యముల సాధ్వసముం దొలఁగించు నయ్యెడన్. 485

వ. సమరతలంబున. 488

గీ. దనుజశరకోటి తను నంత దాఁకకుండ, నాఁగి యున్ముల్లు శోణితం బానకుండ
నుచ్చి చనఁజేసి యసువుల నుక్కడంచెఁ, గడురయంబున నొక్కఁడె కడకకుండ.

గీ. రాముఁ డరుణాంబుజముఖాభిరాముఁ డగుచుఁ, దక్కు ననిశాచరుల నెల్ల నుక్కడంచి
మీఁతి యంతకును మూర్ఛ దేఱియున్న, యనుజుఁ బొడఁగాంచి కపిరథం బవతరించి.

వ. గజగవయగవాక్షగంధమాదననలనీలసుషేణపనసవినతతారకుముదవేగదర్శివృషభమైంద
ద్వివిదసుగ్రీవాంగదపవనతనయకేసరిశతబలిదధిముఖప్రముఖవలీముఖపరివేష్టితుండై స
ముల్లాసంబునం జేలుచుండె నంత నక్కడ లంకాపురంబున నెట్టకేలకు నొక్కింత
భయంబు దక్కి దశముఖుం డాప్తుల నవలోకించి. 489

క. హరికులిశము హరిచక్రము, హరువక్షోజలమును గ్రౌంచహరు శక్తియు నా
హరిభీకరతరదండము, సరిగా శ్రీరామచంద్రుసాయకములకున్. 490

చ. ప్రథితయశుండు ప్రహస్తుఁడు నృపాలశిఖామణి నోర్వలేక దై
న్యథనుఁడ నయ్యె వైరినిచయంబులు నవ్వుచు సంతసింప వే
పథువు జనింప లంక కిటు పంటవిధంబునఁ బాఱివచ్చితి
న్వ్యధి విపరీతవృత్తిఁ బ్రభవించిన యాపద కింత యేట్రికిన్. 491

వ. అని పలికి పిశాచవేదనాదోదూయమానమానసుండై యూరకుండి. 492

ఉ. నాయనుజన్ము నన్యకపిప్రబలార్చికకాండజన్ము నా
గాయుతసత్త్వుఁ బర్వతగుహాసదృశోగ్రవిశాలవక్త్రగ
ర్తాయుతచారునేత్రుఁ బితామహదత్తవరప్రలబ్ధని
ద్రాయుతుఁ గుంభకర్ణుని నిదప్రవిదారితకుంభికర్ణునిన్. 493

క. బోధింపుఁ డాతఁ డైన విరోధిపరూథిని వధించి రూష్ఠధృతిమను
ప్యాధములఁ గూల్చి లవణాపయోధిఁ గలపి మరలి వచ్చు నొకనిముసమునన్. 494

గీ. శాన నాతమ్ము సుఖసుప్తినుండి యుత్థితుఁ, వాని మేల్కొల్పి యాహారవర్గనంబు
నిర్వహించి మదీయసాన్నిధ్యమునకుఁ, దోడుకొనిరండు చానరాదులు కదంగి. 495

క. ఘననిశ్వసనోచ్ఛ్వాసనో, జ్జనితధ్వనిసమయము నతినిశాచరమయము
న్నున బాహ్యస్థితికలచయముఁ, జనికాంచిరి కుంభకర్ణు శయనిలయమునన్. 496

వ. కనుంగొని యతిప్రయత్నంబునఁ. 497

క. చేరి ఘటకర్ణకర్ణ, ద్వారంబులు రెండు బెట్టు ప్రయత్నంబు గాఁగన్
ఘోరహరినాద ఘనశంఖారవము లొనర్చి నిద్రఁ గదలకయుండెన్. 498

సీ. కృష్ణకర్ణనిశాతకీలలఁ గాఁచిన తైలంబు కర్ణరంధ్రములఁ జొనిపి
ధారాకఠోరకుఠారస్ఫురత్తులచే ముఖమున నందంద మొనసి మోఁది
మత్తదంతావళమల్లంబులఁ గొనితెచ్చి కడువడి నురమున నడవఁజేసి
పలువురు బలియురు పనిపడి తెచ్చి గండాళ్లజాలంబు దేహమున విసరి
కదలఁ గిడిచియుఁ బొడిచియుఁ గఱచియు మఱియు నెన్నియే వ్యాపారనిర్వహణ నిట్టునట్టు
పొరలి నొసవాపులింపుమఁ బొంగ నిద్ర, యొట్టకేలకుఁ దెలివొంది యిట్టు లనియె.

గీ. దివిజరిపులార నన్నుఁ బ్రబోధింపనేమి, యవసరం బిప్డు వచ్చె దశాననుండు
రోషవిమనుండు బలవద్విరోధ మెదిరి, తెచ్చికొనియెనో తెల్పుఁడు దడయకుఁడు గాక.

క. కులభూషణుఁడు విభీషణుఁ, డలఘు సుబుద్ధి నుకలియే కదా యతఁడున్నం
గలుగదు విపరీతపుటా, పులపా టిపుడేల మేలుకొలిపితిరి నను గా. 501

గీ. పెద్దనిదుర వేయ్విపెద్ద తరం బిమ్ము, నెపల బలిమి నెక్కరేని దెలుప
నాఁడు పెద్దనిదుర వీడ్కొందుఁ దవుదాను, లేచెనేని జగము లేఁచుననియె. 502

వ. అట్లు గావున నా పాశాద్మసికసుఖప్రవస్థుండ నగు నాకు యుద్ధంబున మరణంబు
సిద్ధం బని పలికె. 503

సీ. ప్రకట నిద్రాభంగ కల్లోచనము లంగారభానికల ప్రకాశమొంద
నలసత దోషంగ నావులించిన కర్త మద్రిగహ్వరలీల నమకరింప
నాఁకలిగొని చెన్ను గంటిన జఠరంబు బహుశిఖిజలరాశి కీడుగాఁగ
దంతసందష్టనోద్గతిఘోరనాగావ ముర్భంబు పెట్టిరెకునమ్ము గాఁగ
నున్న కుంభకర్ణు నుజ్జ్వలానలకళ్లు, గ్రభాగమునను నడుగ వెఱచి
పార్శ్వముల వసించి ప్రణుతించి యల్లన, నిట్టు లనిరి ప్రశస్తప్రశ్నపరులు. 504

క. ఓ యన్న మహాకార్యము, మీయన్నకుఁ గద్దె నిన్ను మేల్కొలుపఁగ న
త్యాయతమతిఁ బుత్తెంచిన, నీయన్నడ యరుగుదెంచి నిపుణత మెఱయన్. 505

క. నను లేపిరి మన్నెలన, వినఁ దగు కార్యంబు లెట్టి విందు బుభుక్షా
వినివృత్తి గాఁగ మాచే, సిరంటుకములను దృప్తి నెసఁగుచు మనవుడున్. 506

క. కావ్యములు దీర్చి గంధసుమాల్యాగ్రకాకసూపసుహితదవరలు
కావ్యస్థుధరములు దధికుల్యంబులతోడ భక్ష్యకోటులతోడన్. 507

వ. పొతాళవివరంబునుం బోని నిజకంఠబిలంబునం దిగవైచి వెండియు నమ్మంభకర్ణుం
డనేక మాహిషమాంసంబును నపరిమితకుక్కుటపలలంబును నిశ్శేషమహిషామిషంబు
నఁ బహుసుస్వరతరసంబును సుపర్వగ్రథ్యంబును నగణితమాంసపేశితంబును

నధికగోధికాధారువును సమధికమూషికపిండికయును నతిరక్తవిహంగమకాళికయును
సమగ్రజలనగపలలంబును రాశీకృతరక్తప్రవంబును మెసవి. 508

క. శతఘటశోణితముతో దశశతఘటమద్యమును బంచశతఘటమధువుతో
శతఘటగోఘృతము న్నవశతఘటతైలంబుఁ గ్రావి సమునుం డగుచున్. 509

మ. విపరీతాకృతి ఘోరహుంకృతిఁ గులాగ్నిస్ఫూర్తినాసోన్నతిం
జపలప్రక్రియ రాజపద్ధతిని జేపట్టెన్ భ్రాతృవిజ్ఞానప్రలో
లుపబుద్ధిం జమకుంభకర్ణు ఖలశీలుం గాంచి నిశ్చేష్టమై
కపిసంఘంబు భయార్తిఁ జేరెను రఘుశ్రేష్ఠ నాథుసామీప్యమున్. 510

వ. మహోద్భుతలంకాసముద్భూతభూతంబు చందంబున నరుగుచున్నం దనీయవిక్రాంతాకృతిం గాంచి వితిగి పడుచు తరుచరుల నోడకుం డని ధనుర్ధరుండును సత్యసంధుండు నగు పూర్వవంశభూషణుండు దోషాచరకులవిభూషణుండగు విభీషణుం గనుంగొని.

మ. తనఘోరాకృతిఁ గాంచి భూతమనుచున్ దైన్యంబు పాల్పడఁ జే
తనరాహిత్యులపోలె వానరవరుల్ త్రస్తాత్ములై యుండఁగా
తనశస్త్రంబులు జారి లగ్నములుగా దర్పంబుఁ బోవ నీ
తనిపేరెయ్యది నాకుఁ దెల్పు మరియున్ దత్ప్రక్రియావేశినై. 512

క. అనుటయు నమ్మహాత్మున కన్వనీతాత్ముండు. 513

సీ. వీఁడు రావణు ననుజుండు వీనిపేరు, కుంభకర్ణుండు నిద్రగూరియుండు
సమధికబలుండు సమరప్రచండుఁ డాజి, సుస్థిరభుజుండు నాకగ్రజుండు వీఁడు.

గీ. నాగరకుల నెఱుఁగక నిద్రనాగరికము నాఱునెల లితఁడు పవళించుచున్
జాగరమొకదివసము నాఁ, డోగిరము భుజించు సుఖసమున్నతిఁ గాంచున్. 515

వ. మఱియు నద్దివసంబున దివిజులకు నజేయుండగు నీఁడు ప్రజాగరణదినంబు గాన నెత్తిగియున్న దశకంధరుండు భవదీయదివ్యాయుధశిఖిలీకృతదేహుం డైనవాఁడు గావునం గార్యాకార్యవివేకశూన్యబుద్ధిహీనుండై ప్రబోధింపఁబంచినం దెలివినొంది యగ్రజాలోకనాయత్తచిత్తుండును మత్తుండునై చనుచున్నవాఁ డిన్నండేని యన్యులచేత బలాత్కారంబున బోధితుం డగు నాఁడ మృత్యువుం జెందు నని బ్రహ్మవచనంబు గలదు గావున నితండు నీకు శ్రమసాధ్యుండు గాని దుర్భేద్యుండు గాఁ డని పలికి వెండియు నక్కుంభకర్ణు జన్మబలపరాక్రమప్రకారంబులు వేఱువేఱ విన్నవించి నిలిచెను. 516

వ. జనస్థానంబున నుత్తమస్త్రీ మునులుం దొంతంత ప్రియానుజప్రియాసహితుండై బ్రహ్మ
ఋషుల్ న్నాం గనుంగొని సహించెన్. 528

చ. అనఘమతు ల్చతుర్దశసహస్రనిశాచరసైన్యయుక్తులై
మనఖరదూషణాఖ్యు లసమానబలు ల్చని పోరి సర్చి త
ద్ఘనశరవృష్టిఁ బ్రాగినఁ బడంపడి వంచన నేను గాలవే
దినగుచు వానిభార్యఁ గొనితెచ్చితి సీతఁ గజాతలోచనన్. 528

క. పటుకపటంబునఁ దత్సతి, దటుకునఁ దెచ్చుట యెఱుఁగని దమ్ముం డను ను
త్కటశోకవేగమున మర్కటులం గూర్చుకొని కడలిఁ గడచెను వెడలన్. 529

క. అర్కసుతుండు రాముఁడు కోట్యర్కవిభుం డాదివిష్ణుఁ డనుచు మఱియు న
మ్మర్కటులు దివిజు లనుచుం, జేర్కొని తెలిపించె నను విభీషణుఁడు గడున్. 530

క. ఏమమహీసుతరామున, కీనని పలుకుటయుఁ గోప మెక్కిన నను నీ
వానితరణంబు వేడఁగఁ, దా నప్పుడు వెడలించెనుఁ దనమంత్రులతోన్. 531

వ. తదనంతరంబున రాముం డనేకవానరసేనాపరివృతుండై సేతుమార్గంబున లంకా
పురంబుపై విడిసి ప్రహస్తధూమ్రాక్షమహానాదమహాకాయాకంపనాదుల రాక్షసుల
ననేకుల సంహరించి మించి పరాక్రమించి యున్నవాఁ డది యుద్ధ మంగాక. 532

క. హనుమంతుం డంతఁ గా నొక్కవ చరుఁ డనఁగను వెసఁ జవ్వి బలిమునుపై
విను మింతకు మును విక్రమసునుఁ నక్షయుఁ జంపి లంకఁ గాల్చి పోయెన్. 533

ఆ. మఱియు నింద్రజిత్తు మహితోరగాస్త్రాళిఁ, గిష్కవనరాజసింహసూనుఁ
గదిసి యేసిపోయి కాంచినీడు డమై, జరగినచ్చితిని నిజంబు దెల్పు. 534

క. నీవు సహజబలశాలివి, గావున బోధింపవలసెఁ గయ్యమున ధరి
త్రీవరుఁ గూలిచి నాచే, నీవు నడచుము మన నతఁడు ధృతిఁ బలుకుండై 535

సీ. కొంతలడవ్వారకుండి యకుంభకర్ణుఁ, డన్నఁ గన్గొని వింటె దశాస్య వింత
గాదె నరవానరులు వార్ధిఁ గడచు టెల్ల, భంగిఁ దైవపోఁయ డాను శుభంబు గాదు 536

మ. మునుమున్ దాటకసంహరించి భృగురామున్ గెల్చి కోదండవిరా
ధునిఁ జక్కాడి ఖరాదులం జిదిమి మత్తుండైన మారీచునిం
దునుకల్ సేసి బృహన్మదాంధునిఁ గబంధుం గూల్చి యేకాకుగ
మ్మున వాలిం బడనేసినట్టి రఘురాముం డేల మర్త్యుం డగున్. 537

క. సముఁడైనవానియెడ సా, మము దానం బధికునెడల మత్తునియెడ భే
దము హీనుఁడైన యెడ దం, డము [illegible] 538

దిగిచి క్షణంబులోనఁ బగ దీఱ గ్రసించెద మేనఁ బ్రాణముం
దగ వసుధాతనూజ నరనాథున కీయఁగ నీయకొందుమే. 548

క. బాణకృపాణపటుతను, త్రాణంబులు వలదు బాహుదర్పమున రిపు
ప్రాణములు గొందు మూర్ధ, ఘ్రాణంబు లూరించి కుంభకర్ణు ననుపుమా. 549

వ. అనుటయు సంతసించి. 550

క. వాలి నడిచి కపుల రవిజు, నేలించిన భంగి నిన్ను నేలించెద నై
త్యాలి రిపుఁ దునిమి యనుచుం, బ్రేలునఁట స్వపుంసు మన విభీషణునొద్దన్. 551

వ. అదియునుంగాక. 552

క. నిద్రితుఁడవు నీవధికవ, యుద్రుకుఁడను నేను నగుట నహితబలంబు
త్యుద్రేకము మాపెద, నత్యుగ్రచరావలి వధింప నరుగు మనవుడున్. 553

సీ. శరశరాసనకవచస్యందనాదినిజోపకరణముల సజ్జగించి
యుపజయం బెతేఁగించు సమితితూర్యధ్వనులకు బ్రతిధ్వనులకు వెఱవక
శూలంబుఁ జేదాల్చి శూలికైవడిఁ బొల్చి పురజను లోర్వనఁ బొగడుచుండఁ
గలిపయుభయదరత్నసైన్యయుక్తుఁడై తనమునిద్రాభంగమును విరించి
తనయువాక్యములును దలపోసి మగణంబు సిద్ధ మగు టెఱిఁగి చింతలేని
మానసంబుతోడ మానవేంద్రునిచేతఁ, జావుఁ గోరి వెడలె సమరమునకు. 554

క. వడిఁ బురవీథ్యంతమున వెలు, వడి పనివడి కలహమునకు వచ్చెనివాఁడె
క్కడిశంతని కపులచ్చెరు,వడి చూచుచు నుండి కొంతవడికిం దములోన్. 555

ఉ. నీలుఁడు చెప్పెనట్లు రజనీచరరూపక కాష్ఠపుత్రిగాఁ
బోలును గట్టిబొమ్మగని పోఁడిమి దూలఁగ నేల రామభూ
పాలుఁడు దీనిఁ గూల్చు నని పల్కుచు నుల్కుచుఁ నామచుండ నా
భీలుఁడు కుంభకర్ణుఁడు విభీషణపూర్వజుఁ డాత్మయోధులన్. 556

క. తలకడచి దావదహనము, చలిచీమల నేర్చుపగిది సర్వకపులఁ గొం
దలమందఁ గుంభకర్ణుఁడు, లలిఁ బ్రమింగఁ దొడంగెఁ బ్రవిపులముఖుం డగుచున్. 557

వ. భీషణాటోపంబునం గనిమసంగి వనచరులం దిగిచి యహార్యగుహాకుహరసదృశం
బగు నిజబంధురకంధరసుషిరంబులకొలాఁటి విడుచుచుండం గనుఁగొని. 558

చ. పనివడి వానరుల్ వనసపంటికిఁ జీమలు చుట్టినట్లుగా
మునుకొని గంధభద్రగజము న్వడి నీఁగలు మూఁగులాగునం
బెనఁగొన నబ్జమిత్రసుతుఁడు కుంభిన్నిభమూర్తి విదిర్చి వెండియుం
గొనకొని బొక్కఁ బోచ్చె రఘుకుంజరు లంతయుఁ గాంచి పొక్కఁగన్. 559

శా. జ్యానాదస్తనితంబు నిష్ఠురధనుష్టంకారనిర్ఘాత ము
గ్రానేకాంబకవృష్టి మర్కటమహోద్యచ్చాతకామోదము
ర్వీనాథానుజధూమయోని ఘనమూర్తిం గుంభకర్ణాద్రిర
క్తానూనోత్సవ మొంచె దానవహృదబ్జామోదహీనంబుగన్. 580

చ. ప్రకటబలుండు రాముఁడును బాణపరంపరఁ బెల్లు ముంప మ
త్తకరికి నిర్పు చూపిన విధంబున నున్మదలీల శాత్రవ
ప్రకరము నైజసైన్య మనుపాడి దొలంగి కరంబు సాఁచి యం
దఱొని గ్రసింపఁ జొచ్చె నవధీరణఁ గ్రోఁతుల దైత్యజాతులన్. 581

వ. అకైకసీనందనుండు రామలక్ష్మణభయంకరాస్త్రవహ్నిజ్వాలాపిహితుండును వి
నాశితస్వసైన్యుండును విదారితనాసికాకర్ణకోటరుండును నిరాయుధుండును నిరవధి
కాయోధనశ్రమయుక్తుండును నయ్యును జలింపని ధైర్యంబున. 582

క. కరి తుంగమడుపు సొచ్చిన, కరణి న్మందరము జలధిఁ గలఁచుపగిది ని
ర్జరముఖుఁ డరణ్యమేర్చు ప్రకరణంబునఁ గలఁచెఁ గుంభకర్ణుఁడు కపులన్. 583

క. కట్టలుక నిట్టలంచుచుఁ, గట్టిడి యగునట్టి కుంభకర్ణుఁడు గనియెం
గట్టెదుర విభీషణుఁ డోఁ, బుట్టువు నంచద్గదావిభూషితు దుఃఖిన్. 584

చ. కనుఁగొని తండ్రి కుందవు వగం దనుజాన్వయమంతరింప నుం
డ నిలుపువాఁడ వీవ నరనాథు దయ న్నను నెల్లఁబాసిపో
తి నని మనంబునం దలఁపఁ దీరదు మగ్గను లైన బంధుల
న్మనుమును రోసి నిత్యసుఖముం జిరకీర్తియుఁ జెందఁ జెల్లదే. 585

క. నీకబ్బులు వినని యపశ్రీకరుఁ డగు దశముఖుండు చెడుట నిజము సు
శ్లోకుండ వీవిధంబున, శోకింపఁగ నేల తొలఁగి చూడుము నన్నున్. 586

వ. అని పలికి తనకు నమస్కరించి యధోముఖుండను నిరంతరబాష్పసలిలధారాపరిపూ
రిత లోచనుండునై యూరకున్న విభీషణు ననునయించి యతనిం దలమిగిలి. 587

క. చని వానరు లడ్డము సొచ్చిన వారల నింత నురవు సేయక రాముం
గని యిదె వచ్చితిఁ గలహంబునకు ప్రా రమ్ము తొలఁగి పోవకు మనుచున్. 588

చ. పొగరున నిన్నెదిర్చి సరిపోరుట జక్కసలంబు పోరిలోఁ
దెగిరిన యేని చెండియును దేజము నొంద జనించి నీ మొదం
బగనొని గెల్తు నందు నినుఁ బట్టి జయింపఁగఁ జాలనేని పొం
దుగ నినుఁ జేరి బంటు నగుదు న్వను మిట్లు ప్రతిజ్ఞఁ బట్టితిన్. 589

క. ఏను మనుజమాత్రుండను, గాననికాఁబోలు నింత గర్వించెదు నీ
తో నెనసి పోరవచ్చిన, యేను దనుజమాత్రుఁడనె రహింం దలపోయఁగన్. 590

క. సర్గస్థితివిలయములు న్విసర్గముగాఁ గలుగు నింద్రజాలుఁడవు గదు
న్నిర్గుణుఁడ వనుచు దాఁ ధనుర్గుణసారణ విభుఁడు దనుజపతితోఁ దగన్. 59

క. నీకంఠము దునిమి మహో, గ్రాకుండగు రావణు న్వధించెద నని మూ
పోకలఁబోయినఁ జెల్లను, మీకని దశరథసుతుఁడు సమీకోన్ముఖుఁడై. 59²

సీ. ఘటకర్ణ సముదీర్ణ కర్ణ కోటరములు పటుపత్రులకు మన్కిపట్టుచేసి
పాపర్ధను నేత్రకూపము లిక్కిలి కలుచుగా శరపూరితములుచేసి
రాక్షసుముఖగహ్వరంబు నానాజిహ్మగములకు వాసయోగ్యంబుచేసి
దశకంధరసహోదరశరీర కాంతార మతులబాణకదంబయుతముచేసి
కైకసీపుత్రు హస్తశాఖలను ఖగని,వాసములుచేసి మఱియు సవ్యాపసవ్య
ఘోరదక్షక వాటంబుఁ గ్రూరనార, సంబులకుఁ దావుచేసి రోసంబు మిగుల.

క. వాసి గలుగు వాలింబడ, నేసిన యస్త్రమును దానికెన్నఁదగు గుణా
ణాసాంబున మంచుచు, నాసురపతి నొచ్చియును మహాగ్రహముఁ దగుచున్. 594

క. గొదకొని వైరిబల ములు, కదనంబున వెచికొనుచు వారనికినుకన్
గదగొని కదనంబునకుం, గదిసెం గాలాంతకప్రకారము గాఁగన్. 595

వ. కదిసి భయంకరసింహనాదంబు గావించుటయును సహింపక. 596

క. హాసిసహస్రబలుఁడు కృత,హాసుఁడు వాయవ్యశరనిహతి దనుజుబ్బాహ
ధ్వస్త్రము త్రుంచుటయుఁ బరిస్ఫు,సంబై పడియె గదయును జగతితముగన్. 597

చ. గదయును బాహుదండమును ఖండము లైపడ నొండుకేల ను
న్మదుఁడయి సాలముం బెఱికి మానవనాథుకు వ్రేయఁబూనుడు
న్నదురనితేంద్రసాయకముఁ బెద్దయు వేడుక నారిఁ గూర్చి నిం
డఁబెగిచి తక్కరంబును బడ న్వడి నేసె నమోఘవేగుఁడై. 598

క. శరయుగమున ఘటకర్ణుని, కరయుగముం గూల్పఁ జెల్లు గానవియుగమి
ధరణిఁ బడి చదిపె నసురో,త్కరముం గపిబలము నద్భుతస్థితిపోఁపన్. 599

క. శాఖారహితమహోన్నత,శాఖిప్రక్రియ దశాస్యసహజుండు దురా
శాఖిలమానసుఁ డగుచుపి,శాఖనిభుం గవిసె రామచంద్రు న్రెగన్. 600

క. పదహతులన్ ధరణి వియ,త్పదమున్ హుంకృతులఁ గరక్కదల బద్దలుగా
నెదిరించి యిట్లు గవియుడుఁ, గదనకఠోరుఁడు సమధికబలోద్ధతుఁడై. 601

క. తరుచరు లౌననఁ గర్కశ, శరణంబులు దనుజలోకశరణంబులు సం
చరణంబులు ఘటకర్ణుని, చరణంబులు దునిమె నర్ధచంద్రాస్త్రమునన్. 602
చ. పలితభుజుండు నిర్దళితపాదుఁడు నై దనుజుండు ఘోరప
ర్వతముక్రియన్ గుహాతులితవక్త్రము విచ్చుచు వైరిసైనిక
ప్రతతి గలంగఁ గ్రుంగ నరపాలు దెసం బొరలంగ నద్భుత
స్థితి వెలయంగఁ దచ్ఛిరము ద్రెంచె భయంకరసాయకంబునన్. 603
క. సుత్రాముఁడు భీమరణంబున, వృత్రాసురుఁ గూల్చినట్టివిధమునఁ గుంభ
శ్రోత్రుని యామ్యాస్త్రమున సుమిత్రాపుత్రాగ్రజుండు మేదినిఁ గూల్చెన్. 604
గీ. ఘోరసంగరసముదీర్ణుఁ గుంభకర్ణు, ధరణిఁ గూల్చుటఁ దత్కబంధ మురరక్త
ధాతువై యొప్పె నపరసంధ్యాసమయమున, హేమమయగిరినోలె దైత్యకతి చెదర.
వ. తన్మస్తకంబు కదంబవేగంబున రెండవమైనాకంబు చందంబున నంబుధిగర్భంబు సొచ్చె నంత రాఘవుపయిం బుష్పవర్షంబులు గురిసె దేవదుందుభిధ్వానంబులు చెలఁగ నఖిలవానరులుం దమ్ముఁ గ్రమ్మఱ జీవించినవారలుగాఁ దలంచుకొనుచు రామున్ జయజయశబ్దంబుల నగ్గించుచు విభీషణపురస్సరంబుగా నతనిం బరివేష్టించి రతండును సహోదరసహితుండై మహానందంబు నొందుచు నగ్నిజ్వాలాభీలకటాక్షవీక్షణంబు లంకాపురంబుపై నిగిడించుచుఁ గలహంబున కెదురుచూచుచున్నంత నక్కడ.
క. హతశేషులచేఁ దమ్ముని, మృతివిని దశముఖుఁడు దాను మృతునివడువున
స్మృతిచెడి మూర్ఛవడియె ఖండితమగు వటభూరుహమువడిన చందమునన్. 607
వ. పడి కొంతవడికిం గామినీకరకలితలలితశీతలజలాభిషేచనంబునను గ్రమతరసౌరభ్యజనవీజనంబులవలను నొకయించుక తెలివినొంది యాప్తులం గనుంగొని దుఃఖాతిరేకంబున. 608
చ. బుసగులువెట్టుచు న్నిదురవోయెడుతమ్ముని లేపితెచ్చి యే
నసదుగలంపున న్వనచరావళికిం బలివెట్టినాఁడ నాఁ
డ్త సమరమేల మేలని వెడంగు తలంపు దలంచితంచు భీ
తిసెడి విభీషణుండు దగఁ జెల్పె వెఱంగక మోసపోయితిన్. 609
క. అసువ్యర్థప్రాయున సమిద్వసుమతిఁ దానొఱగుచున్నవాఁడై వసుధా
నసమున దూఱఁడె యిపుడే, నసువులయెడ సీతయెడ నిరాశుఁడనైతిన్. 610
గీ. పృథులదర్పసమీరసమేధితంబు, శూలకీలాకరాళమై శుష్కఘోర
వర్కటాటవి యేర్చి రామశరవృష్టి, నాఱిపోయెను గుంభకర్ణానలంబు. 611

క. ఏకాకరుండన వైరులఁ, బూని వధించెదనటంచుఁ బోయి రిపులచేఁ
దాన మృతిఁ జెయ్యెఁ బురుషుఁడు, దానొకఁడు దలంప నొకఁడు దైవము దలఁచున్.
వ. అని బహుప్రకారంబులం బరిదేవనంబు గావించి తమ్మునిం జేరఁబోని. 513
క. హా యను మేరుతులితదే,హా యను వక్త్రజితగిరిగుహా యను దనుజా
హా యను రిపువనహవ్యవ,హా యను సుమనోమచాపహా యను మతియున్. 514
మ. అనుజా నిన్నుఁ ద్రివిష్టపస్థులను డాయన్నేను నీకట్టివా
మనుజాధీశ్వరమార్గణాగ్నిశిఖలన్ ద్రుందం గనుంగొంటి నే
నని వాలింబడి రావణాసురుఁడు ధైర్యావృత్తిచిత్తంబునం
దనుజాలింగని యిట్లు వల్కుఁ బటుచింతాక్రోధఘూర్ణాత్ముఁడై. 515
చ. గతజలసేతుబంధనము గాదె మృతుండగు వానిఁ గూర్చి శో
కితమతు లౌట మీ రరిగి ఖేచరకోటి దలంక నష్టది
కృతులు వడంక హస్తిహయపద్గరథధ్వజినీసమేతులై
హితమతులార రాఘవమహీశులఁ గీశులఁ జంపరం డనన్. 516
క. అంతకసన్నిభు లగుచున, రాంతక దేవాంతకులు మహాపార్శ్వాఖ్యు
ల్వింతతికునంబులకు న, త్యంతగ మంతయును లేని యాత్మలఁ దోడన్. 517
సీ. కాటుకకొండలు కదలి యేతెంచెడుభంగినొప్పెడు మదేభనికరంబుఁ
బూర్వవాయువుల నుప్పొంగు సముద్రంబు తెఱఁగునఁ బోలు సైంధవచయంబు
సంచరద్ఘనసమయాగ్రకాకాల వాళిఁ గ్రమమునఁ గాంచెను శతాంగవ్రజంబు
సమవర్తికింకరసదృశఘోరస్వరూపప్రదీపితవీరభటచయంబు
నాహవపటిష్ఠ మగుచుఁ దో నడుగుదేఁ, సమరభేరీరవంబులు చదలునిండఁ
గదలి యుద్ధాశకంబు లుత్కంఠులగుచుఁ, దాఁకె రిపుమతిబలంబులు తల్లడిల్ల. 518
క. తాఁకిన నంతకమూర్తి స, మీకోన్ముఖు లగుచునున్న మిహిరసుతాదుల్
డీకొని ప్లవంగపృతనా, నీకముఁ బురికొల్ప సురము నిష్ఠుర మయ్యెన్. 519
క. ద్రుమచరులు తగుశిలావ, ర్షము దనుజుల మీఁదఁ గురియ రాత్రిచరులుం ద
ద్ద్రుమచరులమీఁద శరవ, ర్షముగురియించి రతిలోకసాహసవృత్తిన్. 520
చ. అపుడు నరాంతకుండు పరయాఁలు హయాఁలు మరల్చి సాధ్వస
వ్యపగతవృత్తి వానరచయంబు గలంగఁ గొలంగఁ గ్రుంగ శ
క్తిపటిమ శక్తివైవ నుతించుచు దైత్యులు కందడించి ర
ట్లపరిమితప్రతాపనిధియై దన బాధముఁ దాక్రమించుచున్. 521

గ్రహనాయకుఁ డగ్రగణిరోఁది మిన్నంటె భగణి యంతయును సుస్థిరతఁ బొలిచె
గోలఁకులు కమలానుకూలతఁ గొమరారెఁ గడుఁ గిన్నరులకు రాగములు బలిసెఁ
దిశలు విశదంబులై యొప్పె దేవదుందుభిధ్వానలు నప్సరోవరప్రభృతులకొండ
కంబులును జెల్లె నారదుఁ డంబరమున, నాఁడె రావణు పనుపుకు నాత్మఁ బొంగి.

క. మందారకుసుమమయోగా,నందసురభి యగుచు మలయమరుహితం బగుచు
నందనానిల మయ్యాశ్రిత,సందాయని సమ్ముఖమున మలసె శిశిరతన్. 1325

క. శౌరియు సౌమిత్రియు సా,మీరియును విభీషణుండు మృదువచనములం
జేరి కపినికరయుతులై, బోరన వినుతించి రాస్యములు వికసింపన్. 1326

క. కంధరములఁ దునుమాడిన, గంధవహాత్మజుఁ బంక్తికంధరుని లస
త్కంధరములు చిదిమి మహా,గంధవహుం డగుచు నృపతి కడు నొప్పారెన్. 1327

గీ. అంధకార మడంచిన యర్కుఁ డనఁగ, నంధకారాతుఁ దునిమిన యభవుఁ డన మ
దాంధు రావణుఁ బరిమార్చి యప్పు డొప్పె, సాంద్రవిక్రముఁ డగు రామచంద్రవిభుఁడు.

చ. భృశబలు లంజనాసుతవిభీషణముఖ్యులు హర్షకృత్యముల్
విశదముగా నొనర్ప రణవేదిక సంబరవహ్ని విద్విష
త్పృథువిసరం బసృక్ప్రఘృతస్రుక్షణం దగ వేల్చి ట్టిర
ద్దశరథసూతి యాజ్యవభృథా బదిసెల్లె మహామువంబుధిన్. 1329

వ. అంత నమ్మహీనాయకాగ్రేసరుండు. 1330

గీ. సంతసమునఁ జెఱవిడి వ్యసనముచేత, గొప్పరించిన మదనునియొప్పు గాంచె
సౌమిత్రుముదంబుతోడ విల్లెక్కుడించి, లక్ష్మణునిచేత నిడి కృతలక్షుఁడు. 1331

ఉ. రాఘవఘోరకేసరి శరస్ఫుటదీర్ఘవిశాలభీకరా
మోఘనఖావళిం బ్రలయమున్ గను రావణభద్రదంతి వీ
తాఘుఁడు దత్సహోదరుఁ దహంకృతిదూరుఁడు మాన్యసజ్జన
శ్లాఘి విభీషణుం డురువిషాదమునం జని కాంచి దీనుఁడై. 1332

క. పుట్టిననాఁటంగోలెను, బెట్టితనము గట్టి పట్టి బిఁబాధిప్రొక
బిట్టులుకఁ బెట్టు నీకుం, గట్టా కట్టాగవలసెఁ గట్టెఁ డివకుటన్. 1333

క. ఘటకర్ణుఁడు సోదరుఁ డఁట, పటిమ నిపుణుఁ డింద్రజిత్తు కొడుకఁట తాను
త్కటబలుఁడు రావణుండఁట, యిటు కటకట పుడమిఁ గూలునే విధిచెయిదిన్.

క. బలవద్విరోధ మేత్రికి, కల దని నిన్నెత్తి చెప్పి వారింపఁగ లే
నిలఘువ్యాఘృద్ధిగుణా,దు లభింపదె బంధుయుగణఘోరాత్రిఁ బడన్. 1335

గీ. మయతనూజాత యింద్రజిన్మాత శక్ర,వైరివధూమణి కుంభశ్రవోవధూనిక
రేకరంటుకు పట్టపుదేవి యనఁగ, యయ్యె ధరణి మేమి బలకంఠమైనవిధిని. 1344

క. అని పలికెడుఁ జెక్కుల జేఅంగుల, దనుజవిభుం దలఁచి పనివి తద్వల్లభశో
కనిమగ్నయగుచు నటఁ గనుఁగొని యెన్నిజపుత్రమిత్రశోకోత్రికవంబుల్. 1245

వ. కని సహింపని దుఃఖాతిరేకంబున. 1346

సీ. పరిపంథికాండాగ్ని పరిపీత మయ్యె నే యయ్యనేఁ డింద్రజిదంబురాశి
విద్వేషకృపటుశరవృష్టిన యా తైవయారె నేల ఘటకర్ణాలబు
అరికుమారకశక్తి పాలఁజేసి మాయయ్య మాయమ్మగు నె యతికాయశిఖరి
యభియూత్రఘోరాళు గా పాలఁ జెల్లఁబో చెల్లఁగోలఁ బ్రహస్తసితఘనంబు
దస్యుశోపదవానలదగ్ధమయ్యె, శక్రుటకటా నిశాటభాగ్యాటవిప్ర
దేశ మని భీమభూతనివేశ మగుఁ గనుంగొనఁగ లేక మూర్ఛ మునుంగటయును.

క. వనచరులు దెలుపఁ దెలివొంది నమ్మట్టి పక్షిమణులంత ధీరోక్తుల న
వ్యాతకడఁ జేరి తేర్చెచె, ననయాను యనయాసవినయాలాపముల్. 1348

వ. తదనంతరంబున. 1349

సీ. అస్రవాహినులనోలాడుభూతములు నెమ్ములు చవిచూచెడు భూతములును
బిట్టల నాఁ ద్రేను బిల్చుభూతములుఁ బ్రేవులు గబళించెడు భూతములును
మెదడు దెచ్చికొని తిని మదమెక్కు భూతము లొప్పెచ్చలు వెట్టెడుభూతములను
పీనుఁగులను ద్రొక్కి పీఁకుభూతంబులుఁ బొగరుఁద్రేఁచెడు భూతములును
ఆడుభూతములును బాడుభూతంబులు, నాఁడుభూతములును బాడభూత
ములుఁ జెలఁగుభూతములు నవ్వుభూతను, లతిమభూతసంచయమును గలిగి. 1350

వ. భూతభయంకరంబు గాకుండియు భూతభయంకరంబై కీలాలపరిషిక్తంబు గాకుండియుఁ గీలాలపరిషిక్తంబై హారికలీము ఖచక్రపుండరీకబహులఘనరసాకరంబు గాకుండియు హారికలీముఖచక్రపుండరీక ఘనరసాకరంబై కబంధప్రసారితంబు గాకుండియుఁ గబంధప్రసారితమై యొప్పు నప్పౌలికలను నెట్టకేలకు వెలువరించి. 1351

చ. ధృతి వృకబంధకోటికి విధిఁ దగ సాధనయుక్తి వహ్నిసం
స్కృతి పొసఁగించి యెల్లకకల్పితం బకలోకస్తుత్యా
కృతి నెగడొంది యొప్పిన సుధీనుతు శావ్యదశాచు వానర
ప్రతతియుతు స్వభీషణుని రాముఁడు గన్గొని సాదరంబుగన్. 1352

వ. సౌమిత్రిం జూచి. 1353

క. రాక్షసుచేఁ బాలితమగు,దీవికిఁ బ్రతిష్ఠింపుము రా
జైకెలయఁ గాంచె నీరం, డాకుధుగిరిజఠీతీరకాలకేడగాఁగన్. 1354

వ. అని సత్యసంధుండును గరుణాసింధుండును దీనజనబంధుండును బ్రతిజ్ఞాబంధురుండును
నగు రామభద్రుం డాసరిచ్చాటుయు మహాప్రసాదం బని సువర్ణ స్వర్ణ మహార్ఘ వార్ణపరి
పూర్ణభద్రకలశహస్తులగు రసచరప్రశస్తులసహాయంబున నమితవైభవాస్పదం బగులం
కాపురంబుఁ బ్రవేశించి యుచితసమయజ్ఞుండై. 1355

క. పుణ్యగుణులు సేసలిడఁగఁ, బుణ్యయుతులు సన్నుతింపఁ బుణ్యదినమునం
బుణ్యజనసమ్మతమ్ముగఁ, బుణ్యాత్మ నాసీనుఁ జేసి పుణ్యావిధి దగన్. 1356

క. లంకాపుటభేదన మకలంక ధృతి విభీషణునకు లక్ష్మణుఁడు గుణా
లంకారుఁ డింపు కేలి గలంక గొనక యాభిషేకలక్ష్మిం గూర్చెన్. 1357

క. పరమామహితు విభీషణు, పరమామహితు న్నఖిలనిశాటపదవికిం
గరుణారససేచనభా,సురతరపట్టాభిషేకశోభితుఁ జేసెన్. 1358

చ. అమరులలోన నింద్రుఁడు హిమాద్రికులాద్రులలోనఁ దారకా
సముదయమండలంబున నిశాపతి భూరుహకోటిఁ గల్పక
క్రమమున నవ్విభీషణుఁడు రాక్షసరాజికిఁ దా నధీశుఁడై
యమరవిరోధివర్గలసదంతరము న్వెలిఁగించె నెంతయున్. 1359

క. ఈచందంబున సకల ని,శాచరరాజ్యాభిషేకసామ్రాజ్యయుతుం
జూచి విభీషణుఁ బొగడిరి, భూచరభూమిరుహచరనభోగాంత్రి చరుల్. 1360

వ. అంతంత నఖిలరాక్షసరాజ్యలక్ష్మీవిరాజమానుండై మందోదరీప్రభృత్యంతఃపురకాం
తాసందోహంబానందింప వర్తనంబునఁ బ్రసిద్ధుండై 1361

క. పతిమోహలయ్యతమ్ముఁడు, పతితేయల జియ్యకొడుకు పజ్జఁజనితాఁ
బదివేత్తజే లాఁ రింపఁదివిరి శేశెలు తెలి పయి విరివాసల్. 1362

తే. మరియు రత్నాలాడిరి మొనసెదేవ, దుందుభులు మింట నతిశయానహ్చగచాంద్రుఁ
డతి పవిత్రుఁడు మిత్రవంశాబ్ధిసోముఁడు, మిత్రుఁ డాతని మిత్రతమిగఁ జూచి 1363

వ. అభినందించెఁ దదనంతరంబున. 1364

చ. సరసబహూకృతి న్వెలవొసంగిన మాతలి తేరుగొంచు ని
స్ఫురితగతిన్ దిశల్వెలుఁగ సూర్యసుతేశ్వర బాహుసాహస
స్థిరధృతి విక్రమాదులు నుతించుచు నప్రతిలీల దేవతా
వరులకు నుబ్బుమీఱఁ ద్రిదివంబున కేగ ననంతరంబునన్. 1365

సీ. తరవిరూగాతపధరశ్రీలరై ఘనోదయముఁ గోరతులతాతన్వి యనఁగ
నినకరస్పర్శనాపేక్షమై దోషావరనిబద్ధ తైనపద్మిని యనంగ

గతిఁ బలాశ్యగ్రలుఠితలై మాధవాకాంక్షిత శ్రీకలకంఠి యనఁగ
పార్శ్వవిరక్తతాహారలై రాజాతతంగు నెంచుసతీమతల్లి యనఁగ
రాఘవగతాఘదగ్ధ వామోఘబద్ధ,బుద్ధి సద్ధరణిజ జగద్ధితుఁడు మ
రుద్ధితనుతుఁ డు వినతూవతుద్ధుఁ డగుచు, నల్లనల్లన మిగులఁ బ్రియమునఁ జేరి. 1866

చ. కను గొని కేలుమోడ్చి జనకక్షితినాథతనూజ కుల్చు దోఁ
కనిధృతి వాయునందనుఁ డపాస్త భయుండగు నాంజనేయుఁ డ
ట్లనియె నబ్జమాహితకరాంశు పరిస్ఫుట యోగఘూర్ణమా
ననిబిడవార్ధి భంగచయ నవ్య పరస్పర ఘట్టనార్భటిన్. 1867

తే. అమ్మ వినవమ్మ చాలమే యమ్మనీకు, జాలమేలమ్మ రాముఁడొ...నఘసేయు
సమయ మాసన్న మయ్యె నసత్యమాడఁ, జాలమేలమ్ము...నైన జనకతనయ.

ఉ. సేతువు గట్టి రక్కసులఁ జీల్చి విభీషణునెల్ల వానర
ప్రీతిగ లంక నిల్పి విపరీత భవద్వ్యసహాళిభూత చి
త్తాతురుఁడైన రాఘవుఁ డవార్యబలిజ్జుఁడు దాఁ ద్రిలోకవి
ఖ్యాతజయోక్తి నీకుఁ దెలియ న్వినిపింపు మటన్న వచ్చితిన్ 1869

చ. మనమున నూఱడిల్లు మనుమానము దక్కుము నాఁ దదీయవా
క్యనికర వారియోగ జనకక్షితినాథ కుమారికా నిదా
ఘనిహతి చారుచారు...క్లమథం బడఁగ న్మరందబిం
దునపమ సమ్మదాశ్రు నివహంబులు జారె సుమాంబకద్వయిన్. 1870

క. పూని యిటు సంతసించి మునిని జనకమహీభృత్కుమారి కుమారుం
బోనివారికుమారునిఁ దర, నూనిన మదిఁ గాంచి యిట్లనుం దెలివి మెయిన్ 1871

క. ఏకతమ యివ్వనంబున, నేకతమ శ్రమఁ గుంది యిట్లు డిమ్ము
న్నేకతము ప్రాణంబుల, పోకఁ దమిఁ గాక యూఁపి బ్రతిచ్చితి వత్సా 1872

వ. భవదీయ దయావలోకనంబున నాపత్సముద్రంబు ముసుంగక వెడలితి నన్నా ను
మహానందంబు నొందుము నీ మనసునందున నన్యాయమూఁ డామణి వాక్యరత్నంబులను
మెఱుఁగు వెట్టిన చందంబున విభీషణ ప్రేరితంబగు దాసర పుణ్యకామినీసమూహంబు
లు పరమాపురస్కృతం జనకనందనం గదిసి 1873

సీ. ఘనవేణి కురులకుఁ గమ్మనూనియ రాచి యంబుధారాపూరితిం బోనర్చి
మృదువాణి మేనున మేలిసొమ్ములు వెట్టి శరదిందుధవళాంశుకరుచి గూర్చి
గగనావలగ్న ముఖమునఁ దిలకముంచి తారకానూత్నరీతిఁ దీర్చి చేసి
లలి లతాతన్వికన్నులఁ గాటుక పొనర్చి సుమనోమనోహరస్ఫురణ నొసఁగి

గంధగజయానమైనను గంధ మలరఁ, బద్మరాగమిత మృదులీలఁ బాదుకొల్పి
దక్షరాక్షసానేక విమానాధిరోహు, లేసి రాముని సన్నిధి సేసిరపుడు.

క. తడయక జేజేపూజఁ, దడియుచు సరమాపతియు సదాగతిసుతుఁడున్
జడియక ముంగలసందడి, జడియుచు నా సీతఁ దెచ్చి సమ్మతి నిలుపన్. 1874

క. ప్రీత స్విభవమ్ముగివి, స్వీతత్వ దృగబ్జాత రాక్షసీసను పేశన్
భూతలసంభూతం బరి, పూతం గని సుకలు ముదముఁ బొందిరి మిగులన్. 1875

ఉ. మాన్యచరిత్ర కజ్జనకమానవనాయకపుత్రి కప్పురా
జన్యనిఁ దాచువేడ్క మహిజానికి జానకిఁ దాచువేడ్కసా
మాన్యముగాక యెల్లనుల మల్లడి సేయఁగఁ దద్వనాంతరా
న్యోన్యముఖావలోకన మహోముద మొక్కట తెల్లఁబెల్లుగన్. 1876

క. చిరకాలవిరహదుర్భర, తరచింతానిస్సు భూసుతాదాశరథుల్
గరుపారిరి మేనుల నొం, డొరులం దాచికొని పొంగి రుల్లములఁ గడున్.

క, నిధిసన్నిధి యగు నధనుల, విధమున జలరాశి నీఁదివెడలిన భంగిం
బృథివీతనయారాములు, మిథస్సవిధులగుచుఁ గరము మెఱసిన యంతన్. 1878

క. పావనిముఖ్యులు లక్ష్మణ, దేవునితోఁగూడి యపుడధికహర్షమునం
బావనిఁ బుణ్యసతీసం, భావినిఁ గని నెమ్మనములఁ బ్రబలిరి మిగులన్. 1879

సీ. బ్రహ్మాదిదేవతాపటలంబు సనుదెంచి సుమనోభిరాము రక్షోవిరాము
జితపరశ్వధరాము వితతసద్గుణపికారాము నాత్మారాము రాముఁ బొగడి
పుష్పకము ప్రవేశపరవశుచిరుచిరయు వహీశస్యఁ బ్రస్తుతించి
సారకల్పకసుమాసారపూర్వకముగా నప్పతిప్రవరఁ బతికొప్పగించి
యరని మతి వొంగ నప్పుడా యతులరణమ్ము, తులఁ బ్లవంగపతుల నమృతలలితప్ర
వృష్టిప్రబదికించి వెండియు వివిధగతులఁ, బొగడిరి నరేంద్రు రవివంశపూర్ణచంద్రు

రగడ. జయజయపూతనుసంతితతిభూషణ, జయజయదూషణ జలజైరావణ
సుజనవిధాయక సుఖసంధాయక, కృతి వినుతజన వేదవిశత్రన
సురసనిబంధన సాగరబంధన, భరితసలాంగద బాహుబలాంగద
అరిచయ మారక యాజితమారక, సుగణవహోవన సూరిమహోవన
శుకసమత్రన శోకనివర్తన, శుకలప గూవణ సాధితగూవణ
వ్యసన సుదారక సంతతదారక, యసదనోదన హాస్యవినోదన
జనకసుతావర శక్రహితావర, వినుతమహాబల విపుల మహాబల
ఖలఘనధీవర శక్రేందీవర, కలితసులోచన కారుణ్యలోచన

పృథుభవతారక హితబృందారక, ప్రథననిశాచర పద్మనిశాచర
సమిత విభీషణ నాస్తికభీషణ, విమల యశోధన విద్యాశోధన
వపుజిత నారద వందితనారద, విపులనిరూపక విశ్వగురూపక
నతశశిశేఖర నరపతిశేఖర, శ్రితవరదాంకిత సిద్ధపదాంకిత
భయహారివారణ ప్రథనావారణ, భయదశిలీముఖ భక్త్యశిలీముఖ
నిహతశిరోరుహనేత్రసరోరుహ, బహునుతబాడబ భవవనబాడబ
స్మయఖగనాశన మదపవనాశన నతగుణవర్ధన నరభుగ్వర్ధన
మునిపరిపాలన రూక్షవిఫాలన, యానఘనికేతన యహిరిపుకేతన
వశచతురాగమ భక్తవరాగమ, భృశబలవిక్రమ భీమత్రివిక్రమ
కలిమఖరంజన వరద నిరంజన, సలలితతారక సన్నుతతారక
శైశికకంధర కంబుసుకంధర, వీశసువాహన విబుధావాహన
అనయకదంబక హననకదంబక, కనకకృతాంబర కాంతికృతాంబర
పాలితగోగణ పావనగోగణ, కాలనిరూపణ కార్యారోపణ
సకలసభాజన సమ్మదభాజన, ప్రకటనమజ్జన పంకనిమజ్జన
తమ తీరుల నెఱుఁగము నీకంటెను, మముఁ బ్రోచిన భర్తను నీకంటెను
దీనులకొఱకెత్తితి వవతారము, మాకుగ నీనామము భవతారము
చెదరక నిన్ను భజించెడువారికిఁ, గదలఁగనేటికి గంగావారికి
కృతకృత్యుఁడవై కీర్తి వహించితి, కలిశయమిూ శ్రమ మంత సహించితి
నీకగువారము నీదేభారము, ఏదియునేరముఁ గొంచక నేరము. 1881

సర్వతఃప్రాససీసము.

నిస్తులదురిత నిరస్త సదాభయహస్త విశామ్య ద్విహస్త విపుల
శాస్త్రగసంసార దుస్తరాంభోనిధి విస్తారక బుధేష్ట వస్తుదాయి
ప్రస్తుతనుజన సమస్త మునీశ్వర ప్రస్తుత విద్విషాహస్తగంధ
శస్త్రప్రదశర యశస్తోమ తీక్ష్ణగభస్తి వంశాబ్ధిప్రశస్తసోమ
విస్తరామ్నాయ సువిహార నాస్తికహర, హస్తిరిపుకోటి శౌర్యవిధ్వస్త చార్య
త్రస్తలోకోద్ధరణ ఘనోపాస్తికరణ, స్వస్తిపదరామ భక్తవిన్యస్తకామ. 1882

ముక్తపదగ్రస్తకందము.

స్మరసుందర దరసంహార, హారవందిత దితమహారిహారివిభవభా
సురసురభూజిత జితఖర, ఖరశరశరకీర్తినికర కరపదపద్మా. 1883

ఖడ్గబంధోత్సాహవృత్తము. రామనాథ సోమధామ రాజరాజపూజితా
కామితార్థ దాయకా సుకీర్తి సద్విధాయకా
కామినీ సితాబ్జసాయకా మనోజ్ఞనాయకా
కామశోక మోహలోభ ఖండనాదికారకా. 1884

చక్రబంధ శార్దూలము.

జన్యాలక్షితరాత్రిసోత్కర దయాసామర్థ్య శౌర్యక్రమా
ధన్యాగ్రజ్ఞ వపత్రపామరవిరామా ధ్వస్త శోకక్రియా
యన్యాయాపహ నాగభాస్వరకరా నావంద్య భూభ్రమా
మాన్య శ్రీజనకామ నిర్భయద రామా శ్రీదయాదృక్క్రమా. 1885

పాదాదిపాదాంత ముక్తపదగ్రస్త సింహావలోకన ద్విప్రాస నిరోష్ఠ్యకందము.

శరధిధర కేశరధీ శరధీహితకీర్తి నరత చలితాశరధీ
శరధిస్థగితేశరధీ, శరధీరా త్రిభువనాన చయదాశరధీ. 1886

గోమూత్రికాబంధకందము.

సరసీజాక్ష రమాభా, సుసీతాకామ దాసశోకవిరామా
సురభూజా వరశోభా, ధరభూతారామవాసమైకపరామా. 1887

క. అని యిటువలె విధంబున, నిమిషు లిట్లభినుతించి నందఱకును ద
ద్విజనాథుఁడు సెలవొసఁగినఁ, జని పొందిరి రథిమ్రలీల స్వస్థానంబుల్. 1888

వ. అయ్యవసరంబున దశస్యందనుండును నందన సందర్శన సంస్పర్శన సంభాషణ సంభా
వనంబుల నమందానందకందళిత హృదయారవిందుండై 1889

క. మీ కొఱ గొడ్డెములాడిన, నా కొఱ గాయములు సహించి నా కొఱకు మదిన్
శ్రీ కొఱకు లెక్కసేయని, మీ కొఱకులు సమానులే సమిద్యములారా. 1890

చ. అని పరిచేలచందముల నాత్మజులం దడవాడి కౌఁగిలిం
గనుఁగొని రాముఁ జూచి జనకక్షితినాథతనూజ సాధ్వసా
ఖ్యనిహతి చాత్మనోర్చి యనఘస్థితి లోకము కెక్కఁ జేసె నే
మని పలుకంగ వచ్చునని యాడి కడుం గొనియాడి వేడుకన్. 1891

క. తనయుఁ దగుభంగి మ్రొక్కిన, తనయుల దీవించి దశరథవిభుఁడు మునువ
చ్చిన సురసమాజరాజి, న్మన్ననఁ గ్రమ్మఱఁ జనియె దివిజముఖ్యసహితుఁడై. 1892

చ. హరిపదబద్ధురంబుఁ గనలానుగుణంబ బరుణప్రభాఢ్యమున్
గరుడసహస్రము వేగ మనఘంబ బలిరిక్త విశాలతిన్నరా

మరకతచరాభినంద్య విపసమానకళాఢ్య మన:శరణ్య వి
స్ఫురితము సూర్యమండలముఁ బోని కుబేరకపుష్పకాగ్ర్యమున్. 1393

మ. అధిరోహించి సతీసహోదరులు దన్నర్థిం గ్రేసేవింప నం
బుధిపైత్రోవ నుదగ్రశాఖిమృగముఖుండై పూర్వస్తవంగావలి
గ్రథితంబైన విమానరాజమున దిక్శ్రేణియున్నిండఁగాఁ
బృథివీనందన సేతుధర్మమున శ్రీతాత్మఁ గావించుచున్. 1394

మ. చని కిష్కింధయు ఋశ్యమూకము జనస్థానంబు వేర్వేఱ భూ
తనయాసాధ్వికిఁ జూపిచెప్పుచు ప్రగాంధసాంద్రముం జిత్రకూ
టనగేంద్రంబు నతిక్రమించి నదిరూఢ స్వల్పకీరాగ్రభా
దఁబద్ధేష్టఘటా విడారికా తమః భరద్వాజాశ్రమోపాంతమున్. 1395

ఆ. తాంచి యచటఁ బుష్పకసమానతీర్ణుఁడై, రాఘవుఁడు వసుధరాసుతాస
తీసహోదరుల్ నుతింప భరద్వాజు, చరణపీఠమునకు సాఁగి మ్రొక్కె. 1396

వ. అమ్మహానీయు సంయమీంద్రుండు మేదురాదరాశీర్వాదపూర్వకంబుగా నొసంగు
దేవోపచారంబులఁ బరితుష్టుండై యాష్టగోష్ఠివినోదంబులం దగిలి యుండునంత. 1397

క. హనుమంతునిచే నంపియు, వినటుం బ్రయోపవేశ వృత్తి దొలఁగి త
మ్మునితో నందిగ్రామము, మునిభుఁ డాధగతిఁ భుఁడు నుదనున్ వెడలెన్. 1398

క. కడలేని వేడ్కయునియెడ, కడలిమునిఁగి తేలి వెసలి కైకొండుకెదం
గడలుకొనిన పేరిమి నలు, గడలం దగవరులు గొలిచి కదాగ్గ సన్. 1399

వ. శత్రుఘ్నుం గనుంగొని 1400

క. తల్లులకుఁ బౌరజనులకు, నెల్ల సుహృద్బాంధవులకు నెతిఁగింపుచు సం
పల్లలితుఁ డగుచు రాముఁడు, డెల్లి యయోధ్య కరుదెంచునంతయు వేడ్కన్. 1401

క. అని చెప్పి శోభనపదాగ్రనిధి న్నాకేతిరాజధాని నల ఘా
రనిరూఢిఁ బెంపు మీఱఁగ, నొసరి పంబంపు మని సముచితభంగిన్. 1402

శా. కైకానందను దభీష్టదానహితవాక్యశ్రేణితో ర్వీసురు
ల్లోకానూనుఁడు దిగ్విభూగళీ సమాలోల ప్రశస్తప్రభా
స్తోకానూన యశఃప్రసూనుఁ డహితస్తోమానధీనాస్త్రవి
ద్యాకారుణ్య గుణప్రధానుఁడు సమాధానావధానం డొగిన్. 1403

తే. పటుజటోత్కట వల్కలపటలితోడ, వినయమార్గ్యపూరిత విధములోడ
హర్ష సంభ్రమ భయవిస్మయములతోడ, సముచితాచార సజ్జనోత్తములతోడ. 1404

వ. తదనంతరంబున వసుంధరానందనాకుందరపదారవిందంబులకు మ్రొక్కి యయోధ్యాపు రవిముక్తదుర్గుణంబు లగ్గించి మిక్కిలి దీవనలు వడసి సమస్తంబు కుశలంబ యని యడుగుడు. 1416

క. అతఁ డరుదైన విధమునఁ, గౌతూహల ముప్పతిల్ల గాఢస్నేహా పేరమతిఁ గౌఁగిలించిరి, ఖ్యాతిసుమిత్రాసుతుండుఁ గైకాసుతుఁడున్. 1417

తే. అచట శత్రుఘ్నుచే రాఘవాగమనము, విని వసిష్ఠుఁడు ముదమంది విన్నుముట్టి దశరథాంగనలును దోనఁ దగినయాన, పంక్తిలోఁ జనుదేరఁగఁ బయలుదేఱి 1418

క. పరమోత్సరం బయోధ్యా, పురమునఁ గావింపఁ బంచి భూరిద్యుతివి స్ఫురితాంబరప్రస్ఫురుఁ, డము భరద్వాజనియమిధన్యాశ్రమమున్. 1419

ఉ. చేరి వనాటరాత్రిచరసేవితు నాతఁడు భ్రాతృయుక్తు ధా త్రీరమణీసుతాయుతుని శ్రీరఘురామమునీంద్ర వంద్యుఁగ న్నారఁగఁ జూచి జన్మము కృతార్థత నొందె నటంచుఁ దన్నమ స్కారము లర్ఘ్యపాద్యములుఁ గైకొని కైకొని యాదరంబునన్. 14'0

వ. ఆశీర్వదించి యభినందించి. 1421

క. దశకంఠుని బాధల దుర్గదశఁ గంతుకాంతులైన ప్రజల దివిజుల న్వశదగతిఁ బ్రోచు మతిమను,జశరీరం బూనినట్టి శార్ఙ్గి సుమూర్తి 1422

త్రిమూర్త్యాత్మక సవకందకము. శశవిప్రవినుత యమ్యత,భవభయ మోచన శశిప్రభాకరరాజీ వవిలోచన దేవముఖవి, భవభాషానాథవంద్య భవ్యవిధానా. 1423

వ. అని యనేక విధంబుల నతని విపినవాసకథాసేతువిధానుగకథావిక ప్రయోజనం బు లుగ్గడించి సౌమిత్రి యుచితవర్తనంబుఁ గీర్తించి జానకి యుత్తమగుణంబులు తెత్తి పొగడి యానందించుటయు. 1424

క. అంత వినుమన్న సుమిత్రా, సంతత్యవరజనితుండు శత్రుఘ్నుఁడు ఘా లాంతాంజలి పుటుఁడై సక్ప,త్సంతోషముతోడ రామచంద్రుపదములన్. 1425

క. తననయనచకోరంబులు, దనివోవఁగ నూఁదియార్చ తమ్ముఁ శత్రు ఘ్నుని నప్పుడు గాఢాలిం,గన మొనరించి నృపంబుఁ గడుమూర్కొనుచున్. 1426

క. దీవించుచుఁ దమ్ముని సం,భావించుచు నిర్విఘ్నునఁ బరిరంభణసౌ ఖ్యావహమున మేను మఱచి, భూవిభుఁ డసకృత్ప్రమోదమున మునుఁగుటయున్.

వ. లక్ష్మణానుజుండునుం బోంగియుండె నంత రాముండు ననుజసమేతుండై. 14:8

క. మొగిచిన చేతుల ఘాల, మొగ్గిఁ జేరిచి నిభృతిపారసూత్రమమణిచే ముగురమ్మలఁ బోలిన యా,ముగురమ్మల పాదపద్మములకున్ మ్రొక్కెన్. 1429

వ. అని సీతం బొగడి కన్నులం గప్పికొని పురుషార్థ చతుష్టయంబుం బడసిన పుత్రచతుష్ట
యంబుం గని ప్రమదం బావహింపం దమమనంబుల. 1440

క. వసురాశిం గనిన చక్రము, లసదృశ్యవసురాశిఁ గనిన యధనులుం గడుసం
తసమందు రీతిఁ బుత్రుల, వసునిభులం గాంచి యుత్సవము నొందు నెడన్. 1441

వ. భరతుండును భృత్యామాత్య పురోహితాది సముచితపరివార బంధుసమేతంబుగా
యాత్రక్రమంబున భరద్వాజ సందర్శనంబు నడిపి పవనతనయాదుల సాహసోపకార
ప్రకారంబు లగ్గడించె నపుడు. 1442

క. జానుమెఱయు రాఘవుఁ డాజానుభుజుండు రాముఁ డుల్లసము మీఱ మహీ
జానుజులతో భరద్వాజానుమతిం బడసి కపిచయం బగ్గి పడెన్ 1443

సీ. కువలయానందమై గురుతైర్థ్యకరమయి నవనూత్నచంద్రమండల వసంగ
నమితచంద్రామోద మైసద్విభూతియై పరమేశ్వరుని జటాభాగమునఁగ
నవిరళ నీలమై భువ ప్రశస్తమై యుచితప్రావృడ్ఘనము చమనంగఁ
గంధాతిమయమయి కలితావదాతమై మేరుకైలాసప్రకారమునఁగ
భూరిసార ప్రవాళ విస్తార మగుచుఁ, బ్రకట హరిపూర్ణతరవనరాశి యనఁగ
యూథి దనరారు పుష్పకారూఢుఁ డగుచు, రాముఁడును సుజగదభిరాముఁ డగుచు.

క. వినుత హరికోటిరమణునఁ, జని నందిగ్రామము న్విశాలమతిగపా
వనదిగ్రామము నెనుకం,గని భూమివిభుండు పుష్పకముఁ దగ డిగె నెడన్. 1445

క. వసుధామకులమణి ముఖ్యన, వసుధామయవాజ్ఞితుండు భరతుండు భక్తి
స్వసుధారాజ్యభరముతో, నొసఁగిన పాదుకలు దొడి యుహాజ్జ్వలభంగిన్. 1446

వ. నందిగ్రామంబున నపూర్వవిలాసం బావహింప భరతావాసంబునకుం జని. 1447

సీ. కోత్రిబాంధవదృక్చకోరంబులకు మందహాసచంద్రిక సముల్లాస మొసఁగి
సన్మునీశ్వరసాధుసహాకారబృందంబులు విపులదయామృతవృష్టిఁ దనిపి
వలిమఖధ్వజనీకులదమందముఁ గటాక్షాంశుయోగంబున నలరఁ జేసి
పౌరజానపదప్రస్తావసద్యము వాక్సుధాంబుపూరమున దైన్యము వాపి
సరగ భరతాదిసోదర సమ్మతంబు, రాశి నిజరాక నపూర్వఁగఁ జేసి రామ 1448
చంద్రభూజాని భూలోకచంద్రుఁ బోని, కాంతి నొప్పారె నరివారకరినుఁ డగుచు.

వ. అఖండాఖండల వైభవ ధిక్కారియై సమస్త బంధుపరివారంబులుం బరివేష్టింప సుఖోపవి
ష్టుండై యుష్టగోష్ఠీ సంతుష్టాంతరంగుం డగు రామచంద్రుండు నిజపాదుకామూల భరతమ
హీపాలకృతవిశాలమహీపాలనసౌష్ఠవం బభినందించు పౌరజానపదలోకాలోకనంబు
నం గురూపాలుండై. 1349

క. బహుమానపూర్వకముగా, గుహునిం బోఁబనిచి యారఘుప్రభుఁడు మహా
మహుఁడగు సోదరత్రయ, సహితుండై పటు జటావిసరము సదిర్చెన్. 1450

చ. ఇటులు జటోత్కటుం డపనయించి పృథుస్తనయుత్న మండలో
ద్భట పటలంబుఁ ద్రోఁచిన సుధానిధిచందము నొందె సద్భటా
ర్భటులు లలిమంగ నంత రఘుపుత్ర మహాత్రము నిల్పియుంచె వి
స్ఫుట పటుశోభనంబులను జొన్నెడు దాని నయోధ్య కేఁగఁగన్. 1451

క. కదుకొని నినుఁ దలఁచిన యప్పుడు వత్తువుగాని కదలి పొమ్మని పూజ
లను నొనరించి కుబేరుని, కడ కనిచె న్నృపుఁడు పుష్పకము సావరుఁడై. 1452

వ. తదనంతరంబున.

శా. స్నాయుద్భక్తితరు ల్సహోదరవరు లాప్తవ్రాంబులుం గొల్వఁ బా
దాయుగ్మోచ్ఛ మహోత్తమాంగుఁడు మరుత్పుత్రుండు మున్నెక్కదై
తేయస్వామి విభీషణుండు సుభక్తిం జేరి రా నప్డు యా
త్రాయత్తంబగు చిత్తవృత్తి రఘువంశస్వామి యుత్సాహియై

క. కుండల దీప్తిక్షాళిత, గండస్థలుఁ డగుచు రథముఁ గైకొని యొప్పెం
జండకిరణుండు పొడుపుం, గొండ పయిన్వెలుఁగు గతి రఘుప్రభుం డంతన్. 1354

శా. చక్రాక్రంద సహస్రభానురుచిరోచ్చప్యంద హారాంచిత
చ్ఛత్రాళి న్వెలయింపఁ జేయుచు మనోజ్ఞ ప్రక్రియాలోలుఁడై
శక్రాద్యష్ట దిగీశభావిత యశోజాలప్రతీతుండునై
శక్రాశ్వప్రహసత్తురంగమ వెసలె న్సాకేతవీథ్యార్థియై. 1455

వ. తదవసరంబునం గౌసల్యయు సపత్నీద్వయసహితంబుగాఁ బుణ్యాంగనాదీనీకదంబకల
యుతం బగు జనకనందన కన్నీధంబు ననుసరించి సముచిత యానంబున వెడలె నంత.

మ. హితవృత్తిం జని రాఘవుండు గనియెన్ హేమప్రభాజాలవి
రాజిత పక్షద్వయచక్రవాక మిథునాత్మప్రచారంబుఁ జా
రుతరంగోద్గతవాతకంపితమహీరుట్ఛాఖికాడోలికా
స్థితకీరంబు లసన్మనోజ్ఞ సరయూతీరంబు దూరంబునన్. 1457

క. కని తత్సమీపమునకుం, జను నప్పుడు కుముదకమలసౌరభము నెసం
గొనిన మలయానిలమున, మ్మనిఁగిన రాముఁ డుత్కంఠుం డిట్టనియెన్. 1458

సీ. కలిత రక్తోత్పల కళికావిశేష హారతి దీపకళికాప్రతతులతోడ
నధికవాఃకేళిసమాయాత భద్రేభపటుకుంభ భద్రకుంభములతోడ

వరుణపరిపీయహ సరోవిహారమునక, రమ్యులకునొప్పు సుమపరాగమ్ములగుచుఁ
బలురథములకు కర్కకంబళములగుచు, వరుణఁతి మించెఁ దరుణారుణాతపములు.

చ. అహిమకరోరుభాస్వదుదయమ్మునకు న్మునుగాఁగ వేకువ
న్విహసహాజమ్ముఁ దన్ప్రపతిచంద్రుఁడు రాముఁడు వందిమాగధ
ప్రహితనుతుల్చెలంగఁగఁ బ్రభాతమునం దగ మేలుకాంచెఁ బూ
ర్వహిమకరాననాంతురుచి యందొఅకందొవలుత్సహింపఁగన్. 1478

వ. మేలుకని కృతకాల్యకరణీయుండును ధృతదివ్యాంబరవిభూషణుండును నతసామంత మహీపాలకుండును వృతబంధుసహోదరామాత్యుండును భృతమహీదేవతానివహుండును సంతతపౌరజానపదకల్పితప్రవరప్రకరుండును స్మితసుందరాధర ముఖాంభోజుండును మితచతురమధుర వాక్సమాజుండును మహోదారుండు నగు రామరాజుం గనుంగొని సమన్విత వామదేవాది మహామునిశ్రేష్ఠుండగు వసిష్ఠుం డెల్లవారల యుల్లంబులుఁ బల్లవింప నల్లన నిట్లనియె. 1479

ఉ. చేరువ యయ్యె మాపతము శిష్యులఁగూడి మునీంద్రులెల్లరుం
జేరి రయోధ్యజానపదసేవిత యయ్యె వరాభిషేకసం
భారములెల్లఁ జొప్పడె సమస్తమహీవలయాధిరాజ్యమిం
పారఁగ రామమూర్తికి సమర్పణసేయుట చాలమేట్రికిన్. 1480

క. సుతపుణ్యనదీజలములుఁ, జతురంభోధ్యుదకములును శైలచయులు స
మ్మతిఁ దెచ్చి రఖిల జనమాన్యతమై పట్టాభిషేకనిలయుం బనురేన్. 1481

వ. అని పలికి కౌసల్యాగర్భసంభూతభూత ప్రభూతవర్తనం బుగ్గడించి. 1482

క. పదునాలుగువర్షంబులుఁ, బదునాల్గు యుగంబులయ్యె భరతునకతఁడు
మ్మదమంది ధరాభారముఁ, గదలిచి రాఘవుల బెట్టఁగా నెంచెనుమన్. 1483

క. కావున రాఘవు నఖిల మహీవలయమునఁ బేర్మినేలు విభునిగాఁ
గావింతమ యభిషేకమహావిభవం బనుచు దుర్భ్రాంతదనుకన్. 1484

వ. సమస్తజనానందకరం బగునమ్మహోత్ర దశరథాంగజుకెతెంగించి తదనుమతంబు వడసి దేవతాజయజయధ్వానంబులతోన భూదేవతాశీర్వాదంబులును దివ్యదుందుభి రవంబులతోఁ దూర్యారవంబులును కల్పకప్రసూనాసారంబుతోన పుణ్యకాంతాక రాక్షతాసారంబులును గంధర్వాప్సరోలాస్యంబులతోన వేశ్యాలాస్యంబులును నొక్కట నింగికి న్నేలకుం జాలియొప్ప నప్పు డరుంధతీవల్లభుండు సితప్రభాభాసురం బును ముక్తాఫలవికీర్యమాణంబు నగు క్షీరవార్నిధిచందంబోని సభామండపాభ్యంత

రంబున నత్తుంగంబై పూర్వశైలసదృశంబగు భద్రాసనంబున రోహిణీపతినయందగు
హిమకరుఁబట్టి జానకీసనాథు రామమహీనాథు సుఖాసీనుం జేసి రంత. 1485

క. నవరత్నమయాలంకరణవిశేషము పేర్మిరోహణమహీధ్రమునా
నవనివిభుఁ డొప్పుచుండె నప్పుడు వసిష్ఠాదిమునులు గదిసి కడునొక్కనయమునన్ 1486

మ. ఉపమాతీత యశోధురంధరు గుణాఢ్యు న్సర్వ సర్వంసహా
ధిపతిత్వంబు వహింపు మీ రనుచుఁ బ్రీతిన్భర్మపట్టంబు సు
త్యపదిష్టస్థితి మానవేశ్వరలలాటోపాంతముం గూర్చి ర
చ్చపలేఁగప్పం జెనుమల్పు తీవమెఱపు స్సంధించుచందంబునన్. 1487

చ. కలిత మనోజ్ఞపల్లవనికాసిత పుణ్యనదీజలోజ్జ్వల
త్కలశము లొప్ప సవ్యగక జనులన్ ధరియించి వారిచం
దురితులు చెద్ద ఋషిసమూహ జిల్కుము మాపయినంచుఁ జెల్వు న
చ్చెలువున రామచంద్రు నభిషేక మొనర్చిరశేషభూమికిన్. 1488

వ. మఱియుం దగువారెల్ల రాఘవుం బుణ్యతీర్థజలంబుల విధ్యుక్తక్రమంబున నభిషే
కించిరి 1489

సీ. కుముదబాంధవు బోలెఁ గువలయానందుఁడై యమృతధారాపూరితాత్ముఁ డగుచుఁ
గనకాచలము బోలె ఘనసానుకటకుఁడై విబుధనదీజలవిమలుఁ డగుచు
నష్టమూర్తి బోలె నాగ్యనుకూలుఁడై సంగతగంగోత్తమాంగుఁ డగుచు
నీలాంబుదము బోలె శాలివిలాసుఁడై విహితాంబుపూర సంపిహితుఁ డగుచు
కల్పకము వోలె మధురసకలితపాణి, పల్లవుండయి యభినవఫలుఁ డగుచు
సీతతోఁ గూడి పట్టాభిషేకశోభనము వహించెడువేళ రామమహీవిభుండు. 1490

క. పాటించి రామమూర్తికి, హాటకకలశోదకంబు లభిషేకింపన్
మేటి జలధారలొప్పెం, గాటుకకొండపయి వజ్రకవచముమాడ్కిన్. 1491

వ. ఈరీతి నఖిలభూతధాత్రీవలయాభిషేక సామ్రాజ్యసంశోభితుండై గురుబ్రాహ్మణ
మాతృదేవతావందనంబు లాచరించి సమస్తజనంబుల నభిమతప్రదానంబులం దనిపి సం
తుష్టుండై. 1491

క. ఆవిభుఁడు దనరుఁ గానుకలు, గావేలుపు లంపినట్టి కనకాంబరభూ
షావిసరము వాద్యతి సుగ్రీవాదుల కొసఁగి సత్కరించుచు మఱియున్. 1493

వ. అభీష్టగస్తప్రియవచనంబుల నలనీలాంగదజాంబవద్విభీషణాదులం దనిపి వచ్చుచుం
బోవుచుండుఁడుగాక యని వారివారి నివాసంబులకుం బొడుచుం బొమ్మనట్లు

# అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వము.



| | | | | |
|---|---|---|---|---|
| 1 | జాహ్నవీమాహాత్మ్యము. (ఏచు.గు లక్ష్మణకవి) | 0 | 10 | 0 |
| 2 | సీమంతినీకళ్యాణము. (పెనుమళ్ళ సోమన్నకవి) | 0 | 10 | 0 |
| 3 | విజయనందనవిలాసము. (మంగళగిరి ఆనందకవి) | 0 | 10 | 0 |
| 4 | వాల్మీకిచరిత్రము. (రఘునాథభూపాలుఁడు) | 0 | 8 | 0 |
| 5 | రంగనాథరామాయణము. (కాచభూపతి విఠ్ఠలరాజు) | 1 | 0 | 0 |
| 6 | శ్రీరంగమాహాత్మ్యము. (కట్టా వరదరాజేంద్రకవి) | 1 | 0 | 0 |
| 7 | సారంగధరచరిత్రము. (కూచిమంచి తిమ్మకవి) | 0 | 12 | 0 |
| 8 | భార్గవపురాణము. (కొండూరి వేంకటదాసు) | 1 | 4 | 0 |
| 9 | నారాయణాచలమాహాత్మ్యము(–ల్లమరాజురంగధామకవి) | 0 | 12 | 0 |
| 10 | శ్రీలక్ష్మీనారాయణపరిణయము. (శివపల్లి సర్వోత్తమకవి) | 0 | 12 | 0 |
| 11 | నలచరిత్రము. (రఘునాథభూపాలుఁడు) | 1 | 0 | 0 |
| 12 | సర్వకామదాపరిణయము. (శిష్టు కృష్ణమూర్తికవి) | 0 | 10 | 0 |
| 13 | సీతాపరిణయము. (వాసిరెడ్డి సుబ్రహ్మణ్యకవి) | 1 | 0 | 0 |
| 14 | మిత్రవిందాపరిణయము (శ్రీరాజా రావు జనార్దనరంగారాయణింగారు, బొబ్బిలి.) | 0 | 4 | 0 |
| 15 | నానార్థనిఘంటువు | 0 | 4 | 0 |
| 16 | నీలాపనిందానివారణము. (మాడభూషి నృసింహసూరి) | 0 | 4 | 0 |
| 17 | బలరామక్షేత్రమాహాత్మ్యము. (మండపాక కామకవిగారు) | 0 | 8 | 0 |
| 18 | సుధీరంజనము అను ధ్రువోపాఖ్యానము. (ఓగిరాల జగన్నాథకవి) | 0 | 4 | 0 |

వలయువారు:—అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము,

చిత్రాడ, పిఠాపురము,

తూర్పుగోదావరిజిల్లా.

# శ్రీ రామవిలాస గ్రంథమాల

## —। నవలలు. ।—

| | | |
|---|---|---|
| 1 | ప్రభాతము | 1_0 |
| 2 | వినోదిని 1 వ భా. | 0_12 |
| 3 | వినోదిని 2 వ భా. | 0_12 |
| 4 | ప్రేమలత | 0_8 |
| 5 | పరుసవేది | 0_8 |
| 6 | మయసభ | 0_10 |
| 7 | అపూర్వప్రతిభ | 0_10 |
| 8 | ఛాందసులాన | 0_10 |
| 9 | చినరంగరావు | 0_6 |
| 10 | హర్ష చరిత్రము 1 భా | 0_8 |
| 11 | పాణిగ్రహణము | 0_1 |
| 12 | సహృదయ | 0_4 |
| 13 | తాతాజీవితము | 1_0 |
| 14 | దోమాడయుద్ధము | 0_12 |
| 15 | కమలావతి | 0_10 |
| 16 | స్నేహలత | 0_14 |
| 17 | రసపుత్రజీవనసంధ్య | 0_14 |
| 18 | కాంచనమాల | 0_3 |
| 19 | సీత | 0_10 |
| 20 | మధురమంజరి | 0_12 |
| 21 | దమయంతి | 0_8 |

## —। ఇతరగ్రంథములు. ।—

| | | |
|---|---|---|
| 22 | శ్రీనీతిపద్యరత్నావళి | 0_ |
| 23 | రాయలరాజనీతి | 0_ |
| 24 | ఐరోపామహాసంగ్రామము | 0_ |
| 25 | ఓటరులకర్తవ్యము | 0_ |
| 26 | విద్యావంతుని ధర్మములు | 0_ |
| 27 | హితవాది (విమర్శనము) | 0_ |
| 28 | గోషా | 0_ |
| 29 | సంగీతవ్యాసములు | 0_ |
| 30 | భగవద్గీతామృతబిందువు | 0_ |
| 31 | చమత్కారరత్నావళి | 0_ |
| 32 | బద్దినీతులు | 0_ |
| 33 | కీ॥ శే॥ కావ్యనిధి శ్రీచెలికాలచ్చా [illegible] యజీవితచరిత్రము | 1_ |
| 34 | కుచేలుడు | 0_ |
| 35 | ప్రేమమయిరాధ | 0_ |
| 36 | రుధిరస్రవంతినాటకము | 0_ |
| 37 | శ్రీరాముని జీవితచరిత్రము. | 1_ |
| 38 | మల్లెమొగ్గ | 0_ |
| 39 | రోహిణి | 0_ |
| 40 | పాణిగ్రహణము | 0_ |
| 41 | వెలమలుక్షత్రియులా ? | 0_ |
| 42 | కురంగము | 0_ |

వలయువారు:— శ్రీరామవిలాసగ్రంథమాల,
చిత్రాడ పిఠాపురము,
తూర్పుగోదావరిజిల్ల